# 1997 తెలుగు కథాసమీక్ష

## సమీక్షకులు

పి.ఎస్. గోపాలకృష్ణ
ఉప్పల నరసింహం
గోవిందరాజు రామకృష్ణారావు
వసంతరావు దేశపాండే
యస్వీ సత్యనారాయణ
సింహప్రసాద్
రావి-ఎన్-అవధాని
యస్వీచారి
ఐతా చంద్రయ్య
సుమనస్పతి రెడ్డి
కాలువ మల్లయ్య
శింగరాజు మాధవరావు
అబ్బూరి ఛాయాదేవి
బీనాదేవి
ఆవుల మంజులత
సి. మృణాళిని
కె.బి. లక్ష్మి
అల్లూరి గౌరీలక్ష్మి
జ్యోత్స్నా ఇలియాస్
తెన్నేటి సుధాదేవి
కె.ఆర్.కె. మోహన్
అనంతలక్ష్మి
బొంగు వేణుగోపాలరావు
వీరాజీ

సంకలన కర్త

**డా॥ వేదగిరి రాంబాబు**

---

శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్
1-8-59/1/7, చిక్కడపల్లి,
హైద్రాబాద్ - 500 020.
ఫోన్స్ : 040-7667665, 7661116

# 1997 TELUGU KATHA SAMEEKSHA

Compiled by
**Dr. Vedagiri Rambabu**
For **Sri Vedagiri Communications**

Cover Design
**BAPU**



First Edition
March, 1998

Price
Rs. 50/-



Distributors :
1. Visalandhra Publications, Abids, Hyderabad.
2. Navodaya Book Distributors
Opp. Aryasamaj, Sultan Bazar, Koti, Hyderabad

Composed and Printed by
**ESSES GRAPHICS**, A.C. Guards, Hyd - 4.
Phone : 3322491

# అంకితం



1997 జనవరిలో అయిదు రోజులపాటు ఘనంగా రిగిన 'కథారచయితల కార్యగోష్ఠి' కేంద్ర సాహిత్య అకాడమి ర్వహించడానికి ప్రధాన కారకులు, కేంద్ర సాహిత్య కాడమి సలహాదారు, ప్రముఖ భాషా శాస్త్రవేత్త, ంధ్రకేతనాన్ని అంతర్జాతీయ స్థాయిలో ఎగురవేస్తున్న హితీకారులు **ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి అత్యంత మాభిమానాలతో ఈ చిన్ని పుస్తకాన్ని అంకితమిస్తున్నాను.** లుగు కథాభ్యుదయానికి వారి వంతు సహకారం ఇలాగే భిస్తుండాలన్నదే మా కోరిక!

వేదగిరి రాంబాబు

30.3.98

# కథాభివందనం

1994లో డా॥మధురాంతకం రాజారాం గారి సలహా ననుసరించి, ఆ సంవత్సరంలో వచ్చిన కథలన్నింటినీ సమీక్షింపజేసే వ్యాసాలతో సంకలనాల్ని తేవడం ప్రారంభించాం. అప్పటినుండి తెస్తున్న ఈ సంకలనాలలో వ్యాసాలు రాస్తూ సహకరిస్తున్న, పత్రికలలో సమీక్షిస్తున్న సాహితీ బంధువులందరికీ ముందుగా నా నమస్కారాలు.

ఇది నాల్గవ సమీక్షా గ్రంథం. ఇరవై నల్గురు వ్యాసాలు రాసి ఈ గ్రంథం వెలుగు చూడడానికి తోడ్పడ్డారు. ఏటా సంవత్సరం పొడవునా వచ్చిన కథల మీద వచ్చిన ఓ సమీక్షా వ్యాసానికి **'వేదగిరి పూర్ణచంద్రరావు స్మారక సమీక్షా అవార్డు'** నిస్తున్నాం. ఈ సంవత్సరం ఆ అవార్డు **డా॥ సి. మృణాళిని** వ్యాసానికిచ్చాం. ఆ వ్యాసాన్ని మీరు ఈ పుస్తకంలో చదవవచ్చు.

ప్రముఖ చిత్రకారులు **శ్రీ బాపు** ప్రచురించిన ముఖచిత్రాన్నే ఏటా రంగులు మారుస్తూ, చూడగానే ఇది కదా సమీక్ష అని స్ఫురించేలా ప్రచురిస్తున్నాము. ప్రముఖ చిత్రకారులు, శ్రేయోభిలాషులు శ్రీ బాపు గారికి మా హృదయపూర్వక నమస్కారాలు.

కథాభ్యుదయానికి సహకరించేటట్లు సంవత్సరం పొడుగునా అన్ని పత్రికలలో వచ్చిన కథల్ని, వాటి ధోరణుల్ని, పత్రికల్ని, ప్రతికల ధోరణుల్ని ప్రచురించడం మా ఉద్దేశం... అందుకని దయచేసి కొత్త పత్రికలు వస్తుంటే, వాటి వివరాలు మాకు తెలియజెయ్యమని కోరుతున్నాను. కొత్త పత్రికల వాళ్ళూ కథలు ప్రచురించడం ఆనందదాయకమైన విషయమేగాని, కాస్త పరిశీలించి మంచి కథల్ని ప్రచురించడం బాధ్యతగా స్వీకరించాలని కోరుతున్నాను.

కథా ప్రక్రియ ఇప్పుడు విపరీతంగా ప్రజాదరణ పొందుతోంది. ఎంతోమంది రాస్తున్నారు. ఎన్నో పత్రికలు ప్రచురిస్తున్నాయి. సంవత్సరంలో వచ్చిన ఇన్నివేల కథల్లో సంకలనాలకి తీసుకోవాలంటే ఇరవై కథలు దొరకడమే కష్టమవుతోంది. దయచేసి ఈ విషయాన్ని అందరూ సీరియస్‌గా ఆలోచించాలని మరీ మరీ కోరుతున్నాను.

1997 ప్రారంభంలో ఎంతోమంది కథారచయితలు ఒక వేదిక మీద కలుసుకుని, స్వాతంత్ర్యానంతరం వచ్చిన ఉత్తమ తెలుగు కథల గురించి చర్చించుకోవడానికి **'సాహిత్యఅకాడమి'** సహకారంతో అయిదు రోజుల విశిష్ఠవేదిక కల్పించిన ప్రముఖ భాషా శాస్త్రవేత్త, సాహిత్య అకాడమి సలహాదారు, సెంట్రల్ యూనివర్సిటీ మాజీ ఉపాధ్యక్షులు **ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి** ప్రత్యేక ధన్యవాదాలు.

అలాగే **శ్రీవేదగిరికమ్యూనికేషన్స్** నెలనెలా నిర్వహించిన వేదికలో ప్రకటించడమే కాకుండా, అన్నట్లు ఆ సంవత్సరంలో వచ్చిన 20 ఉత్తమ కథల్ని ఎంపిక జేసి, వాటిని హిందీ, ఆంగ్ల భాషలలోకి కూడా అనువదింపజేసి - 95 నుండి మూడు భాషలలో ఉత్తమ కథా సంకలనాల్ని తమ విశ్వవిద్యాలయం ద్వారా తీసుకొస్తున్న **పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం** ఉపాధ్యక్షులు **ఆచార్య నాయని కృష్ణకుమారి** గారికి ధన్యవాదాలు.

కథాభ్యుదయమే తమ కర్తవ్యంగా నిరంతరం కృషి చేస్తూ - తెలుగు కథా సాహిత్యం ముఖ్యంగా ఆంగ్లభాషలోకి విరివిగా అనువాదం కావడానికి కారకులు, కేంద్ర సాహిత్య అకాడమీ పలుభాషలలో తెస్తున్న తెలుగు కథా సంకలనం 'బంగారుకథ' సంపాదకులు. నాకు ఆత్మీయులు, శ్రేయోభిలాషులు **శ్రీ వాకాటి పాండురంగారావు గారికి**, ఈ పుస్తకంలో ప్రచురించిన **వ్యాసాలు రాసిన రచయిత, రచయిత్రులందరికీ** పేరు పేరునా నా నమస్కారాలు.

ఈ పుస్తకం ఒక మహదాశయంతో ఎంతో శ్రమకోర్చి , ఆర్థికభారాన్ని మోస్తూ తీసుకువస్తున్నాను. ఆ ఆశయం నెరవేరడానికి సాహితీ బంధువులైన మీ అందరి సహకారం, ఆదరణ ఎల్లవేళలా వుండాలని కోరుతున్నాను.

కేవలం నా ఆత్మానందానికి కొన్ని మంచి పనులు చేయాలనే ఇలాంటి ప్రచురణలు, సభలు జరుపుతున్నాను. సహృదయంతో అమృతహస్తం అందిస్తేనే ఇలాంటి గురుతర ప్రయత్నాలలో మరో అడుగు ముందుకు వేయగలనని మనవి చేసుకుంటూ - అభిమానంతో, దురభిమానంతో; ఆనందంతో, బాధతో; భుజంతట్టి, వెనుక నవ్వి - రకరకాల నన్ను ప్రోత్సహిస్తున్న, బలవంతాన ముందుకు నెడుతున్న అందరికీ మరోసారి రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ -

మీ
వేదగిరి రాంబాబు

# సమీక్షల సూచిక





# ఆంధ్రప్రభ ఆదివారం

బాలలకోసం ప్రచురించిన కథలను మినహాయిస్తే ఆదివారం ఆంధ్రప్రభలో ప్రతివారం తప్పనిసరిగా ఒక కథ ప్రచురితమైనట్టు లెక్క తేలుతుంది. 'ప్రతి వారం ఒక కథ వేయాలి కనుక ఈ వారం కథ కోసం కేటాయించిన పుటలలో ఈ కథ వేసేద్దాం' అన్నట్టు వేసిన కొన్ని కథలను లెక్కలోకి తీసుకోకపోతే సగటున ఈ ఏడాది ఆదివారం ఆంధ్రప్రభలో - సగటు కథలు, సగటు కంటే కొంచెం మంచికథలు, మంచి కథలు వెలువడ్డాయని చెప్పవచ్చు. మంచి పేరున్న రచయితలు, రచయిత్రులూ వ్రాసిన కథలతో బాటు కొత్తగా వ్రాస్తున్న వారి కథలూ ఆదివారం ఆంధ్రప్రభలో చోటుచేసుకున్నాయి.

కథల ఇతివృత్తాలలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. వాతావరణ కాలుష్యం, వృద్ధుల సమస్యలు, అత్తింటి కోడళ్ళ అగచాట్లు, కార్యాలయాల్లో రాజకీయాలు ఇలా రకరకాల ఇతివృత్తాలలో కథలు వెలువడ్డాయి. కొన్ని హాస్యకథలు కూడా వచ్చాయి. మూసపాత్రల కథలూ ఎన్నో ఉన్నాయి.

సంవత్సరంలో మొదటి సంచికలో 'ఛానల్ పంచతంత్రం' (రచన నాగరమేష్) పెరిగిపోతున్న టివి ఛానళ్లవల్ల కుటుంబాలలో వస్తున్న తేడాల గురించిన అతిశయోక్తులతో వ్రాసిన హాస్యకథ. తరువాతి సంచికలో రాపేటి రామకృష్ణారావు వ్రాసిన 'తెలిసిన గమ్యం' ఉద్యోగంలో ఉన్నన్నినాళ్ళు నిరంకుశంగా ప్రవర్తించిన పెద్దమనిషి కథ. ఆ మనిషి మానవత్వపు విలువలు తెలుసుకొని కొడుకు ఇంటినుంచి కూతురు ఇంటికి చేరి కూతురి మంచితనం గుర్తించి ఆమె సలహా ప్రకారం చదువురాని మధ్య వయసువాళ్ళకు సాయంకాలాలలో చదువు చెప్పాలని నిశ్చయించుకుంటాడు.

ఆకెళ్ల శివప్రసాద్ (శివప్రసాద్ అని అచ్చయింది!) కథ 'భూమి' - కూతురికి పెళ్ళి కోసం భూమి అమ్ముకోవాలనుకునే ఒక తండ్రి కథ. కథలో అమ్మమ్మ భూమి అమ్మవద్దనీ తాను ఆదుకుంటాననీ భూమి గొప్పతనం గురించి చెబుతుంది. 'నమ్ముకున్న భూమి గెలిచింది' అని కథకుడు వ్రాసినా, అమ్మమ్మ ఆదుకోకపోతే ఆ తండ్రి ఏమయి ఉండేవాడో అనిపిస్తుంది. రైతుల గురించినదే - నూకా రాంప్రసాద్‌రెడ్డి వ్రాసిన 'కరువు' కథ. ఇక్కడ ఉంటే శెనక్కాయ పంటలా నా బతుకూ ఎండిపోక తప్పదు. ఇది ఎడారిస్వప్నం అంటూ మట్టి మీద మమకారం వద్దంటుంది ఈ కథ.

దానధర్మాలు చేసిన చితికిపోయిన ఒక జమీందారును అతనివల్ల గతంలో మేలు పొందిన కేశవమూర్తి తనయింటికి తెచ్చి అతనిలోని రచయితను మేల్కొలిపిన కథ 'జమీందారు'. రచన ఆచంట హైమవతి. కథ చలనచిత్రం లాగా ఉంది.

'డబ్బు ప్రపంచాన్ని నడిపిస్తోంది గానీ మనం దాన్ని నడిపించడం నేర్చుకుంటే జీవితం ఇంకాస్త సుఖంగా గడుస్తుంది' అనే చెప్పే కథ 'పితృదేవోభవ' (రచన. డా॥ తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం) కథ. ఒక తండ్రికీ అతని ఇద్దరి కూతుళ్ళకూ మధ్య సాగే ఉత్తరాల రూపంలోఉంది. చక్కగా చదివించిన కథ.

మల్లాది వెంకటకృష్ణమూర్తి వ్రాసిన 'అనుభవం' రైళ్ళలో చాలామందికి జరిగేదే. రైల్లో ప్రయాణీకులు ఏదన్నా తింటున్నప్పుడు బిచ్చంకోసం వచ్చే పిల్లలు ఆ తింటున్న దాన్ని ముట్టుకుంటే దాన్ని 'చచ్చినట్లు ఇస్తారని అనుభవపూర్వకంగా తెలిసి' అట్లా ప్రవర్తిస్తూ ఉండవచ్చునంటారు రచయిత. గతంలో ఎవరికో జరిగిన అటువంటి అనుభవం కథానాయకుడికీ జరగడమూ, ఆ అనుభవం పొందిన వ్యక్తి కూతురి సంబంధం తన కోసం రావడమూ చివరికి కథానాయకుడు ఆ సంబంధం ఒప్పుకోవడమూ కథలో ఇతివృత్తం. కాకుంటే కాబోయే మామగారు బిచ్చగత్తెను కొట్టి అభాసు పాలవుతాడు. అల్లుడు తింటున్నదాన్ని బిచ్చగత్తెకు ఇచ్చి ఆకలితో మాడుతాడు. మల్లాది వెంకటకృష్ణమూర్తి వ్రాసిన 'విషప్రయోగం' కమ్మలలో పాము విషయం ఇమిడ్చి తన ప్రియురాలిని తెలివిగా చంపిన ఒక ప్రజానాయకుడి కథ.

'సాహిత్య ప్రయోజనం లేని కథలు వ్రాయకూడదు. సమాజానికి ఇంతో అంతో మేలు చేసే రచనలు చేయాలి' అని బోధిస్తుంది వాలి హిరణ్మయీ దేవి వ్రాసిన 'ఓ అమ్మ కథ' తల్లి కథకుడయిన తన కొడుకును తన కథ వ్రాయమంటుంది. సరసమైన కథలు వ్రాసే ఆ రచయిత తల్లి కథ వ్రాసేలోగా అతని సోదరి తల్లి కథ వ్రాసి ఒక పోటీలో బహుమతి గెలుస్తుంది. ఆ వార్త వింటూ తల్లి చనిపోయింది. 'తల్లి కథను వివరంగా,

నవలగా రాసి తల్లికే అంకితం ఇస్తానని' కథానాయకుడు నిర్ణయించుకుంటాడు. వాలి హిరణ్మయీ దేవి రాసిన కథ 'ఎవరికెవరు?' చావు బతుకులలో ఉన్న భర్తను పిల్లలు ఆదుకోకపోవడమూ, తల్లి ఆవేదన పడడమూ, తలకొరివి యాదగిరి చేత పెట్టించి, తన ఆస్తి వృద్ధుల ఆశ్రమానికి వ్రాసేస్తాననడమూ - కథ ఇతివృత్తం.

బిడ్డలకూ సమస్యలు ఉండవచ్చు కదా! కాని కథలో సినిమాలలో కనిపించేట్టు 'కొరగాని పిల్లలు' 'ఆదుకునే పరాయివాడు' కనిపించడం వల్ల కథలో సహజత్వం తగ్గింది.

ఆలోచన రేకెత్తించేలా ఉన్నా సినిమాతనం కనిపించే కథ 'శత్రువు' (రచన-కొంపెల్ల లక్ష్మీ సమీరజ) మిలిటెంట్లు అపహరించుకుపోయిన సైనికుడి కథ.

కడుపు కూటి కోసం ఇళ్లలోకి పాములను వదిలి వాటిని పట్టుకొనే నెపం మీద డబ్బులు గుంజే పాములవాడి ఆటకట్టిన కథ 'పాము' (రచన - ఇచ్ఛాపురపు రామచంద్రం) ఇచ్ఛాపురపు రామచంద్రం వ్రాసిన 'కిరికిరికెట్' - క్రికెట్ ఆడి వ్యామోహంలో పడిన కుటుంబం గురించింది. కాని దాన్ని 'కథ' అనడం కన్నా 'కల్పిక' అనో 'వ్యాసం' అనో అంటే బాగుంటుందేమో!

ఆఫీసు రాజకీయాల గురించిన కథ 'పనిష్మెంట్' (రచన - ఇలపావులూరి మురళీమోహన్)

ఒక దళితుడిని అవమానించిన మరొక కులం అతనికీ అదే అవమానం జరిగిన తర్వాత కనువిప్పు కలగడాన్ని వివరించే కథ 'పరిష్కారం' (రచన - కొలకలూరి ఇనాక్)

ఉగాది పచ్చడి గురించిన వంగ్య రచన 'తేచేకపు' (తీపు, చేదు, కమ్మప, పులుపు) రచయిత ఎమ్.ఎల్.వి. కృష్ణమాచార్యులు. మొత్తం కథ అంతా నాటకం లాగా వ్రాయడం ఈ కథలో బలహీనత.

ఆకెళ్ళ శివప్రసాద్ వ్రాసిన 'అర్హత' తనను పట్టించుకోని కొడుకుల వల్ల తలదాచుకోడానికి చోటు లేని ఒక తల్లి గురించిన కథ. మంచి కథ. తనను తీసుకువెళ్ళి ఆదరించని కొడుకులకు అనంతంగా ఉత్తరాలు వ్రాయించి చివరికి అటువంటి ఉత్తరం గుండెలమీద పెట్టుకుని తుదిశ్వాస విడిచిన అభాగ్యుడు కథ 'బాబూ! నన్ను తీసుకెళ్ళవూ?' (రచన-దోనేపూడి ప్రేమ్‌దులారి)

బి.ఎస్. రాములు వ్రాసిన 'గాడిద' సమకాలీన రచయితల గురించీ రచనల సామాజిక ప్రాయోజనం గురించీ చిత్రంగా చెప్పే కథ, ఆలోచింపజేసే కథ.

నముదూరి భాస్కరరామం వ్రాసిన 'వ్యవస్థ' కథ కులవ్యవస్థ గురించినది. ఒక పాత్ర 'కులవ్యవస్థని అంగీకరించి అందుకు లోబడి మనుషులు కలిసిమెలిసి ఉంటేనో'

అంటుంది. మరొకపాత్ర అందరికీ సమాన అవకాశాలు కల్పిస్తూ అన్ని కులాలూ సమానమే అన్న భావనతో జనజీవనం సాగిపోతేనో'... అంటుంది. మొదటిపాత్ర "ఈ విషయం మళ్ళీ చర్చిద్దాము" అనడంతో కథ ముగుస్తుంది. సమస్య? కొనసాగుతూనే ఉంటుంది.

సి.హెచ్. శ్రీనివాసమూర్తి కథ 'గీత' - సినిమా కథ లాగా ఉంది. ఒక అమ్మాయిని ఒక అబ్బాయి ఒక వాన వేళ తన కారులో ఎక్కించుకొని ఆమె యింటిదగ్గర దించుతాడు. కులాంతర వివాహం చేసుకొన్న ఆ అమ్మాయి తల్లి ఆ అబ్బాయికి మేనత్త.

కట్నంలేని పెళ్ళిచేసుకుని అత్తయింటి ఆరళ్ళు ఓర్వలేక భర్తను విడిచి వెళ్లిపోయే భార్య కథ 'మనసు విరిగెనేని' (రచన-పెంటుకోట ఉషాతారక). 'ఈమారు మీరు పెళ్లంటూ చేసుకుంటే దయచేసి కట్నం తీసుకోండి. ఆ కట్నమైనా కనీసం భార్యని కూడా మనిషి లాగా చూసుకోవాలనే సత్యాన్ని నేర్పుతుంది' అంటూ భర్తకు ఉత్తరం రాసి వెళ్ళిపోతోంది ఆ భార్య. ఆలోచింపజేసే కథ.



# ఆంధ్రప్రభ 'మహిళ'

స్త్రీల మానసిక ఆరోగ్యం గురించి చర్చించడానికి ఇటీవల కొత్తఢిల్లీలో ఒక జాతీయ సదస్సు జరిగింది. అందులో మానసికవైద్యనిపుణులు, ప్రజారోగ్య పరిశోధకులు, సామాజిక కార్యకర్తలు పాల్గొన్నారు. విద్యాసాగర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్ ఆండ్ న్యూరో సైన్సెస్ భవనంలో ఢిల్లీ సైకియాట్రిక్ సొసైటీవారు ఆ సదస్సును నిర్వహించారు.

సామాజిక పరిస్థితులలో వస్తున్న మార్పులకు తగినట్టుగా పురుషులు తమ పద్ధతులను వైఖరులను మార్చుకోలేకపోవడం వల్లనే స్త్రీలు మానసికక్షోభకు, వేదనకు గురౌతున్నారని ఆ సదస్సులో పాల్గొన్న నిపుణులంతా ఏకగ్రీవంగా అభిప్రాయపడ్డారు.

ఆంధ్రప్రభ దినపత్రిక ప్రతి గురువారం పేపర్‌తోపాటు ఉచితంగా పాఠకులకు అందిస్తున్న 8 పేజీల టాబ్లాయిడ్.... 'మహిళా' అనుబంధంలో ఈ ఏడాది వచ్చిన కథల్లో చాలావరకూ కాస్త అటూ ఇటూగా పైన పేర్కొన్న సామాజిక వేత్తల అభిప్రాయాలను సమర్థించేవిగా ఉన్నాయి. 1997 లో 60 కథలకు పైగా 'మహిళ'లో ప్రచురితమయ్యాయి. ఒక్కోవారం రెండు మూడు కథలను కూడా వేయడం వల్ల పెరిగిన సంఖ్య ఇది.

మహిళలకోసం నిర్దేశించిన కథలు కాబట్టి ఇవన్నీ ఎక్కువభాగం సీరియస్ కథలే. సీరియస్ అంటే... సామాజిక సమస్యలపై విశ్లేషణతో కూడుకున్నవి. అయితే చాలా కథల్లో వట్టి 'సీరియస్ నెస్' మాత్రమే మిగలడం కథను బలహీన పరచింది.

ఈ ఏడాది చివరి నెలలో, చివరివారంలో, చివరి పేజీలో అడుగున ఒక కథానిక వచ్చింది. దాన్ని గల్పిక అంటే బావుంటుందేమో. 'కథానిక' అనే శీర్షికతో ప్రత్యేకంగా ఒక

పేజీ ఉన్నప్పటికీ. దాంతోపాటు చివరిపేజీలో వచ్చిన కథ అది. బహుశా ఫిల్లర్‌గా ఉపయోగించి వుండొచ్చు. కథ పేరు : ఆత్మహత్య! రచయిత : శింగరాజు మాధవరావు కథ ఇలా సాగుతుంది.

"పచ్చివాసన కొడుతోంది. వచ్చి ఎన్నాళ్ళయిందేమిటీ!"

"వారం మీద ఒక రోజు"

"పట్టుమని పాతిక్కూడా కనబడ్డంలేదు. పెళ్ళయినట్లుంది. చూస్తే ఆరోగ్యంగా ఉన్నావ్. హత్యా?"

"అలాంటిదే"

"అత్తమామలు, మొగుడు కలిసి చేసినపనా?"

"కాదు"

"అయినోళ్ల అఘాయిత్యమా?... ఆస్తికోసం..."

"ఉహూ"

"అయితే సామూహిక అత్యాచారమన్న మాట"

"అంతఖాయంగా ఎలా చెప్తున్నావ్"

"నీలాంటి బొడ్డూడని ఆడపిల్లలు అర్థాంతరంగా ఇక్కడికి వచ్చేశారంటే ఇంతకన్నా కారణాలేముంటాయనీ"

"నిజమే. అయితే ముందది సామూహికంగా జరగలేదు."

"మరి"

"ఒకడే. చేలోకెళ్ళొస్తుంటే పెద్దరెడ్డి కొడుకు మీద చెయ్యేశాడు. లాగిపెట్టి తన్నా, వంద నోట్లు విదిల్చాడు. వాటితో నీ బొంది కాల్చుకోమన్నా. కాళ్ళు పట్టుకుని కోరిక తీర్చమన్నాడు. చెప్పుతెగుద్దన్నా. ముందు నీ తాళి తెక్కుండా చూస్కోమన్నాడు. బెదిరింపు అర్థమైంది. దండంపెట్టిదారియ్యమన్నా. గొప్పింటోళ్ళకు గొప్ప మనసుండాలన్నా. ఉంది కాబట్టే నీ మీద మనసు పడ్డానన్నాడు. ఒకే కులమైతే మారుమనువు ఆడేవాడినన్నాడు. ఈ సారి నేను వాడికాళ్లు పట్టుకున్నా. పెళ్ళైనదాన్ని అంతలేసి మాటలనకూడదని అన్నా. కాళ్ళుకాదు నువ్వు పట్టాల్సింది నడుమన్నాడు. మళ్ళీ లాగిపెట్టి తన్నా. దొంగ లంజా.... ఎంత పొగరే అని మా కులపు ఆడోళ్ళందరినీ వావివరసల్లేకుండా తనేం చెయ్యగలడో తిట్టుకుంటూ చెప్పాడు. నన్నీడ్చుకుంటూ వెళ్లాడు. తుప్పల్లో పడేసి నోరు నొక్కేశాడు.

ఒళ్ళంతా రక్కేశాడు. కళ్ళుతెరిచే సరికి చీకటి మిగిలింది. ఇంటికెళ్ళి ఇంత విషమేసుకున్నా. ఆయన దగ్గరేం దాచలా. గిలగిల కొట్టుకుంటూనే అంతా చెప్పేశా"

" ఓ.......ఆత్మహత్యన్నమాట.'

"దానికింకో పేరైతే బావుంటుంది"

"ఎందుకనీ"

"ఆత్మహత్య జరిగితే ఆత్మెలా మిగులు తుంది ? నాకిప్పుడు మళ్ళీ ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోంది. ఇలా కూడా లేకుండా పోవాలి ?

"ఏమంత కష్టమొచ్చి పడిందనీ?!"

"చచ్చాక్కూడా వాళ్ళు నన్నొదల్లేదు"

"వాళ్ళెవరూ ?...ఒకడేఅన్నావ్"

"చెప్పనుగా ముందొకడేనని. ఇప్పుడు పెద్దరెడ్డి కొడుకు, వాడితోపాటు వాడిమనుషులు...వాళ్లందరితో కలిసి నా భర్తా... నాపై సామూహికంగా అత్యాచారం జరుపుతున్నారు, వారంరోజులుగా"

"నీ భర్తకూడానా?"

"అవును. ఆయనే అభిమానభంగానికి పరిహారం నిర్ణయించిన మహానుభావుడు. లక్ష ఇస్తే పోలీసుకేసు వాపస్ తీసుకుంటాడట. కన్నెపిల్లాకాదు, కడుపూరాలేదు. కడజాతి మనిషికి ఇరవై వేలే ఎక్కువని వాళ్ళూ... లక్షకు పైసా తగ్గినా వీల్లేదని ఆయనా... పంచాయతీలో నా శవానికి వెలకడుతున్నారు. వాళ్ళొక ఒప్పందానికి రాకముందే నేను ఆత్మహత్య చేసుకోవాలి"

"అందులో వింతేముందీ . డబ్బుదగ్గర మనుషులంతా ఒక్కటే. అదేం పట్టించుకోకు. అయినా మనమిప్పుడు వాళ్ళ మధ్యలేముగా...ఇక బాధేమిటి?"

"ఎందుకుండదూ నిజానికి నేను మొదట ఆత్మహత్య చేసుకుంది ఎందుకో తెలుసా?"

"శీలం పోయేగా"

"అదేదో పోయిందనికాదు"

"మరి"

"నన్నెదురుగా పెట్టుకుని నా భర్త తలెత్తుకుతిరగలేడని"

"ఊరుకో అలా ఏడవకు"

"నేనాయనకు ప్రాణం ఇచ్చాను. ఆ ప్రాణానికి ఆయన బేరం పెడుతున్నాడు. ఇప్పుడు చెప్పు. ఆత్మగానైనా నేనెందుకుబతకాలి"

ఇక్కడితో కథ అయిపోతుంది. ఒక సామాజిక సమస్య చుట్టూ అల్లుకున్న సంభాషణలివి. శ్మశానంలో రెండు ఆత్మలు మాట్లాడుకోవడం కొంత ఆసక్తికరంగా ఉంది.

ఇలా మహిళలకు సంబంధించిన ఏదో ఒక సోషల్ యాస్పెక్ట్‌ను చిత్రీకరించినవే... వాకిట్లో అభ్యుదయం (సామితీ), టీచర్ గారి కన్నీళ్లు (పుష్యమి)'కళ'ంకం (ఆకెళ్ళ శివప్రసాద్), అనగనగా ఓ అమ్మాయి (కొలికపూడి శరత్), వల (రజని), హత్య (కాలువ మల్లయ్య), కథలు. ఇక మహిళలకు ఏమాత్రం సంబంధంలేని కామిడీ కథగా 'బాబోయ్ పేజర్' (విజయార్కె) మిగిలిపోయింది. మిగితావన్నీ సాదాసీదా గుణపాఠం, కనువిప్పు కథలనే చెప్పాలి.

విధిగా ప్రతివారం ఒక కథనైనా ప్రచురించి తీరాలన్న నియమం లేకంటే మంచి కథలు మాత్రమే పాఠకులకు చేరే అవకాశం ఉంటుంది.



# ఆంధ్రభూమి ఆదివారం

కాల్పనిక సాహిత్యంలో 'కథ' ది ఓ విచిత్రమైన కథ. కథనంలోను, శిల్పం లోనూ, వస్తువులోనూ నవ్యతనూ కొత్త కోణాన్ని సంతరించుకుంటోంది.

అల్లరి చేస్తున్న పిల్లల్ని అలరించడానికీ, నిద్రపోనని మారాంచేస్తున్న పిల్లల్ని జోకొట్టి నిద్రపుచ్చడానికి, కాలక్షేపంలేని పెద్దలకు ఆటవిడుపుగా వుండడానికీ 'కథ' ఓ మహత్తర సాధనం. తాతయ్యలూ నాయనమ్మలూ పిల్లల్ని పక్కన పడుకోబెట్టుకుని చెప్పిన కథే మళ్ళా మళ్ళా చెబుతుంటే, ఊఁ కొడుతూ, ఆసక్తిగా, మరో కొత్త కథ వింటున్నట్టు వినే పిల్లలు మన ఇళ్ళలో మనకళ్ళముందే కనిపిస్తుంటారు. అలాగే, పనులు పూర్తి చేసుకొని తీరిగ్గా కూర్చునే ఇల్లాళ్ళు ఉబుసుపోక కోసం, ఓ చోట చేరి కబుర్లాడుకునే పెద్దవాళ్ళూ కూడా అక్కడా ఇక్కడా పోగేసుకొచ్చిన వార్తలకు తమ ఊహను జోడించి, ఆ కథనం లో కాలం వెళ్ళబుచ్చుతూంటారు. కథ ప్రయోజనం అంత వరకే కాదు. ఆధునిక కథ సమాజాన్ని అన్ని కోణాల్లోనూ నిశితంగా పరిశీలించి చూపెడుతోంది కాలక్షేపం కోసం కాక సమాజ ప్రయోజనంకోసం కథ కృషి చేస్తోంది.

కథారచయితలు తరచు తమకి ఎదురయ్యే ఓ చిన్న సంఘటలననో ఓ విచిత్ర వ్యక్తిత్వాన్నో, మనస్సుపొరలను స్పృశించే ఓ దృశ్యాన్ని చూసి, ప్రభావితులై, అందులోంచి, ఓ కథను పుట్టిస్తారు. అందమైన చట్రంలో - ఉత్సుకత కలిగించే ప్రారంభం, ఆలోచనను రేకెత్తించే ముగింపు అనే చట్రంలో పొదిగి, సరళమైన భాషలో సున్నితమైన భావాన్ని అందంగా అల్లుకు పోతుంటారు. కేవలం ఆ కథ కల్పితమేననీ, ఎవరినీ ఉద్దేశించి వ్రాసినది కాదనీ, ఏవైనా పోలికలు కనిపిస్తే అది కేవలం కాకతాళీయమనీ అంటారు. కానీ

పాఠకుడు మాత్రం ఆ కథ ఓ వాస్తవ సంఘటన అనే భ్రాంతితో చదువుతుంటాడు. అందులోని పాత్రలతో తానుమమేకం కావాలని ప్రయత్నిస్తుంటాడు. ఆ కథలోని ఏదో ఒక పాత్రలో తనను తాను దర్శించుకోవాలని ప్రయత్నిస్తుంటాడు. ఇంతకీ, కథ - కేవలం కల్పితమా, లేక అందంగా చెప్పే ఓ వాస్తవ సంఘటనా? ఈ రెండింటి మిశ్రమమా?

గతంలో కేవలం వార పత్రికులకు, మాస పత్రికలకు పరిమితమైన కథ నేడు దినపత్రికలకు కూడా వ్యాపించింది. దాదాపు అన్ని దినపత్రికలూ, ఆదివారం అనుబంధాల్లో ప్రతివారం ఒక కథను ప్రచురిస్తున్నాయి. అంటే, ప్రతీ ఏడూ, ప్రతి దిన పత్రికా సుమారు 52 కథల దాకా ప్రచురిస్తోంది - ఇవికాక, ఇతర వార, పక్ష, మాస పత్రికలు ప్రచురిస్తున్న కథానికలు సరేసరి. కొత్త కొత్త కథారచయితలు పుట్టుకొచ్చి కథలు రాసేస్తున్నారు. వీరిలో కథను కొత్త మలుపు తిప్పే ప్రయత్నాలు చేస్తున్నవారూ ఉన్నారు.

'ఆంధ్రభూమి' దిన పత్రిక - ఆదివారం అనుబంధంలో, ప్రతీవారం ఓ కథ ప్రచురితమవుతోంది.

జనవరిలో ఇంద్రగంటి నరసింహమూర్తి గారి కథ - "శుభమస్తు" మన భారతీయ కుటుంబ వ్యవస్థను, కుటుంబ వాతావరణాన్ని చిత్రీకరించింది. కుటుంబ పెద్దకు ఎంత ముసలితనం వచ్చినా, ఇంటి పరువు మర్యాదలు, తన సంతతి ఐకమత్యంగా ఉండటం, వారి సుఖ సంతోషాలు - ఇవే ముఖ్యం. కుటుంబంలోని వారు కూడా, కష్టం వచ్చినపుడు కలుసుకుంటారు. మళ్ళీ అభిప్రాయం భేదం వస్తే, ఘర్షణ పడుతుంటారు. ఈ కథ, పాఠకుడిచేత చదివిస్తుంది. శైలి సరళంగా ఉండి చక్కటి వాతావరణాన్ని కళ్ళకు కట్టింది.

అదే నెలలో వచ్చిన మరోకథ - తాయారమ్మ " గొర్రెలు పారిపోయాయి" పల్లెటూరు వాతావరణాన్ని, జీవితాన్ని చిత్రించే కథ. 50 వసంతాలు పూర్తి చేసుకోనున్న తరుణంలో, స్వతంత్ర భారతంలో, కేవలం చదువుకోవాలనే తపన ఉన్న ఓ ఆడపిల్లకి - తండ్రి ప్రోత్సాహం లేకపోవడమే కాదు, చదువుకుంటానంటే తనను దండిస్తారనే భయం నేటికీ ఉన్న విషయమే, తండ్రి ఆదాయం కోసం మేపుకునే గొర్రెలకు, తనకూ ఏమంత తేడా లేదనే విషయాన్ని గుర్తించిన కూతురు, గడపదాటి, ఊరి పొలిమేర దాటి విశాల ప్రపంచంలోకి వెళ్ళిపోతూ, తను మేపుతున్న గొర్రెల్ని కూడా పచ్చని పచ్చిక బయళ్ళలో స్వేచ్ఛగా వదిలేసి వెళ్ళిపోవడం కథ ముగింపు. చక్కటి కథనం, సున్నితమైన ముగింపు!

అంతర్జాతీయ మహిళా దినోత్సవాలు చేసుకుంటున్నా, చట్టసభల్లో కేటాయింపుల సమకూర్చుకుంటున్నా, కుటుంబంలో స్త్రీల భావాలకు ఆలోచనలకు నేటికీ విలువలేదు.

గౌరవం లేదు, వారి చదువులకు సార్థకమూ లేదు అని మరోసారి చెప్పే కథ 'కొత్తమ్మ' తన బిడ్డకు మరో కొత్త అమ్మను తెస్తానని భర్త తరచూ అంటుంటే, ఆ మాటలు విని తట్టుకోలేక పోయిన జానకి రోడ్డు ప్రమాదంలో కన్నుమూసిన పనిమనిషి కొడుకు బాధ్యత తీసుకొని, వాడికి 'కొత్తమ్మ' కావాలనుకుంటుంది. సుజాత రచన కథనం, చదివిచేలా లేకపోయినా, ముగింపులో పరిష్కారం చూపకపోయినా, నేటి స్త్రీల స్థితిగతుల్ని వివరించే కథ.

'ఆక్రోశం' - కాసుల ప్రతాపరెడ్డి, తెలంగాణా సాయుధ పోరాటాన్ని గురించి విశేషాలను వివచించే కథ. నాటి ప్రజల త్యాగశీలత, ఔదార్యం, కర్తవ్య దీక్ష, నిజాయితీ చిత్రించే కథ - చరిత్రను ఓ పాఠంగా చెప్పటంకంటె - ఇలా కథగా మలిచివేస్తే, విషయం పాఠకుల్లోకి చొచ్చుకుపోగలదు. నేటి పాఠకులకు ఇటువంటి కథలు చాలా అవసరం. ఎత్తుగడ, కథనం ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

"నీకూ నాకూ మధ్య " - డి. శరత్‌జ్యోత్స్నారాణి - నేటి సమాజంలో, స్పందించే శక్తి స్త్రీకి అశాంతినే అందిస్తుందనీ, అశాంతిలోంచి బయటపడి, శాంతిని వెదుక్కోడానికి, ఎంతో పూనిక, ప్రయత్నం అవసరమనీ చెప్పే కథ - అయితే, కథానాయిక మానవిలో ప్రయత్నలోపం కనిపిస్తోంది. ఏవో రెండు మూడు వాదోపవాదాలు చర్చలు మినహా, 'మానవి' తన వెలితిని భర్తకు స్పష్టంగా చెప్పి, ఆ శూన్యాన్ని నింపే ప్రయత్నం గురించి భర్తతో చర్చించి, క్రియాశీలంగా ఏదైనా చేసి, విఫలమైన దాఖాలాలు లేవు! అన్ని చేసినా, తన ప్రయత్నాలు ఫలించనందున ముకుందరావుతో వెళ్ళిపోయివుంటే బావుండేది - అలా చెయ్యనందున, ఏదో ఆవేశంలో ఆమె కొడుకును నట్టేట ముంచేసిందనే భావం కలుగుతుంది.

పి.యమ్. సుందర్రావుగారి రచన - 'ఆసరా', తల్లిదండ్రుల గుండెల మీది కుంపటి "ఆడపిల్ల"! తల్లీ, తండ్రీ సాయం చేయకపోయినా, స్నేహం నుంచి లభించే ఒక చిన్న ఆసరాతో ఓ నిండు జీవితం నిలుస్తుంది. సమస్యల వలయంలో చిక్కుకున్నవారికి, ఒక చిన్న గడ్డిపోచ దొరికినా, ధైర్యం వస్తుంది. స్త్రీకి స్త్రీయే శత్రువు అనే నిందే సత్యం కాదనీ, స్త్రీకి మరో స్త్రీ సాయం చేసి ఆసరా ఇచ్చే సంఘటనలూ ఉంటాయనీ చెప్పే కథ. చదివిస్తుంది.

వంశీకృష్ణ రచన - " ఆ మూడు రోజులు" - కథ పేరు చదవగానే ఇతివృత్తం తెలిసిపోతుంది. పట్నాల్లో, నగరాల్లో, మెగాసిటీల్లో ఉన్న ఆడపిల్లలకు అర్థంకాని సమస్య. కేవలం పల్లెటూళ్లలో, ఇంకా పాత ఆచారాలను తు.చ. తప్పకుండా పాటిస్తున్నవారికి

మాత్రమే ఈ కథ కన్నుకు కట్టినట్టుంటుంది. కేవలం కొందరికి మాత్రమే వర్తించి, అర్థమయ్యేకథ కనుక అందరికీ ఆసక్తి కలిగించదు.

"విక్టోరియా శేషప్పయ్యర్" కె.ఆర్.కె. మోహన్‌గారి కథ. అలా అలా చదివేసేలా ఉన్న సరదా కథ అని ప్రారంభంలో అనిపించినా, మన పురాణాలకూ కావ్యాలకు వక్రభాష్యాలు చెప్పడం, ఆ వక్రీకరణలను వ్యాపింపచేయడం తప్పుసుమా అని హెచ్చరిస్తుంది కథ. ప్రాచీన సాహిత్యాన్ని మన తెలివి తేటల్తో 'కల్తీ' చెయ్యకుండా, సరిగ్గా అర్థం చేసుకుంటానే దాని ఔన్నత్యం తెలిసివస్తుందని తెలియజెప్పే మంచి కథ.

"తొడుక్కున్న తోలు" - పులుగు శ్రీనివాస్. కులాలకుళ్ళును స్పష్టంచేసే కథ మనిషిసృష్టించుకున్న కుల వ్యవస్థను, మనిషే తారుమారు చేసుకుంటూ, స్వలాభంకోసం స్వార్థంకోసం ఎలా ఉపయోగించుకుంటున్నాడో, కులరాజకీయాల్లోని నైచ్యం ఎలాంటిది వివరిస్తుంది. ఒక సంప్రదాయం నుంచి సద్దుదేశంతో అలనాడు పూర్వీకులు ఏర్పరచి కులవ్యవస్థను, రాజకీయంచేసి, రచ్చకెక్కించి, చిన్నాభిన్నం చేస్తున్న వైనాన్ని ఈ కథ వివరిస్తుంది -

"టీ కప్పు" - మోహనకృష్ణ. సాహిత్యం జీవితానికి ప్రతిబింబమా? జీవితం సాహిత్యాన్ని అనుకరిస్తుందా? అసలు, సాహిత్య ప్రయోజనం ఏమిటి? కేవలం కాంతాసమ్మితంగా మంచి చెడ్డలు విశ్లేషించి వివరించటంతో రచయితల బాధ్యత పూర్తయి పోతుందా? లేక క్రియాపూర్వకంగా రచయితలు సంఘసంస్కరణకు దీనజనోద్ధరణకు పూనుకోవాలా అని శాస్త్రచర్చ చేసి, ముగింపులో మళ్ళీ పాత కథ అనిపించే కథ.

'బండికదిలింది' - గఫార్. నాకే సమస్యలూ లేవు , నేను ఎంతో సంతోషంగా ఉన్నాను... ఎదుటివాడే పాపం సమస్యల వలయంలో చిక్కుకుపోయి, నా వంటి వా ఉద్ధరింపు కోసం చూస్తున్నాడు" అని తనను తాను మభ్యపెట్టుకుంటూ బతికేస్తుంటార జనం. నిజంగా సమస్యల్లో ఉన్నవాడు, ఆ సమస్యకు పరిష్కారం వెదుక్కొని ధైర్యంగా ముందడుగు వేసినపుడు, అవాక్కయి చూస్తూ నిలబడిపోతారు. 'ఉద్ధరేదాత్మ నాత్మానం ' అనే గీత ప్రవచ్యాన్ని సాకారం చేసినపుడు తట్టుకోలేరు. భార్యాభర్తలబంధం ప్రధానంగా వయస్సుకు సంబంధించినది అని ఒప్పుకుంటూ కూడా, సమాజంకోసం మరొక ముసుగు వేసుకొని బతికేస్తున్న సుభాష్‌లాంటి వారికి, ఆనంద్ చూపించే పరిష్కారం మింగుడుపడకపోవడం సహజమే మరి. చక్కని సెంటిమెంట్ ఉన్న సీరియస్ కథ.

నల్లటి వెన్నెల - మూలం ఎంటి వాసుదేవనాయర్ అనువాదం వినూత్న. అనువా

కథే అయినా, సరళంగా, సాఫీగా సాగిపోయే కథ. కలలకూ వాస్తవానికీ, ఊహకూ యదార్థానికీ మధ్య గల అగాధానికి దర్పణం ఈ కథ...... "కొన్ని కోరికలు తీరకపోతేనే బావుంటుంది సుమా... కొన్ని కలలు కథలుగా మిగిలి పోతేనే మంచిది సుమా" అని హెచ్చరిస్తుందీ కథ... కన్నె పిల్లగా కన్న కలలు నిజమై, ప్రియుడు భర్తగా మారగానే - ఆ హోదాలో వచ్చిన మార్పు, అసలు స్వరూపాన్ని, వ్యక్తం చేసినపుడు ఆ మనసు ఎలా బాధపడుతుంది? ఆ భార్య కర్తవ్యం ఏమిటి? మౌనంగా కన్నీరు కారుస్తూ భరించడమే' పరిష్కారం అని చెప్పే కథ. ప్రాంతాలు, భాషలు, నెలవులు వేర్వేరయినా, 'మనసు' అనేది అందరికీ ఉంటుందనీ, మనసుంటే స్పందన, కోరిక, ఆశ, ఆశయం ఉంటాయనీ అవే జీవితాన్ని శాసిస్తాయనీ చెప్పారు రచయిత.

మంచి కథలు రాకపోవడానికి పూర్తి బాధ్యత పత్రికల మీదే వెయ్యడం సబబు కాదు. మంచి రచనల నందించడం రచయిత బాధ్యత. మంచిది కాని కథని ప్రచురించడానికి ఏ రికమండేషన్లయినా పనికొస్తాయి గాని 'కథ' మంచిదైతే ఏ పత్రిక ప్రచురించకుండా దాన్ని నెట్టివేయలేదు. రచయిత పత్రికని, పాఠకుణ్ణి కాక సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని కథలు రాయడం అవసరం.



# ఆంధ్రజ్యోతి ఆదివారం

మరో రెండు సంవత్సరాలలో ఇరవై ఒకటో శతాబ్దం ఆరంభమవుతుంది. కొత్త శతాబ్దిలోకి చొచ్చుకుపోవడానికి ప్రపంచదేశాలన్నింటిలో ఉత్సాహం పెల్లుబుకుతోంది. అన్ని రంగాలు ఇందుకు సమాయత్తమవుతున్నాయి. మార్పులు శరవేగంతో వస్తున్నాయి.

మనదేశ సాహిత్యరంగంలో కూడా ఈ దిశగా నూతన పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. దేశభాషా రంగంలో తెలుగు తన విలక్షణ స్థానాన్ని పదిలపరుచుకుంటోంది. ప్రగతి శీల మానవతావాదం విరాట్‌రూపం ధరిస్తోంది. స్త్రీవాదం, దళితవాదం, మైనారటీ వాదం వంటి ధోరణుల ప్రభావం క్రమాధికంగా విస్తరిస్తోంది. ఆధునికం 'పాతపడు' తోంది. ఆధునికానంతర దృక్పథం ఆకర్షిస్తోంది. సాహిత్యంలో కవిత్వం ఇంకా తన మకుటస్థానాన్ని నిలుపుకుంటూనే ఉంది. అందువల్లనే ఈ పరివర్తన ఛాయలన్నీ ముందుగా కవితారంగంలో ప్రసరిస్తున్నాయి. సృజనాత్మక సాహిత్యంలో కథకూ, నవలకూ పెద్దపీటలే వున్నా ఈ మార్పుల ప్రతిస్పందనలో కొంత వ్యత్యాసం కనిపిస్తుంది.

ఈ దశాబ్దంలో తెలుగు కథా రంగ వికాసానికి విశేష కృషి జరిగింది. ప్రజలలో, పాఠకలోకంలో కథ పట్ల ప్రత్యేక అభిరుచి, ఆదరణ పెరిగాయి. పత్రికలు మరింత ప్రాధాన్యమిస్తున్నాయి. కథకులలో అభినివేశం పెరిగింది. కథపై జరిగిన సదస్సులలో, కార్యగోష్ఠులలో విస్తృతచర్చలు జరిగాయి. కథ విలసనానికి ఎన్నో సూచనలు చేశారు. ఈ దిశగా డా॥ వేదగిరి రాంబాబు కృషిని కథాభిమానులు ప్రశంసిస్తున్నారు.

ఈ నేపథ్యంలో 1997 సంవత్సరంలో 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక ఆదివారం అనుబంధం ప్రచురించిన కథలను స్థూలంగా సమీక్షించే ప్రయత్నరూపం ఈ లఘువ్యాసం. తెలుగు పత్రికా రచనకే కొత్తరూపుదిద్దిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో ఉత్తమ సాంప్రదాయాలతో ప్రజాదరణ పొందిన 'ఆంధ్రజ్యోతి'. నండూరి రామమోహన రావు ఆ సత్సంప్రదాయాలను పరిపోషించి పత్రికను ముందుకు నడిపించారు. నేటి సంపాదకులు ఐ. వెంకటరావు, వారి సంపాదకబృందం మారుతున్న అవసరాలకు తగినట్లు పత్రికను అభివృద్ధి చేస్తున్నారు.

ఆదివారం అనుబంధం ఇప్పుడు ఒక విధంగా విజ్ఞాన సర్వస్వ వారపత్రికగా మారింది. అన్ని వర్గాల పాఠకులను దృష్టిలో వుంచుకుని సమర్థంగా అనుబంధాన్ని తీర్చిదిద్దవలసి వుంది. ఈ విషయంలో 'ఆంధ్రజ్యోతి' సంపాదకవర్గం సమర్థంగా తమ బాధ్యతలను నిర్వహిస్తున్నందుకు వారిని తప్పక అభినందించాలి.

ప్రస్తుతాంశం 'కథ'. 'ఆంధ్రజ్యోతి' కథకు ఆది నుంచి గౌరవస్థానముంది. ఉత్తమ ప్రమాణాలున్న కథలు ప్రచురించాలనే లక్ష్యానికి కట్టుబడిన పత్రిక. ప్రతి ఆదివారం ఒక కథ వెలుగు చూస్తోంది.

1997లో ప్రచురితమైన 52 కథలు ఈ సమీక్ష పరిధిలోకి వచ్చినప్పటికీ అన్నింటినీ ప్రస్తావించడం, విశ్లేషణాత్మకంగా సమీక్షించడం ఈ వ్యాసపరిమిత విస్తృతి దృష్ట్యా సాధ్యం కాదు. అందుచేత ప్రత్యేకించి మరోసారి పాఠకుల దృష్టికీ, రచయితల దృష్టికీ, పత్రికా సంపాదకుల దృష్టికీ తీసుకురావడం సమంజసమనీ, వాంఛనీయమనీ భావించిన విషయాలను మాత్రమే సంగ్రహంగా ఈ వ్యాసంలో చర్చించే యత్నం జరుగుతుంది.

ఈ సందర్భంలో కథాప్రక్రియకు వర్తించే ఒక అంశాన్ని విజ్ఞుల దృష్టికి తీసుకురావాలి. అభివ్యక్తిలో కవిత్వానికీ, కథకూ తేడా వున్న మాట వాస్తవమే. అయినప్పటికీ కథకు సంబంధించి ఒక అపప్రథ వినిపిస్తోంది. కొందరికి రుచించకపోయినా దీనిని ప్రస్తావించక తప్పదు. సాహిత్యం రసానుభూతిని కలిగించే సాధనమైనప్పటికీ, సామాజిక హితచింతన బాధ్యత కూడా దానికి వున్నదని ఈనాడు అందరూ అంగీకరిస్తున్నారు. ఈ కోణం నుంచి పరిశీలించినప్పుడు కవితా ప్రక్రియ కంటే కథ కొంత వెనుకపడి వుందనీ, నూతన బాధ్యతల్ని నిర్వహించడంలో మొత్తం కథకులందరిలో నవనవోన్మేషమైన స్ఫూర్తి ఇంకా ప్రస్ఫుటం కావడం లేదనీ అంటున్నారు. కొందరు కథకులలో ఈ స్ఫూర్తి ఉవ్వెత్తున ఎగసిపడుతుంది. కాని వీరి సంఖ్య తక్కువ. ఎక్కువమంది 'మూస' పద్ధతి నుంచి ఇంకా పూర్తిగా బయటపడడం లేదు. మధ్య తరగతి మనస్తత్వం కథకులలో ఇంకా ప్రబలంగా

ఉంది. చిత్రమైన పలాయనవాదం తరచు ఈ కోవకు చెందిన రచయితల్లో ద్యోతకమవుతోందని విమర్శకులు భావిస్తున్నారు. కథకులు తమ ప్రక్రియ ద్వారా సమాజానికి దిశానిర్దేశం చేయడంలో పూర్తి విజయాన్ని సాధించలేకపోతున్నారనే వాదన వినిపిస్తోంది.

కథారంగ సముజ్వల భవిష్యత్తుకు ఈ విధమైన వాదనలను కూడా పరిశీలించి నూతనోత్తేజంతో కథకులు పురోగమించడం అభిలషణీయం.

1997 సంవత్సరంలో 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక ఆదివారం అనుబంధంలో వెలువడిన కథలలో ఈనాటి ప్రధాన ధోరణులు సముచిత స్థానం చేకూర్చుకోవడం హర్షణీయం. వస్తుపరంగా చూసినప్పుడు ఎంతో వైవిధ్యం ఆవిష్కృతమవుతోంది. ఈ వర్గీకరణ కిందికి చాలా కథలు వచ్చినప్పటికీ ఉదాహరణపూర్వకంగా కొన్నింటిని మాత్రమే పేర్కొనడం సాధ్యమవుతుంది.

సృజనాత్మక దృష్టితో రచయిత ప్రపంచాన్ని, పరిసరాలనూ చూస్తే ఎన్నెన్నో కథావస్తువులు కళ్ళముందు కదలాడతాయి. సర్కారు జిల్లాల్లో విస్తృతంగా కనిపించే దృశ్యం 'సీడ్'. రొయ్యల వేట కిది వాడుకపదం. తెల్లటి ప్లాస్టిక్ బకెట్, టబ్ పట్టుకుని ఒక వలతో అన్ని వయస్సులవారు అలల దగ్గర రొయ్యల వేట జరుపుతారు. ఈ సీడ్ పట్టి తెచ్చే వాళ్ళకి ఎక్కువ లాభం రాకపోయినా వాటి ద్వారా వ్యాపారం చేసే వాళ్ళకి లక్షల రూపాయల వర్షం కురుస్తుంది. సముద్రం ఆగ్రహిస్తే పేద బెస్తల ప్రాణాలకు ప్రమాదం వాటిల్లుతుంది. గోపరాజు నారాయణరావు కథ 'సీడ్' దీనిని సమర్థంగా చిత్రించారు. తుఫాను రావడం, ప్రాణాలు పోవడం అక్కడ పరిపాటే. అయినా జీవనయాత్ర సాగిపోతూనే వుంటుంది. 'ఏమూల నుంచి వచ్చాడో మరి, ఇసుక దిబ్బలు దిగి వడివడిగా సముద్రం కేసి సాగిపోతున్నాడా యువకుడు. ఒక చేతిలో తెల్లటి బకెట్, తలపైన తెల్లటి టబ్, భుజంమీద వల' అని కథ ముగిస్తారు.

నోరులేని వాటిచేత వాటి వృత్తాంతాలు చెప్పించడం కొత్తకాకపోయినా అట్టాడ అప్పలనాయుడు 'ఓతోటకథ' లో మంచి సంవిధానం ప్రదర్శించారు. నాగావళి పురం 'చొక్కా వారి తోట' తన కథ చెబుతుంది. తాను సాక్షిగా వున్న మార్పులు, అన్యాయాలు, ఘోరాలు వల్లె వేస్తుంది. అక్కడ అయిదంతస్తుల భవంతి లేస్తుంది. '....... ఇంకా ఈ పాపాన్ని మోయడం నావల్లకాదు. ఒక్కసారి ఒళ్ళు విదిలించి కంపించేను. అంతే, అంతస్తుల భవంతి కూలిపోయింది. శిధిలాల్లోంచే... మళ్ళీ కొత్తగా మొలకెత్తేది' రచయిత తన సందేశాన్ని ధ్వనిపూర్వకంగా అందించారు.

మనుష్యుల కంటే జంతువులకే విశ్వాసం ఎక్కువని నందవరం మృదుల 'బంగారం - బుజ్జికొండ' కథలో నిరూపించారు. సాధారణంగా ఇటువంటి ఇతివృత్తంలో చిన్నపిల్లల కథ రాయడం సహజం. మృదుల దీనిని ప్రతిభాన్వితంగా పెద్దల కథగా రాయడం గమనార్హం. బుజ్జి-కుక్క, బంగారం-ఆవు. వాటి మధ్య ఎంతో అన్యోన్యత ఉంది. 'ఆ బంగారు కొండతో పాటు మరికొన్ని బంగారు కొండల్ని లారీలో వేసుకుని యజమాని తీసుకెళ్ళాడు. అవి తిరిగి రాలేదు. బుజ్జి 'అక్కడ వేళాడుతున్న తోలుతిత్తుల దృశ్యం చూడలేకపోయింది'. కవితల్లోనే కాదు కథల్లో కూడా సమకాలీన సంఘటనలు అక్షరరూపం ధరిస్తామని చెప్పడానికి ఈ కథ ఒక ఉదాహరణ.

'కొరివీ - అడివీ' కథలో మొలకలపల్లి కోటేశ్వరరావు మిరపపంట దెబ్బతిన్నపుడు రైతు బాపయ్య కష్టాలను, వేదనను దయనీయంగా చూపారు. అయితే హృదయ విదారకమైన పత్తి రైతుల ఆత్మహత్యలపైన గుండెలను కదిలించే కథలు ఎక్కువగా రాకపోవడం లోపంగానే మిగిలిపోతుంది. 'పాడుబావి' కథలో రాణి శివశంకర్ 'వరి పంట గిట్టుబాటు కాక దివాలా తీసి, ఉరిపోసుకు చచ్చిపోయాడు తండ్రి' అని మాత్రం ప్రస్తావించి వూరుకున్నారు. ఇతర ప్రాంతాల కంటే రాయలసీమ మాండలికంలో కథలు ఎక్కువ వచ్చాయి. తెలంగాణా మాండలికంలో కూడా కొన్ని కథలు వచ్చాయి. 'అడిగేరు' కథను గీతాంజలి రావిశాస్త్రి శైలిలో స్త్రీల కోణం నుంచి రాశారు. మాండలికాలలో కథలు రావడం వాంఛనీయమే. అయితే సులభంగా అందరికీ అర్థం కాని పదాలను వాడినప్పుడు వాటి అర్థాన్ని ప్రామాణిక వ్యవహారిక భాషలో ఇచ్చినట్లయితే పాఠక లోకానికి ఎక్కువ మేలు జరుగుతుంది. పదాలు ఇతర ప్రాంతాలకు వ్యాప్తి చెందేందుకు వీలుంటుంది. పఠనసౌలభ్యం చేకూరుతుంది.

ఇది భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సరం. దేశ భక్తి, స్వాతంత్ర్య సాధన మొదలైన ఇతివృత్తాలు స్వీకరించిన కథలు వేళ్ళమీద లెక్కించవచ్చు. ముందు తరాలు ఈ సత్యాన్ని గమనించి ఆశ్చర్యపోవడంలో విశేషం లేదు. కథకులకు ఇంకా అవకాశముంది. దేశభక్తి కొత్త అన్వయం చెప్పిన కథ కపిల రాసిన 'దేశభక్తుడు'. దీనిలో రచయిత 'నీకు తుపాకి నేనిస్తాను. నీకు కావల్సిన తుపాకి తీసుకో. ఈ దేశాన్ని వేర్పాటువాదుల నుంచి, తీవ్రవాదుల నుంచి, ఉగ్రవాదుల నుంచి కాపాడ్డానికి మనలాంటి కొన్ని లక్షల మంది పనిచేస్తున్నరు....' అని అనిపిస్తారు ఒక పాత్రలో.

ఈ తరం పాఠకులను వెనుకటి ఉత్తమ కథల ఔన్నత్యాన్ని తెలియపరచేందుకు అనుసరించే ఒక మార్గం వాటిని తిరిగి ప్రచురించడం. కె.ఎస్.వై. పతంజలి కథ

'చూపున్నపాట' ఆకోవకు చెందింది. ఇది 1984లో ఆంధ్రజ్యోతిలో ప్రచురితమయింది. గుడ్డివాడి వేణుగానంలో నక్సలైట్ రాగం వినిపిస్తుంది విశ్వనాథానికి బూటుకాలితో వేణువును తొక్కాడు. 'చిట్టిన వేణువు నుంచి రక్తం స్రవిస్తోంది ఆగకుండా.'

హాయిగా నవ్వించే కథలు కనుమరుగవుతూ వుండడం హాస్యప్రియుల్ని నిరాశ పరుస్తోంది. కథకులెందుచేతనో హాస్యకథలపైన మనస్సు లగ్నం చేయడం లేదు. అందుకే నానాటికీ ఈ బాణీ కథలు కరువైపోతున్నాయి.

మన కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేసుకునేందుకు అనువాదాలు కూడా తోడ్పడతాయి. ఈ సత్యాన్ని గుర్తించి 'ఆంధ్రజ్యోతి' అప్పుడప్పుడు అనువాద కథలను ప్రచురిస్తోంది. యోగిరాజ్ వాగ్మార్' కార్మికుడి భార్య' కథలో మరణించిన కార్మికుడి కుమార్తె గీత ఒక ఇంటిలో పనిపిల్లగా చేరి ఆ గృహిణి అభిమానాన్ని పొందుతుంది. మంచం పట్టిన తల్లిని పోషించడం కోసం గీత శ్రమిస్తుంది. గీత తల్లి కన్నుమూస్తుంది. దానిని కొక్కుల పద్మావతి తెనిగించారు. చిన్ననాటి జ్ఞాపకాలను నెమరువేసుకుంటున్న రస్కిన్‌బాండ్ కథ 'మడుగు'. శ్రీధరరావ్ దేశ్‌పాండే దానిని అనువదించారు. ఈ అనువాదాలకు సంబంధించి అనువాదకులూ, పత్రికా సంపాదకులూ ఒక ముఖ్య విషయం గమనించాలి. మూలభాష పాఠకులకు తెలియపరచాలి. ఆ రచయిత గురించి ముఖ్యమైన వివరాలు అందజేయాలి. భారతీయ భాషా సాహిత్యాలు మరింత సన్నిహిత మయ్యేందుకు అనువాద ప్రక్రియ బలీయ సాధనంగా ఉపకరిస్తుంది. అలాంటి సందర్భంలో మూల భాష వెల్లడించడం, రచయిత వివరాలు సంగ్రహంగానైనా పొందుపరచడం అత్యావశ్యకం. పైన చెప్పిన రెండు కథల్లో మూలభాష చెప్పలేదు. ఆ రచయిత పేర్లు తప్ప మరే వివరం తెలియపరచలేదు.

సాహిత్యంలో ఇతర ప్రక్రియల కంటే సృజనాత్మక రచయితకి ఎక్కువ బాధ్యత ఉంది. ఒక నిశిత సమస్య గురించి కథ రాసేటప్పుడు దానిపైన పూర్తి అవగాహనతో పాటు వివేకవంతమైన పరిష్కారం చెప్పగల సాహసం కూడా వుండితీరాలి. ఆ పరిష్కారంతో అందరూ ఏకీభవించనక్కర లేదు. 'వెన్నెల' కథలో డి. ఆర్. ఇంద్ర నేడు తరచు తలెత్తే సమస్యను చిత్రించారు. నారాయణరావు దంపతుల కుమార్తె వెన్నెల, తెలివిగలది. అతని మిత్రుడి పట్టుదల కారణంగా వెన్నెలని ఎం.ఫిల్ వరకు చదివించాడు. ఆమె తీసుకున్న విషయం 'స్త్రీవాద సాహిత్య ప్రభావం' వెన్నెల అవివాహితగానే గర్భం ధరిస్తుంది. పెళ్ళి చేస్తానంటే వద్దని పై చదువులకు పంపడం వల్ల ఈ అనర్థం వచ్చిందని నారాయణరావు మిత్రున్ని నిందిస్తాడు. వెన్నెలకిది అసలు సమస్య కాదేమో! వెన్నెల కోరుకునే స్వేచ్ఛా

జీవిత విధానమేమో యిది! వెన్నెలని ప్రశ్నించడానికి నాకేం హక్కుంది? తనుచేస్తున్న ప్రయోగం తాలూకు ఫలితాలు ఎలా వుంటాయో విద్యాధికురాలు, సామాజిక విలువల పరిశోధకురాలు, స్త్రీవాద రచయిత్రి అయిన వెన్నెలకి తెలీదా? అలా అని యీ విషయంలో నాకేం సంబంధం లేనట్టు నేను తప్పుకోవడం సమంజసమేనా? అంత చలిలోనూ నా బుర్ర వేడెక్కసాగింది. ఎంతసేపలా వున్నానో అడుగుల చప్పుడుకి వెనుదిరిగి చూశాను. మాలతి దగ్గరకొచ్చింది. మాలతి ఏం మాట్లాడి వుంటుంది? నేనడగలేదు. మాలతి చెప్పలేదు. నాకు చలిగాలి తగులుతోందని కాబోలు మాలతి పైట తీసి నా చుట్టూ కప్పి నా భుజం పై తలవాల్చింది. కొద్దిక్షణాల్లో తెల్లారబోతున్నట్లు పరిసరాలు తెల్లముసుగుని తొలగించుకుంటున్నాయి. వెన్నెల అవ్యక్తంగా అనిర్వచనీయంగా వుంది. ఇవి కథాంతంలో మిత్రుడు (రచయిత) అన్నమాటలు. ఇంత సుదీర్ఘంగా ఈ మాటలు ఉదాహరించడానికి కారణం రచయిత చూపిన మార్గం తెలుసుకోవడం కోసం, అవ్యక్తం అనిర్వచనీయం అని సరిపెట్టుకుంటే ఎలా? వెలుగు చూపాలి. దానికి తరువాయి నా మంచి కథ రావాలి.

1997 సంవత్సరంలో 'ఆంధ్రజ్యోతి'లో వచ్చిన కథల్లో స్త్రీవాదం ఆధారంగా వున్న కథలు ఎక్కువగా పాఠకుల మన్ననలు పొందాయి. అగ్రతాంబూలం వాటిదే. కొన్ని కథలు పరిశీలిద్దాం.

'వంట' కథలో రచయిత మానేపల్లి పర్మిని అనే పాత్ర నోట ఒక సత్యం పలికిస్తారు. 'దోపిడీచేసే ముందు చులకన చేసి నీచంగా చూసి అవమానించడం దోపిడీదారుల వర్గస్వభావం. ఎంత చదువుకున్నా ఎన్ని ఆదర్శాలు నిర్వాకం చేసినా మగవాళ్ళు ఆ స్వభావంలోంచి బయటపడడం చాలా కష్టం'.

పసుపులేటి గీత 'పసిరిమొగ్గ' కథలో సంతానం ఇచ్చే చేవలేని వెంకటేశ్వర్లు పెళ్ళి మీద పెళ్ళి చేసుకుని భార్యల్ని నిందించడం గురించి చెప్పి వూరుకోలేదు. వంశం నిలపడం కోసం మామ ఒక కోడలికి కడుపు చేయడం చూపారు. అంతేకాదు. వెంకటేశ్వర్లు రెండవ భార్య సంతానం కోసం పాలేరుతో పొత్తు పెట్టుకుంటుంది. ఇందులో చూడవలసింది సంప్రదాయ ఉల్లంఘన కాదు. పురుషాహంకారం. పసుపులేటి గీత కృతకృత్యురాలయ్యారు.

కొండేపూడి నిర్మల 'పురుగు' కథలో అడ్వకేటు సుబ్బారావు 'స్త్రీల మోడేస్టీని రక్షించడం ఎలా?' అనే అంశం మీద స్టుడియోలో రిపోర్టరు నీరజకిచ్చిన ఇంటర్వ్యూలో వెకిలిగా ప్రవర్తించడం చూపారు. 'కావిలించుకోవడం ఎలాగో కూడా చూపిస్తాడేమోనని

బిక్కప్రాణంతో కూర్చున్నారంతా' ఇలాంటిది సుబ్బారావు వైనం నీచప్రవృత్తి.

కుప్పిలి పద్మ 'ముక్త' కథలో కుటుంబ సభ్యుల అభిప్రాయాలను వ్యాఖ్యానిస్తూ 'భర్త అనే మగవాని పెత్తనాన్ని వద్దనుకుంటే ఎలాగోలా వదిలించుకోవచ్చు. మరి యింట్లో వాళ్ళ అధికారాన్ని పెత్తనాన్ని నిరంకుశత్వాన్ని ఎలా వదిలించుకోవాలి? .... పెళ్ళి లేకుండా కూడా జీవితం వుంటుందని జీవితాన్ని నిర్మించుకునే కలలుంటాయని వాళ్ళకి అర్థం' అని ఒక పాత్ర చెబుతుంది.

ఓల్గా కథ 'హింస' విలక్షణమైంది. డి అండ్ సి చేసిన మూణ్నెల్లకి సుగుణ గర్భవతి అవుతుంది. జననాంగ సంబంధమైన ఎడిమా వస్తుంది. బిడ్డ బతకదనీ, ఎబార్షన్ చేయించుకోమనీ డాక్టరు చెబుతుంది. సుగుణ వినదు. బిడ్డ ప్రాణం పోతుంది. 'సుగుణ శరీరం, మనసూ అన్నీ హింసలకూ అతీతమైపోయాయి' హింస స్వభావాన్ని ఓల్గా నిశితంగా చూపారు. 'ఎవరికి వారు హింసను స్వయంగా అనుభవిస్తారు. తమని తామే హింస పెట్టుకుంటారు. అసలది హింసని అనుకోనే అనుకోరు. ఇన్నాళ్ళ పురుషాధిపత్యం తన అధికారాన్ని ఇలాగే నిలబెట్టుకుంది?

మైనారిటీ కథలకు తగిన స్థానం ఇవ్వడంలో 'ఆంధ్రజ్యోతి' అగ్రగామి కావడం ముదావహం. ఈ కథల వల్ల ఎన్నో ప్రయోజనలు సిద్ధిస్తాయి. ముస్లిం సంప్రదాయం, ఆచారాలు, జీవన విధానాలు చూపేవే కాక ఇతర ఇతివృత్తాలతో కూడా మంచి కథలు వచ్చాయి. భాజా రాసిన 'హరాం' కథలో అబ్దుల్ గ్యాంగ్‌కి బస్సులో వెళ్ళే ఆడపిల్లల్ని ఆట పట్టించడం సరదా. ఒకసారి బురఖాలో వున్న ఒక అమ్మాయిని ఆట పట్టించారు. అయితే ఆ అమ్మాయి అబ్దుల్ చెల్లెలే. కథని భాజా గమ్మత్తుగా నడిపారు.

మహమ్మద్ ఖదీర్ బాబు కథ 'దావత్' ముస్లిం వివాహంలో జరిగే లాంఛనాలు, విందు వివరాలు కథాకథనంలో చక్కగా తెలియపరిచారు.

దళిత కథలకు 'ఆంధ్రజ్యోతి' ఆది నుంచి ప్రత్యే స్థానం ఇస్తోంది. వెనుకటి సంవత్సరాలలో మాదిరే 1997లో కూడా 'ఆంధ్రజ్యోతి'లో దళిత కథలు ప్రచురిత మయ్యాయి. దళితకథా ప్రక్రియకు వస్తుపరంగానూ, సంవిధాన పరంగానూ సమున్నత ప్రమాణాలు సంతరింప జేసిన కథకులు కొలకలూరి ఇనాక్. ఇందుకు ఆయన కథ 'గొడ్డుదొంగ' ను పేర్కోవచ్చు.

కొంతవరకు ఈ స్ఫూర్తిని అందుకుని రాసిన కథ తారకరామారావు 'తీర్థం' దేవదానం నాదస్వర విద్వాంసుడు. ఆ విద్యలో తగినంత ప్రోత్సాహం లేదు. కులవృత్తిగా మగ్గం వుంది. దాంతో జీవయాత్ర చేస్తున్నాడు. పూజారి గోపాలాచార్యులు దేవదానం

కొడుకుకు రామానుజులికి వేదవిద్య బోధిస్తాడు. రామానుజులు గుడి అర్చకుడవుతాడు.

పైన సమీక్షించిన కథలను బట్టి తెలుగు సాహితీ రంగంలో కథాప్రక్రియ తన విశిష్టస్థానాన్ని భద్రపరుచుకుటూ పురోగమిస్తున్న సత్యం స్పష్టమవుతుంది. కథకులూ, పత్రికా సంపాదకులు భవిష్యత్తులో కూడా క్రమాధిక దీక్షాసక్తులతో కథారంగాన్ని సముజ్జ్వలంగా భాసింపచేయగలరని విశ్వసిద్దాం.



# ఈనాడు ఆదివారం

ఈనాడు దినపత్రిక ఆదివారం సంచికలో వారం వారం ఒక కథను ప్రచురించడం ఆనవాయితి. ఈ ఏడు మొత్తం యాభయి కథలు వచ్చాయి. ఈనాడు ఆదివారం సంచిక సంపాదకులు ప్రచురించే కథల్లో హాస్య, వ్యంగ్య కథలకు, మానవత్వం విలువలకు, నైతిక విలువలకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చినట్లు కథల ఎంపికను బట్టి తెలుస్తోంది. నెల నెలా కనీసం ఒక హాస్య కథకు స్థానం కల్పించారు.

ముందుగా చెప్పుకోవాల్సింది కాశీ విశ్వనాథం గారి "నాటకం" కథ (28 సెప్టెంబర్ - 97) కథను రచయితే చెప్తాడు. రచయిత మంచి నాటక రచయిత, నటుడు కూడ. నాటక సమాజంతో కలిసి పనిచేసిన మిత్రుడు జగ్గారావు హఠాత్తుగా ఒకరోజు ప్రత్యక్షమవుతాడు. ఎప్పుడో పాతికేళ్ళ క్రితం విశాఖలో స్థాపించిన "ప్రియమంజరి" నాటక సమాజాన్ని తిరిగి పూర్వ వైభవంలోకి తెద్దామంటాడు జగ్గారావు. ఆ ప్రయత్నంలోనే కార్యక్రమాన్ని రూపొందించి ఒక ఇన్విటేషన్ కార్డును కూడ చూపిస్తాడు. అందులోని ఉపన్యాసకుల పేర్లలో మొదటి పేరును చూపిస్తాడు జగ్గారావు. ఆ పేరు నాదమునిది. నాదముని ఉపన్యాస కేసరి.

ఏ విషయం పైనైనా కనీసం రెండు గంటల పాటు ఆగకుండ మాట్లాడగలడు. అలాంటి నాదముని అప్పట్లో "ప్రియమంజరి" నాటక సమాజానికి ప్రెసిడెంటు. ఆయన కారణంగా రంగస్థలంపై వాళ్ల నాటకం తక్కువై నాదముని ఉపన్యాసం ఎక్కువై చివరకు ఆ సమాజమే మూలపడుతుంది. అలా పాతికేళ్ల క్రితం స్థాపించబడి కొన్నాళ్లు (నాదముని ఉపన్యాసాల హోరును సహితం సహించి) సమాజం నడిచి చివరకు మూలబడింది. మళ్లీ

యిప్పుడు కొత్తగా దాన్ని పునరిద్దామని పూనుకుంటే ఇటీవలే రిటైరైన నాదముని చాలా నాటకీయంగా మళ్లీ ఇన్విటేషన్ కార్డులో మొదటి వక్తగా చొరబడతాడు. అతణ్ణి ఎలాగైనా తప్పించాలని జగ్గారావు ప్లాను "తప్పించేవాణ్ణి ఎందుకు చేర్చావయ్యా" అంటే నాదముని భార్య ఒకరోజు ఇంటికి వచ్చి తమ్ముడూ నా పసుపు కుంకుమలు కాపాడు అంటూ సెంటిమెంటల్ డైలాగుతో ఆరంభించి ఇరకాటంలో పడేసింది. డాక్టర్లు నాదముని కడుపుని పరీక్షించి ఆయనగారు కంఠతా పట్టిన ఉపన్యాసాలన్నీ ఓ చెత్తకుప్పలా తయారై పోయాయనని ఆపరేషన్ చేసి ఆ ఉపన్యాసాల కుప్పని తొలగించే లెవల్‌కి ఇంకా వైద్య విజ్ఞానం ఎదగలేదని, అతడిచేత ఉపన్యాసాలిప్పించి ఆ చెత్తను తొలగించడం ఒకటే మార్గమని లేకుంటే శాల్తీ బాల్చీ తన్నేయడం ఖాయమని చెప్పారని, అందుకని ఉపన్యాసం ఇచ్చే అవకాశం కల్పించాలని నాదముని భార్య చేతులు పట్టుకొని బతిమిలాడితే కాదనలేక పేరు వేయించా" అంటూ వివరిస్తాడు జగ్గారావు. నాటకానికి ముందు నాదముని ఉపన్యాసం పెడితే, నాటకం చూడటానికి ప్రేక్షకులు మిగలరు. శ్రోతగా ఉన్న దశలోనే వాళ్ళు ముగిసిపోతారని అందరి భయం. చివరికి బాగా ఆలోచించి రచయిత ఒక ఉపాయం చెప్తాడు. "రేయ్! జగ్గా! నాదమునిని చివర్లో మాట్లాడమందాం అదీ ఉపన్యాసం కాకుండా నాటకం గురించి, ఆర్టిస్టు, టెక్నీషియన్ల పేర్లు వగైరా చెప్పమని అందాం. అతడు ఎంత సాగదీసినా రెండు నిమిషాలకు మించి పట్టదు. దీంతో వీడియో కవరేజ్‌లో వాడి ముఖమూ పడుతుంది. ప్రేక్షకులకు నాదముని ఉపన్యాసం అనే గునపంతో పొడిచే ప్రమాదం తప్పుతుంది" అని సూచిస్తాడు రచయిత.

నాటకం రోజున కార్డులో పేర్లున్న వాళ్ళందరూ సమయానికే వస్తారు. నాదముని పెళ్లికొడుకులా సింగారించుకొని వస్తాడు. విషయం ముందే నాదమునికి వివరిస్తాడు రచయిత. "మీరు ఎనౌన్స్‌మెంట్ మాత్రమే ఇవ్వాలి. వచ్చిన అతిథుల ఉపన్యాసాలు నాటకం అంతా కలిపి తొమ్మిదిన్నరకల్లా అయిపోవాలి" అని సూచిస్తాడు.

సభ ప్రారంభమవుతుంది. వచ్చిన అతిథులందరూ క్లుప్తంగా మాట్లాడ్డంతో వచ్చిన వాళ్లందరి ఉపన్యాసాలు ఎనిమిదింబావుకే అయిపోతాయి. గంటన్నర నాటకం ఇంకా మిగిలి వుంది. కార్యక్రమం తొమ్మిదిన్నరకల్లా ఎలా ముగించాలి అని ఆలోచిస్తుంటే, నాదముని రంగప్రవేశం చేసి, ఉపన్యాసం అందుకుంటాడు. ప్రేక్షకులు ఒక్కొక్కరే వెళ్ళిపోతారు. వచ్చిన టి.వి. వాళ్ళు తొమ్మిదిన్నరకు వెళ్లిపోతారు.

"నేనిప్పుడు ఉపన్యాసం ఇవ్వదల్చుకోలేదు. ఎందుకంటే యిప్పటికే కాలాతీతమై పోయింది" అని నాదముని అనేప్పటికే పదిగంటల పదినిమిషాలయిపోయింది. అప్పటికే

ఉబ్బిపోయివున్న నాదముని ఉపన్యాసాల పొట్ట ఆరంగుళాలు తగ్గిపోయింది. అది చూ! నాదముని భార్య మంగళసూత్రాలు కళ్లకద్దుకుంది. మైకాసురుల మీద రాయబడి మంచి హాస్యకథ ఇది.

మరో మంచి హాస్యకథ ఇచ్ఛాపురం రామచంద్రం గారి "దండోద్దండ" (20 ఏప్రి - 97) అనే ఒక డీలక్స్ "సన్మాన్ కేంద్ర' కథ ఇది. అచ్చట అందరికి అన్ని రకాలై సన్మానములు దొరకబడును. ఆర్డినరీ, డీలక్స్, సూపర్, సూపర్ డూపర్ ఇలా ఏ రక సన్మానాలైనా అక్కడ అనుకున్న రీతిలో చేయగల సన్మానాలకేంద్ర కథ ఇది. ఎందరెందరిక దండలల్లి ఇచ్చిన కోదండం కథ ఇది. ఎందరి సన్మానాలకు, సభలకు ఇంకా అనేకానే! కార్యక్రమాలకు దండలు, బొకేలు అందించిన కోదండాన్ని, కోదండం ప్రతిభను ఎవరు గుర్తించి కనీసం ఒక దండకూడ అతడి మెడలో వేసి, అతడి శ్రమను గుర్తించరు అందుకని చివరకు కోదండమే ఈ "డీలక్స్ సన్మాన కేంద్రలో సన్మానం చేయించుకోటాని కాంట్రాక్ట్ ఏర్పరచుకుంటాడు. సన్మానంతో పాటు సన్మాన పత్రం కూడ రాయించి "దండోద్దండ" అని బిరుదును కూడ ఇచ్చే ఏర్పాటు చేసుకుంటాడు కోదండం.

ఇచ్ఛాపురపు రామచంద్రం గారిదే మరో కథ "గిన్నిల బుక్కు" (14 సెప్టెంబర్ 97) "గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్" గురించి టీ.వీలో వచ్చే అర్థం పర్థం లేని గిన్నిస్ బుక్ రికార్డ్ గురించి చూసి చూసి చివరకు ఒక అంట్లు తోమే పనిమనిషి తాను కూడా తన పనిల నైపుణ్యాన్ని, వేగాన్ని ప్రదర్శించి గిన్నిస్‌బుక్‌లో ఎక్కాలని అనుకోవడం కథ ఇతివృత్తం

"ఏదో ఒకటి వెధవ పనేనా చేసి ఆ బుక్కులో కెక్కకపోతే జీవితం వృథా" - అ ఇంటి యజమాని, మనిషి గంటకు ఎన్ని ఫిల్టర్ సిగరెట్టు కాల్చగలడు అనే దాని మీ రికార్డు నెలకొల్పుదామనుకుంటే - 'ఒక స్త్రీ ఒక గంటలో ఎన్ని కొత్త చీరలు మార్చగలడు అనే దానిపై ఇల్లాలు, ఒక రోజులో ఎంతమంది ఆడపిల్లలను ఏడిపించగలనని కొడుకు ఒక రోజులో ఎన్ని సినిమాలు చూసి స్టోరీలు చెప్పగలనో అని కూతురు.... ఇలా ఇంట్ వాళ్లందరూ తమ తమ అభీష్టాల మేరకు గిన్నిస్ బుక్ రికార్డ్ స్థాపించాలని చూస్తుంటే "అమ్మగారూ! గిన్నెలేయండి. గంటకు ఎన్ని ఇండ్లు ఎక్కువ తోమగలనో, గంటకు ఎన్ని గిన్నెలు తోమగలనో అని ప్రాక్టీసు చేస్తున్నా, గబగబ గిన్నెలట్టుకురండి. అని అనడంత ఇంట్లో వాళ్ళందరు - గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కాలనే ఆలోచన ఎంత 'చీపో' తెలిసిపోయి జ్ఞానోదయమవుతుంది అందరికి. గిన్నిస్ బుక్ రికార్డ్సులోకి వచ్చిన హాస్య కథ యిది.

షణ్ముఖరావు గారి (2 మార్చి 1997) "డామిట్" అనే కథ కన్యాశుల్కం లో పాత్రలతో నడిపించిన కథ. చండశాసనుడైన ఆఫీసరు వచ్చింది లగాయితు అతడి

క్రమశిక్షణకు, పనికి తారెత్తిపోయిన స్టాఫ్ ఎప్పుడు వీడి పీడా విరగడవుతుందిరా అంటూ ఎదురుతెన్నులు చూస్తుంటారు. కొన్నాళ్ళకు ఆఫీసరు గారికి ట్రాన్స్‌ఫర్ అవుతోంది అనే వార్తతో "బ్రతుకుజీవుడా" అని అందరూ సంతోషంగా ఊపిరి పీల్చుకొని "పీడ విరగడ అయింది" అనే సంతోషంతో అతగాడికి ఒక పార్టీ ఇచ్చి, మొసలి కన్నీరు కారుస్తూ "మన ఆఫీసరుగారు మనందరికీ పెద్దదిక్కులా, ఒక తండ్రిలా ఉన్నారు. మన సార్ ట్రాన్స్‌ఫర్ ఆపాలని నేను ఆమరణ నిరాహార దీక్ష చేద్దామనుకున్నా అంటూ తలా ఒక ప్రశంసాస్త్రాన్ని ప్రయోగిస్తారు. చివరకు అతడు వీడ్కోలు తీసుకొని వెళ్లిపోయే రోజు వస్తుంది. అప్పుడు అందర్ని పిలిచి "డియర్ ఫ్రెండ్స్ మీ ప్రేమాభిమానాలు, మీ సిన్సియారిటీ నన్నెంతో కదిలించింది. మిమ్మల్ని బాధ పెట్టడం ఇష్టంలేక ఇంకా కొన్నాళ్ళు మీ స్నేహ సహకారాలతో ఇక్కడే పనిచేసి ఈ ఆఫీసును ఇంకా డెవలప్ చేయాలని పైకి రాసాను గవర్నమెంట్ ఒప్పుకుంది. ఇంకా మనం కొన్నాళ్ళు కలిసి పనిచేసే అదృష్టం కలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది" అని అనడంతో మృత్యుదేవతను చూసినట్లు ఆఫీసరును చూసి, అందరూ గజ గజా వణికిపోతారు.

మరో కథ కె.కె. రఘునందన గారి "తగునా ఇది నాథా" ( 19 జనవరి - 97) సమాజంలో ఉండే అన్ని విషయాలకు రియాక్ట్ అయ్యే వ్యక్తి కథ ఇది. హాస్య కథనంతో సాగుతుంది. కథలో హాస్యం లేదు. కాని కథనంలో హాస్యాన్ని జోడించాడు. రచయిత, ప్రపంచంలో మన కళ్లెదుట ఎన్నో విషయాలు అన్యాయాలుగా, అక్రమాలుగా కనిపించవచ్చు గాక. అంత మాత్రం చేత ప్రతి విషయాన్ని పట్టించుకుంటే, మనకు జగమంతా శత్రుమయంగానే కనిపిస్తుంది. ఎంత మందితో శత్రుత్వం పెంచుకోగలం. మన మనసులో. అదే భావం పెంపొందిచుకుంటూ పోతే ఎవరి స్నేహానికి చోటివ్వలేం. అందుకని రోజుల్ని బట్టి నొప్పింపిక, తానొవ్వక అనేలా వ్యంగ్యం, లౌక్యం, మాటకారితనం, సమయస్ఫూర్తి అలవాటు చేసుకొని బతకనేర్వడం ముఖ్యం అనే భార్య హితబోధతో జ్ఞానోదయం అయి ఎవరి విషయాల్లో చొరబడక, అనవసరంగా ఇంకొకరి విషయాలకు నిజాయితీగా స్పందించక ఖాళీ దొరికినప్పుడల్లా ఏ పుస్తకమో చదవడం అలవాటు చేసుకుంటాడు అతడు. ఈ కథ హాస్యకథనంలో మనల్ని రంజింపజేసినా, మంచి మనిషి ప్రవర్తనకు, ఈ ప్రస్తుత లోకం తీరును గురించి ఆలోచనల్లో పడేస్తుంది. ఇలాంటి మరో మంచి కథ కొలకలూరి ఇనాక్ గారి "ప్రయాణం" (22 జూన్, 97) కథ. ఇద్దరు ప్రయాణీకుల మధ్య నడిచే కథ ఇది. మానవ స్వభావాన్ని చిత్రించిన కథ.

"పేజర్ ది గ్రేట్ - జంధ్యం వెంకటేశ్‌బాబు కథ (16 ఫిబ్రవరి, 97) ఎమ్బియస్ ప్రసాద్ గారి 'చెదరిన పాట' (6 జూన్, 97) హాస్య కథనంతో సాగినవి. కథ చెప్పుకోదగిన

స్థాయిలో లేదు. హాస్య కథల కోవలోకి వచ్చి పెద్దగా హాస్యం ఉన్నట్లు అనిపించని కథలు వై.సి.పి. వెంకట్ రెడ్డిగారి 'కిరీటి', భమిడి వెంకటేశ్వర్లు 'పాపం పెళ్లికొడుకు', డా॥ ఎల్.కె. సుధాకర్ 'అభద్రత', భరణి గారి 'రహస్యం' మొదలైన కథలు.

"కోరికలపై తెలుగు సాహిత్యంలో ఇప్పటి వరకు చాలానే కథలొచ్చాయి. అలాంటి తీరిన కోరికల కథే ఎం. హరికృష్ణ గారి (7 సెప్టెంబర్, 97) జొన్నరొట్టె పరిచయం మాటలతో ఏర్పడి, తినాలన్న కోరిక బలంగా కలిగి, తినటానికి వీలులేక ఆ కోరిక అలా వాయిదా పడుతూ రావడం కథ ఇతివృత్తం. ఈ కథ చదివాక ఒక మంచి కథ చదివామన్న తృప్తి కలుగుతుంది.

ఆర్థికపరమైన విలువలు మనుషుల సంబంధాలను శాసిస్తాయి అని నిరూపించే కథలు చాలానే ఉన్నాయి. ఆ విషయాన్నే నిజం చేస్తూ రాసిక కథలు కొన్ని..........

పుష్యమి గారి "వర్ణధూళి" (జనవరి 97) మంచి కళాకారుడైన ఒక వ్యక్తి ఎంతో ప్రతిభతో కాన్వాసుపై దించిన రంగు చిత్రాలు, అతడికి ఒక పూట కడుపును నింపలేక పోతాయి. చివరకు పేవ్‌మెంట్‌పై సుద్దముక్కలతో, అతడు గీసిన దేవుళ్ళ బొమ్మలు ఆతడి కడుపు నింపుతాయి. అప్పుడు ఆ కళాకారుడు తన స్నేహితుడితో అంటాడు "మిత్రమా! వీళ్లు నాలోని ఆర్టిస్టుని గుర్తించి కాదు. ఈ చిల్లర డబ్బులు బిచ్చమేస్తుంది నేను గీసే దేవుళ్ళ ముఖం చూసి, ఆ దేవుళ్ళ మీది భక్తితో, నమ్మకంతో నా కడుపు నింపుతున్నారు" అంటాడు. "కళను కళగా గుర్తించని ఈ లోకం కళను, కళాకారుణ్ణి పోషించదు. తమలోని నమ్మకాన్ని భక్తిని పోషించుకుంటారు"అని చెప్తుందీ కథ. పేవ్‌మెంట్ పై అద్భుత కళాఖండాలు సృష్టించే, బడుగుబతుకుల కళాకారుడిపై రాయబడిన కథ.

ముసలితనంలో బ్రతికుండగా ఎవరూ పట్టించుకోని బంధువులు ఆమె చచ్చాక ఆమె ఆస్తుల కోసం పోటీలు పడడం సత్యవోలు సుందరసాయి 'ప్రదక్షిణం' (25 మే 97) కథ. ఆమెకు సంబంధించిన డబ్బును వయోవృద్ధుల సంక్షేమ సంస్థకు అప్పగించిన రసీదులు కళ్ళబడ్డాక అందరూ మెల్లగా జారుకుంటారు.

తమ వద్ద పనిచేసే పనిమనిషి కష్టంలో ఉంటే తాకట్టు పెట్టుకొనిగాని వడ్డీల కియ్యని ఒక అమ్మ కథ ఎమ్. ఉమామహేశ్వరరావు గారి "అంతర్ధర్మం" (9 నవంబర్, 97) తోటి మనిషి కష్టాల్లో ఉంటే చలించకుండా తాకట్టు పెట్టుకొని డబ్బిచ్చిన మనిషి. బిడ్డ ప్రాణాపాయంలో ఉందంటే వెనుక ముందు ఆలోచించకుండా రక్తదానం చేసి ఆ బిడ్డను కాపాడిన మనిషి కథ. అలాంటి మనుషులను చూసి, డబ్బు మనుషులు తెలుసుకున్న "అంతర్ధర్మం" ఏమిటో చెప్పే కథ.

డబ్బు కోసమే మనిషి విదేశాలకు వెళ్లేది అనేది పరమసత్యం. ఆ డబ్బు ముందు అన్ని బంధాలు, పుట్టిన ఊరు, మట్టి మీది మమకారం కాదని విదేశాలకు వెళ్లిన మనుషుల మనస్తత్వంపై రెండు కథలు వచ్చాయి, ఒకటి శ్రీసుభాగారి 'దేవుడు', రెండవది పులికంటి కృష్ణారెడ్డి గారి 'ఊతకర్ర'.

స్త్రీ పురుష సంబంధాలపై కూడా కొన్ని మంచి కథలున్నాయి. కొన్నాళ్ళ క్రితం ఆడది వంటింటికి, పడకటింటికి పనికొచ్చే మనిషిగా ఉండేది. చైతన్యం లేని ఆడది లేదా సాటిమనిషిగా గుర్తించని మగవాడికి ఈనాటి స్త్రీ బయట పురుషుడితో సమానంగా ఉద్యోగం చేసి డబ్బు గడించి, డబ్బు చెట్టు కూడా అవుతోంది. - ఆర్.యస్.కె. మూర్తి 'సాయం' కథ (31 ఆగస్ట్, 97).

సవతి తల్లిలాగే తండ్రులుంటారని వాళ్ళలో కసాయితనమే తప్ప ప్రేమానురాగా లుండవని చెప్పే పురుషాహంకార కథ 'పురుష హృదయం' (27 జూలై, 97) రచయిత సత్తైనపల్లి రామమోహనరావు. భార్య పోయి ముగ్గురు పిల్లలున్నవాడు. తన ఆఫీసులో తన లాగే భర్తపోయి ఒక కొడుకుతో బ్రతుకుతున్న జ్యోతిని పెండ్లి చేసుకుంటాడు. జ్యోతి మొదటి సంబంధం కొడుకు తన కొడుకు కాదని ఆ పిల్లాడి అనారోగ్యంలో మందుకు బదులు విషమిచ్చి తుదముట్టిస్తాడు. ఇదీ పురుషహృదయంలోని కథ. ఆడది స్వీకరించినట్టు మగాడు ఇతరుల బాధ్యతలను స్వీకరించడని ఈ కథ చెపుతుంది.

కట్నకానుకలు ఏమీ ఇవ్వం అని ఆదర్శంగా నిలబడి పెళ్లికి అనవసరపు ఖరీదయిన పట్టుచీరలు, నగలు కూడా వద్దని కోరినవాడితో కోరిన విధంగా పెళ్లికి ఒప్పించిన "మనస్విని" కథ గోగినేని మణి (19 అక్టోబర్, 97) 'కలసిన హృదయాలలోన'

"బాధ్యతల్లోనూ నాకూ వాటా కావాలి నాన్నా! కొడుకు దగ్గరకెళ్లి ఎంత స్వతంత్రంగా ఉంటారో, అలాగే మా దగ్గరకూ వచ్చి ఉండాలి! మీకేమైనా చేయాల్సి వచ్చినపుడు కోడలు బాధ్యత కొద్దీ చేస్తుంది. కూతురయితే అభిమానంతో చేస్తుందని గుర్తుంచుకోండి" అని గర్వంగా చెప్పిన కూతురు కథ ఇది.

ఆర్థిక స్వాతంత్ర్యం మనిషి ప్రవర్తనను శాసిస్తుంది. ఆర్థిక స్వాతంత్ర్యం లేని స్త్రీలు అన్నింటికి రాజీపడి బ్రతుకు ఈడ్వడం జరుగుతుంది. ఆర్థిక స్వాతంత్ర్యం ఉండి, దాంపత్య బంధాన్ని, తాళిని కాదని పోలేక సతమతమవుతున్న తరుణంలో రైలు ప్రయాణంలో కనిపించిన ఒక దృశ్యం ఆమె ఆలోచనను ఒడ్డున పడేస్తుంది.

"బేవార్సు నాకొడకా? ఏంట్రా ఆ మిడిసిపాటు? నేన్నీ పెళ్లానిరా? ఉంపుడుకత్తెను కాదు. ఇన్నాళ్ళూ నన్నవమానించినా, లేని రంకుతనాలంటగట్టినా, సావబాదినా ఒల్లకున్నాను.

నా రెక్కల కష్టంతో బతికినవాడివిరా నువ్వు నీ అమ్మ కొట్టినా, ముఖం మీద ఊసి ఇన్నాళ్లూ సయించానురా. మా అయ్య డబ్బులతో సోకులు సేసిన సన్నాసోడివిరా నువ్ ఒరే! ఇక్కడితో నీకు నాకు సర్రా. ఒరే నాకు జబ్బల్లో సత్తువుందిరా! నా బతుకు నే బతకగలన్రా" అంటూ మెళ్లోని పసుపుతాడు తీసి అతడి ముఖంపై విసిరికొట్టిన దృశ్య చూసాక శైలజలో కూడ తెగింపు రావడం, పి.వి.బి. శ్రీరామమూర్తి కథ "స్ఫూర్తి" (8 జూ 97).

తాగుబోతయిన భర్త తన వ్యసనానికి కుటుంబాన్ని మరిచి తన సుఖం కోస డబ్బు కోసం చివరకు భార్యను, పిల్లలను ఖాతరు చేయక బ్రతుకుతుంటే, ఆ తాగుబో మనిషిని కాదని బయట కొస్తుందా యిల్లాలు. ఎలాగైనా బ్రతకాలి, ఆకలితో చావ కన్నా, ఏ పని చేసైనా బ్రతకాలని కప్పగంతుల మల్లికార్జునరావు "ఈల" కథ (4 మే, 9 చెప్తుంది. బ్రతకటానికి, పిల్లల్ని బ్రతికించుకోటానికి, ఒళ్లమ్ముకోడానికి కూడా సిద్ధ తన శరీరం కోసం ఈల వేసే వాళ్ళ వైపు రెండడుగులు వేసి, మళ్ళీ విచక్షణ మేల్కొ శ్రమ వైపు, వెలుగు వైపు నడుస్తుందా యిల్లాలు.

ఆడవాళ్లు చదువుకొని, ఉద్యోగం చేస్తూ తమ కాళ్ళపై తాము నిలబడుతు రోజులివి. ఆర్థిక స్వాతంత్ర్యం కారణంగా నేడు సమాజంలో చాలామంది స్త్రీలు దాంప జీవనానికి, పురుషుడి అహంకారానికి తలవంచక స్వతంత్ర జీవనం గడప పరిపాటయింది. 'స్ఫూర్తి', 'ఈల' ఈ పై రెండు కథల్లో ఈ విషయం స్పష్టంగా ఉం ఈ రెండు కథలకు పూర్తిగా విరుద్ధంగా సాగిన మరో చక్కటి కథ కె. మురళీకృష్ణ గా (2 ఫిబ్రవరి, 97) "విలువలు". ఈ కథ గురించి వివరంగా చూద్దాం.

కథలు రచయితల మేధస్సులోంచి కాక అనుభవాల్లోంచి, జీవితంలోంచి రావా అలా వచ్చిన కథల్లో నిజాయితీ కనిపిస్తుంది. ఒక ఆవేశమైన ముగింపు, ఒక కృత్రిమమై ముగింపు ఉండవు.

'విలువలు' కథలో ముఖ్యమైన పాత్రలు నాలుగు ఒకరు రాజేశ్వరి, విశ్వం రెండవ వారు పర్లి జంట. మొదటి జంట స్నేహితులు. రెండవ జంట భార్యభర్త రాజేశ్వరి కృష్ణమూర్తి భార్య. ఆమె అత్త వల్ల, భర్త వల్ల, జీవితం పట్ల విసుగు, కోపం కలి ఇంట్లోంచి బయటకొస్తుంది సూట్‌కేస్ పట్టుకొని. "నేను నా వ్యక్తిత్వం కోసం, ఆత్మగౌరవ నిలుపుకోవడం కోసం, మనిషిలా బ్రతకడం కోసమే ఇల్లొదిలి బయటకు వచ్చాను అంటుంది కన్నీళ్లతో రాజేశ్వరి విశ్వంతో.

విశ్వం, రాజేశ్వరి - కృష్ణమూర్తి దంపతులకు స్నేహితుడు. రైల్వేలో ఉద్యోగ

నా రెక్కల కష్టంతో బతికినవాడివిరా నువ్వు నీ అమ్మ కొట్టినా, ముఖం మీద ఊసి ఇన్నాళ్లూ సయించానురా. మా అయ్య డబ్బులతో సోకులు సేసిన సన్నాసోడివిరా నువ్ ఒరే! ఇక్కడితో నీకు నాకు సర్రా. ఒరే నాకు జబ్బల్లో సత్తువుందిరా! నా బతుకు నే బతకగలన్రా" అంటూ మెళ్లోని పసుపుతాడు తీసి అతడి ముఖంపై విసిరికొట్టిన దృశ్య చూసాక శైలజలో కూడ తెగింపు రావడం, పి.వి.బి. శ్రీరామమూర్తి కథ "స్ఫూర్తి" (8 జ 97).

తాగుబోతయిన భర్త తన వ్యసనానికి కుటుంబాన్ని మరిచి తన సుఖం కోస డబ్బు కోసం చివరకు భార్యను, పిల్లలను ఖాతరు చేయక బ్రతుకుతుంటే, ఆ తాగుబో మనిషిని కాదని బయట కొస్తుందా యిల్లాలు. ఎలాగైనా బ్రతకాలి, ఆకలితో చావ కన్నా, ఏ పని చేసైనా బ్రతకాలని కప్పగంతుల మల్లికార్జునరావు "ఈల" కథ (4 మే, 9 చెప్తుంది. బ్రతకటానికి, పిల్లల్ని బ్రతికించుకోటానికి, ఒళ్లమ్ముకోడానికి కూడా సిద్ధ తన శరీరం కోసం ఈల వేసే వాళ్ళ వైపు రెండడుగులు వేసి, మళ్ళీ విచక్షణ మేల్కొ శ్రమ వైపు, వెలుగు వైపు నడుస్తుందా యిల్లాలు.

ఆడవాళ్లు చదువుకొని, ఉద్యోగం చేస్తూ తమ కాళ్ళపై తాము నిలబడుతు రోజులివి. ఆర్థిక స్వాతంత్ర్యం కారణంగా నేడు సమాజంలో చాలామంది స్త్రీలు దాంప జీవనానికి, పురుషుడి అహంకారానికి తలవంచక స్వతంత్ర జీవనం గడప పరిపాటయింది. 'స్ఫూర్తి', 'ఈల' ఈ పై రెండు కథల్లో ఈ విషయం స్పష్టంగా ఉం ఈ రెండు కథలకు పూర్తిగా విరుద్ధంగా సాగిన మరో చక్కటి కథ కె. మురళీకృష్ణ గా (2 ఫిబ్రవరి, 97) "విలువలు". ఈ కథ గురించి వివరంగా చూద్దాం.

కథలు రచయితల మేధస్సులోంచి కాక అనుభవాల్లోంచి, జీవితంలోంచి రావా అలా వచ్చిన కథల్లో నిజాయితీ కనిపిస్తుంది. ఒక ఆవేశమైన ముగింపు, ఒక కృత్రిమమై ముగింపు ఉండవు.

'విలువలు' కథలో ముఖ్యమైన పాత్రలు నాలుగు ఒకరు రాజేశ్వరి, విశ్వం రెండవ వారు పర్లి జంట. మొదటి జంట స్నేహితులు. రెండవ జంట భార్యభర్త రాజేశ్వరి కృష్ణమూర్తి భార్య. ఆమె అత్త వల్ల, భర్త వల్ల, జీవితం పట్ల విసుగు, కోపం క ఇంట్లోంచి బయటకొస్తుంది సూట్‌కేస్ పట్టుకొని. "నేను నా వ్యక్తిత్వం కోసం, ఆత్మగౌరవ నిలుపుకోవడం కోసం, మనిషిలా బ్రతకడం కోసమే ఇల్లొదిలి బయటకు వచ్చాను అంటుంది కన్నీళ్లతో రాజేశ్వరి విశ్వంతో.

విశ్వం, రాజేశ్వరి - కృష్ణమూర్తి దంపతులకు స్నేహితుడు. రైల్వేలో ఉద్యోగ

అంతేగాని సమస్యల నుండి, మనుషుల నుండి తెగతెంపులు చేసుకొని పోవడం అర్థం లేని పని'' అని ఆ కథ చెప్తుంది.

'స్ఫూర్తి' కథలో ఒక అట్టడుగు స్త్రీ ప్రవర్తనను చూచి మధ్య తరగతి స్త్రీ తన భర్తను కుటుంబాన్ని త్యజించాలని నిర్ణయించుకొంటుంది. కాని ఒక అట్టడుగు వర్గం వాళ్ళ జీవితానికి, నైతిక విలువలకు, మధ్య తరగతి వాళ్ళ విలువలకు చాలా తేడా ఉంటుంది. 'విలువలు' కథలో రాజేశ్వరి ఒక రకంగా అట్టడుగు వర్గం స్త్రీ ప్రవర్తనతో ప్రభావితం అయి తన నిర్ణయాన్ని మార్చుకొని తిరిగి కుటుంబంలోకి వెళుతుంది.

చివరగా మరో మంచి కథ గురించి చెప్పుకోవాలి. అది కోరుకొండ సత్యానంద్ గారి "బెల్లం ఆవకాయ'' (23 నవంబర్, 97) కథ. ఇది ముగ్గురు స్నేహితుల కథ. సన్యాసిరావు, ఆనందరావు, సత్యమూర్తి ముగ్గురూ ఇందులో పాత్రలు. సత్యమూర్తి విశాఖ వెళ్లినపుడు తన చిన్ననాటి స్నేహితులు ఆనందరావును, సన్యాసిరావును కలవడం ఈ కథలోని ఇతివృత్తం. ఎదిగే జీవితంలో మారిన ఆర్థిక విలువల్లో మామూలు 'మనిషి'గా ఉన్న సన్యాసిరావు. అతడి భార్య, చిన్న డాబా ఇల్లు, పూలమొక్కలు, కొబ్బరిచెట్లు ఒక వైపు, ఇంకోవైపు బాగా ఎదిగిపోయిన ఆనందరావు, అతడి లంకంత ఇల్లు, దేశంలో ఎక్కడెక్కడో కొన్న ఖరీదయిన వస్తువులు ఆస్తులు ఎదిగి, మనసులు తరిగి కుదించుకుపోయిన సంస్కారం మధ్య సత్యమూర్తి కథ నడుస్తుంది. సహజమైన మనస్తత్వంతో సత్యమూర్తి విశాఖలో ఉన్న ఒక్క రోజు కూడా, నామమాత్రంగా సన్యాసిరావును కలిసి, ఆ దినమంతా వైభవంతో ఉన్న ఆనందరావు ఇంట్లోనే గడపాలని అనుకుంటాడు. కాని ఆనందరావు, అడిగితేగాని మంచి నీళ్ళివ్వని కుసంస్కారి. తన ఆస్తుల లావాదేవీల గురించి చెప్పడమే గాని, ఒక పూట ఉండి పట్టెడన్నం తినమనలేని లోభి. అదే రాత్రి తిరిగి సత్యమూర్తి సన్యాసిరావు ఇంటికి వస్తాడు. అప్పటికి రాత్రి పదకొండవుతుంది. అయినా ఆ మధ్య తరగతి దంపతులు సత్యమూర్తిని సాదరంగా ఆహ్వానిస్తారు.

ఇప్పటివరకు నీ కోసం చూసి రావేమో అని అన్నం గంజిలోకి తొరిపేసింది. ఇప్పుడేం లేదు. ఆ గంజన్నం తింటావా అని ఆప్యాయంగా అడుగుతాడు సన్యాసిరావు. ఆ రాత్రి అతడి భార్య సత్యమూర్తి స్నానానికి నీళ్ళు పెడుతుంది. సన్యాసిరావు మిత్రుడికి మరీ గంజన్నం పెడితే బాగుండదని అర్ధరాత్రి సినిమాహాలు దగ్గర దొరికే హోటల్ నుంచి, బెల్లం ఆవకాయ, పెరుగుతో ఆ రాత్రి మిత్రుడికి భోజనం పెడతాడు.

స్నేహం తెలిసిన స్నేహితుడు వాడి ప్రేమ బెల్లం, వాడి మనసు ఆవకాయ, వెరసి వాడే కమ్మని "బెల్లం ఆవకాయ'' అనుకుంటాడు సత్యమూర్తి.

ఈ కథ నేటి సమాజంలో మనుషుల నైజం, ఆర్థిక విలువలు, అడుగంటుతున్న ప్రేమ, ఆప్యాయతలను చూపుతూనే మరో వైపు వాటినే ఎంతో ఆప్యాయంగా పోషించుకుంటూ బ్రతుకుతున్న సన్యాసిరావులాంటి దంపతులను కూడ ఎత్తిచూపుతుందీ కథ.

ప్రేమ, ఆప్యాయత, మానవత్వం విలువలను, స్నేహానికి అద్దం పట్టిన ఈ 'బెల్లం ఆవకాయ' కథ నిజంగా చాలా మంచికథ.

కథ రచయిత మేధస్సులోంచి కాకుండా జీవితంలోంచి రావాలి. అప్పుడే మంచి కథలొస్తాయి. కోరుకొండ సత్యానంద్ గారి 'బెల్లం ఆవకాయ', కె. మురళీకృష్ణ గారి 'విలువలు' మనిషి జీవితంలోంచి వచ్చిన కథలు అని గమనించాలి.



# వార్త ఆదివారం

"వార్త" పత్రిక 1997లో మొత్తం 45 కథల్ని ప్రచురించింది. వాటిలో నాలుగు పునర్ముద్రితాలు, నాలుగు అనువాదాలునూ.

పునర్ముద్రితాలు జగమెరిగిన కథకులవి. జనం మెచ్చిన కథలవి. అనువాదాలు కూడా ప్రముఖులవే. అంచేత మిగతా కథల తీరుతెన్నులు పరిశీలిద్దాం.

• మొత్తం కథల్లో మొదటిగా పేర్కొనాల్సిన కథ పి. రామకృష్ణారెడ్డి గారి 'మనిషీ – పశువూ'. మనిషి మనిషిని ప్రేమించడం గగనమై పోతున్న రోజులివి. అలాంటిది మూగజీవాల్ని పసిపిల్లల్లా కుటుంబ సభ్యుల్లా చూసుకునే రైతన్నల కథ ఇది. రైతులకీ పశువులకీ మధ్య గల అవినాభావ సంబంధం జగద్విదితం. అయినా రాయలసీమలో మనుషులు నివసించే ఇండ్లలోనే పశువులుండటం గమనార్హమంటారు రచయిత.

"మనసులూ పసువులూ కల్సి వుండడమనేది మా అబ్బబ్బల తరాల నుంచి వుందిక్కడ. నావు జెప్పినట్టు పసుల్తో వుంటే రోగం లొచ్చేది నిజమైతే వాళ్ళెవరూ బతికి వుండగూడ్దు మల్లా"అంటాడు రామిరెడ్డి, ఆ పద్ధతి తప్పు అని చెప్పిన కొడుకు మిత్రుడితో. అక్కడి పల్లెవాసుల జేబుల్లో చేతిసంచుల్లో బాంబులు వేసుకు తిరుగుతారని విన్న ఆ పట్నం మిత్రుడు "పాలిచ్చే ఎనుముసస్తే అమ్మ సచ్చినట్టూ, ఎద్దు సస్తే నాయిన సచ్చినట్టూ వుంటాది మాకు" అని ఆయన చెప్పేసరికి విస్తుబోతాడు.

కడకి తన కొడుకూ అదే పాట పాడుతూ ఇంట్లో కొత్త దంపతులు సౌఖ్యం కోసం ఇంట్లో గదులు కట్టించాలనే సరికి మొదట ఖండించినా తర్వాత ఆలోచనలో పడతాడు.

ఇన్నాళ్ళు పశువుల్తో కలిసి వుండి మనుషుల్తో విడిగా వున్నట్టు అర్థమవుతుంది. కొత్త మార్పులు ఆహ్వానించడానికి సిద్ధమవుతాడాయన. రైతు జీవితంలో కొత్త కోణాన్ని స్పృశించిన అతి చక్కని కథ 'మనిషీ - పశువూ'!

స్త్రీ వాదరచయిత్రి ఓల్గా కలం నుంచి జాలువారిన కథ "పురిటి నొప్పులు" ఇద్దరాడపిల్లల తల్లి వందనకి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోవాలని వుంటుంది. కొడుకుని కనాలనీ వుంటుంది. కడకి కొడుకుపుట్టాల. కోటప్ప కొండకు ప్రభనుకట్టాల' అన్న భర్తే ఆపరేషన్‌కి పురిగొల్పగా తలొగ్గుతుంది. కాని తర్వాత అతగాడే కొడుకుని కనలేదని నిందిస్తూ మారు మనువుకి సిద్ధపడతాడు. ఊళ్ళోని మగాళ్ళంతా ఆమెనే తప్పుబడతారు. "మొగాళ్ళంతా కల్సి వూర్ని వల్లకాడు చేత్తే తల్లి కొడునివూరు చేసుకోవాల్సి వుంది తనను వంటి ఆడోళ్ళే - కూలి పోతున్న ఇల్లు బాగుచేసుకున్నట్టే బతుకూ బాగు చేసుకోవాల' అనుకుని 'పురిటినొప్పులు' పడుతుంది. కాని ఈ నొప్పులు పడి గుడ్డుకి జన్మనివ్వడానిక్కాదు' తన బతుక్కితనే పేణం పోసుకోవడానికి'.

'ఫైవ్ స్టార్' హాస్పటల్లో పొరబాటున కళ్ళు తిరగి పడితే స్పెషలిస్టులంతా జేరి రకరకాల పరీక్షలంటూ హడావిడిచేసి ఆఖర్లో పెద్ద బిల్లు చేతిలో పెడతారు. అది చూసే సరికి మళ్ళీ కళ్ళు తిరిగి పడక తప్పదు. కార్పోరేట్ ఆసుపత్రుల వ్యాపార దృక్పథాన్ని హాస్య ధోరణిలో అతి చక్కగా ఆవిష్కరించిన పుష్యమి గారి కథ 'ఎకేస్ హిస్టరీ ఆఫ్ మిసెస్ రావ్'.

వీరభద్రరావు పమ్మి రచించిన కథ 'మరో మనువు కథ'. శకుంతల చంద్రాన్ని పెళ్ళి చేసుకోగా అతడు గ్రామ రాజకీయాలకి బలవుతాడు. దాంతో ఆమెని పరమేశ్వర్రావు చేరదీస్తాడు. కానతడికి పక్షవాతం రావడంతో అతడి పిల్లలామెని దరిజేరనివ్వరు. ఆమె ఒంటరి పక్షిఅవుతుంది. రవి ఆత్మహత్య చేసుకోబోతుంటే రక్షించి ఆదరిస్తుంది. ప్రేమించిన అమ్మాయి తనని కాదని అమెరికా మొగుడి వెంట వెళ్ళిందని ఆ ప్రయత్నం చేస్తాడతడు. రవీ శకుంతలా దగ్గరై అల్లుకుపోతారు. ఎప్పటికీ ఇలా వుండాలంటూ పెళ్లి చేసుకుందామని ప్రతిపాదిస్తుందామె. నువ్వు పూర్వం రెండు సార్లు చేతులు మారావు. నీ జీవితంలో నేను మూడోవాణ్ణి. నేను నిన్ను పెళ్ళి చేసుకోవాలా? అని పగలబడి నవ్వుతాడు - మగబుద్ధిని బయట పెట్టిన కథ.

రాజకీయపు గాలి సోకి నిజాలు ఎలాంటి వార్తలుగా రూపుదిద్దుకుంటాయో చెప్పిన సింహప్రసాద్ కథ 'వార్త'. 'యమ్మెల్యే కొడుకు' నిర్లక్ష్యానికి గురైన ఓ అభాగ్య తండ్రి ఓ స్థానిక నాయకుడి దగ్గర వంద రూపాయలు చేబదులు తీసుకుంటాడు. దాన్ని ఫొటో

తీసి 'క్షుద్బాధకి తాళలేక బిచ్చమెత్తిన యమ్మెల్యే తండ్రి ' అని వార్త ప్రచురింపజేస్తాడు. అది చూసి చిందులేసి దేహీ అని ప్రతి వాడ్నీ అర్థించినందుకు తండ్రిని కూడా తిట్టి ఆ వార్తని ఖండించడానికి పత్రికా విలేఖర్ల సమావేశం ఏర్పాటు చేస్తాడు యమ్మెల్యే. కేవలం బాకీ తీరుస్తోంటే తీసుకున్నాను తప్ప అడుక్కోలేదని తండ్రి చేత చెప్పిస్తాడు. ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన విందులో తండ్రి చేత కొసరి కొసరి వడ్డించి మరీ బిర్యానీ తినిపిస్తాడు. ఆకలితో నకనకలాడుతున్న పేగుల్లో అది ఇమడలేక వాంతి చేసుకుని చనిపోతాడు. 'అభాండ వార్తకి వేదనతో కుమిలి కుమిలి ప్రాణాలొదిలిన అభాగ్య తండ్రి' అని వార్త వస్తుంది!

ఆస్పత్రి భవన ప్రారంభోత్సవానికి మంత్రిగారొస్తున్నారని యమ్మార్వో తన సిబ్బందిని నానాహైరానాపెట్టి మంత్రి గారికిష్టమైన వంటకాలని తయారు చేయిస్తాడు. అన్నీ సిద్ధమయ్యాక మంత్రిగారి ప్రోగ్రాం కేన్సిల్ అయ్యిందని తెలుస్తుంది. పై అధికారులకి వడ్డించేక మిగతాది సిబ్బంది ఆరగిస్తారు. అంతా బ్రేవ్ మని త్రేన్పబోతుంటే మంత్రి గారు మనస్సు మార్చుకుని వచ్చేస్తున్నట్టు తెలుస్తుంది. ఇక సిబ్బంది తిప్పల సంగతి దేవుడికే తెలియాలంటారు రచయిత. దొరతనమూ బానిసత్వమూ మరో రూపాన్ని సంతరించుకున్నాయని వ్యంగ్యంగా చెబుతారు చిలుకూరి దేవపుత్ర తన 'మంత్రివెడలె' కథలో.

వర్షాల్లేవు, పంటలు ఎండి పోతున్నాయి. రైతులు ఆత్మహత్య చేసుకుంటున్నారు. పరిస్థితి చక్కదిద్దాలంటే సమీపంలోని నది నీటిని మళ్ళించాలి. అందుగ్గాను తమ యమ్మెల్యే ద్వారా అసెంబ్లీలో చర్చకి పెట్టించాలనొస్తాడు సుబ్బరాజు. కాని సభలో అసలు విషయాలు తప్ప మిగతావన్నీ చర్చిస్తారు. ఇంతలో ఓ సభ్యుడు ప్రయోగించిన అభ్యంతరానికి సభ రణరంగంగా మారిపోతుంది. సుబ్బరాజు నిరాశగా వెనుదిరుగుతాడు. చట్టసభలో ప్రజా ప్రతినిధుల బాధ్యతారహిత ప్రవర్తనకి అద్దం పట్టిన వి.వి.ఎల్. సావిత్రి కథ 'ప్రజా ప్రతినిధులు'.

కె.వి. ఎస్. వర్మ కథ 'నీలాంటి ఒకరు'. ఒక ప్రక్క భార్య, మరో ప్రక్క భర్త. ఇద్దరూ ఎవరిదారిలో వారు ఆలోచిస్తారు. అతని ప్రవర్తన ఆమెకి నచ్చదు. ఆమె డబ్బివ్వననడం అతడికినచ్చదు. నేటి కాలానికి అనుగుణంగా ఆమె ఆలోచిస్తుంది. అతడు మరో కోణంలో ఆలోచిస్తాడు. ఒకే పడకపై ఇద్దరూ 'ఒంటరిగా' వుంటారు. గది ఒక్కసారే ఇరుకుఅయిపోతుంది ఇద్దరికీ. సైకాలజీ మీద వచ్చిన చక్కని కథ.

ఒమ్మి రమేష్ బాబు కథ ' పసిపాదాలు' భావన్నారాయణ స్కూలు టీచరు.

ఆయన చిన్ననాటి స్నేహితురాలి కూతురైన పద్మిని ఆయన శిష్యురాలు. పద్మిని ఆయన అభిమానాన్ని చూరగొనటమే గాక చిన్న నాటి వూసులు రేపి పాత మిత్రుల్ని కలుపుతుంది. వైవిధ్యంగల మంచి కథ.

'అమ్మ చెద పట్టి పోకూడదంటూ' అమ్మకోసం కలవరించే బ్రతుకులో వసంతం తొంగిచూడని ఓ అభాగ్యుడి కలల ఘోష. చైతన్య స్రవంతిలో అర్థంగా చెప్పిన గుడిపాటి కథ 'కలవిరిగిన చప్పుడు'.

విదేశీ ఛానళ్లు ఇంజెక్టు చేసిన విష సంస్కృతికి బలైన ఓ పడతి టీవీని పగలగొట్టి తన కసి తీర్చుకోవడం పులుగు శ్రీనివాస్ 'రాక్షసనీడ' కథలోని ఇతి వృత్తం.

ఆరేళ్ళ పండు చేత తండ్రి సహజమరణాన్ని అసహజంగా భావింపజేసిన సినిమాల టీవీ సీరియళ్ళ విష ప్రభావాన్ని సున్నితంగా ఎత్తి చూపిన చిన్న కథ 'పండు' రచన స్వప్నరాగవీణ.

షర్మిల కథ 'తలవాకిలి'. రాజకీయాలవల్ల అన్నదమ్ముల మధ్య విభేదాలొచ్చి ఒకరిమీదొకరు ద్వేషం పెంచుకుంటారు. కాని తోడికోడళ్ళిద్దరూ ఒక్కటే 'మన మగాళ్లు బుర్రలు పగలుకొట్టుకుంటే కొట్టుకోమను. మన ఆడంగులం మాత్రం కొంగు బిగిరాని తలవాకిలి నుంచే తిరుగుదాం. ఎవరేం చేస్తారో చూద్దాం ' అనుకుంటారు. స్త్రీ చైతన్యాన్ని సూక్ష్మంగా చిత్రించిన కథ.

కాలువ మల్లయ్య కథ 'మేధావుల తీర్పు' మల్లిఖార్జున్ ఓ కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థలో అధికారి. ఆఫీసర్ల సంఘ ఎన్నికల్లో పోటీ చేస్తాడు. నాయకుల్ని బ్రోకర్లగా మార్చొద్దంటాడు. కులం పేరుతో ఓట్లు అర్థించనంటాడు. ఇలా కొన్ని ప్రిన్సిపుల్స్ గల అతడందరికీ నచ్చుతాడు. కాని మేధావులంతా కలిసి అతడ్ని ఓటమిపాలు చేస్తాడు. కొందరైనా తన భావాలతో ఏకీభివించేటట్లు చేశాననుకుని మధ్యతరగతి మనిషితో తృప్తి పడతాడతడు.

ప్రొహిబిషన్ రోజుల్లో ఓ మిలటరీ ఉద్యోగి తన 'మందు' కోటాని అమ్మి అల్లుడికి కలర్ టీవీ కొనిస్తాడు. భేతాళ కథగా చెప్పిన సామాన్య కథ జీడిగుంట రామచంద్ర మూర్తిగారి 'అదిమాత్రం అడక్కండి'.

రిటైరైన వ్యక్తి తనకి అయిన వారంతా అశ్రద్ధ చేస్తున్నారని బాధపడి లేనిపోని అనుమానాల్తో అపార్థం చేసుకుంటాడు. అంతరాంతరాలలో దాగిన రెండో మనిషిని అపార్థాలకంచెలోకి దారి తీయకుండా జాగ్రత్తపడాలని హెచ్చరించే మంచి కథ 'రెండో మనిషి', రచన నిమ్మలపూడి రమేష్ కుమార్.

ఆడవాళ్ళని 'యూజ్ అండ్ త్రో' అనేసే రెడ్డిని ఓ మిత్రుడు చిన్న నాటకమాడి షాక్చగా పోలియో వాతపడిన లతకి అతడు ఊతకర్రగా మారిన వైనాన్ని 'ఊతకర్ర' కథలో చిత్రించారు డి.ఆర్. ఇంద్ర.

సీతని రామప్పకిడ్నాప్ చేసి మానభంగం చేస్తాడు. ఆమె భర్త చట్టాన్ని, సంఘనాయకుల్నీ, పత్రికల్నీ ఆశ్రయిస్తాడు. ఫలితం ఉండదు. రామప్ప ఆమెని బంధ విముక్తురాల్ని చెయ్యగా అతడ్ని చంపి చెరనుండి విముక్తిమవుతుందామె. ఇది ఆచార్య కొలకులూరి ఇనాక్ గారి 'విముక్తి' కథ.

ఆచార్య కొలకలూరి ఇనాక్ గారిదే మరో కథ 'డారీడెత్'. కట్నపు దాహంతో తనని చంపబోయిన అత్తా బావగార్ల మీదే కిరసనాయిలు పోసి అగ్గిపుల్ల గీచిన కోడలి కథ.

లక్షలు ఖర్చుపెట్టి వ్యసనపరుడైన భర్తకి వైద్యం చేయించే కంటె పిల్లలు భవిష్యత్తే ముఖ్యమని భావించి ప్రేమ చంపుకున్న ఓ ప్రాక్టికల్ తల్లి చేదునిజపు కథ - కె. మురళీ కృష్ణ గారి 'చేదునిజం'.

పదిమందికి కొంగుపరిచే ఈ బతుకు వద్దే వద్దంటూనే వృత్తిలో కూరుకుపోయి 'నేసచ్చేలోగా ఈ 'ఊళ్లో కొడుకులందరికీ నా జబ్బు లంటాల' అని కసితో రగిలిని కుమారి కథ 'నివురు' రచన సి. సుజాత.

ఊరి అందం మాటున దాగిన ఆకలి దారిద్ర్యం గురించి అతి చిన్న కథలో హృద్యంగా చెప్పిన షర్మిల కథ 'మూగవేణువు'.

నమ్మకం అనే గోడ బీటలు వారినపుడు నైతిక విలువలున్న ఏవ్యక్తి అయినా బాధపడక తప్పదనీ 'నన్ను యాదృచ్ఛికంగానైనా పాత్రను చేయొద్దని' దేవుడ్ని వేడుకోవడమే శరణ్యమంటారు ఎం.ఎస్. రెడ్డి. తన 'గుండె గొంతుక ఒక్కటే' కథలో.

పట్నపు ఇంటికి మెట్టిన పద్మావతికి తనభర్తకి అంతుకు ముందే పెళ్ళయ్యిందని తెలుస్తుంది. అతడామెని చంపబోగా కూతురితో సహా తప్పించుకుని పుట్టింటికి చేరుతుంది. పల్లెలోని స్నేహిడామెకి చేదోడుగా నిలుస్తానంటూ 'మిమ్మల్నీ అక్కున చేర్చుకునేందుకు ఈ పల్లె వుందిలే' అంటాడు. కె.వి. రామిరెడ్డి కథ 'గాలిపాట'లో.

ప్రపంచంలో చెడే కాదు మంచి కూడా వుందని పంకజం కంపెనీలోని ఆమెని చేరదీయడం ద్వారా తెలియజెబుతాడో జేబుదొంగ 'ఉత్తిష్ఠ' కథలో. రచన నడిమింటి జగ్గారావు.

స్నేహితులొచ్చేప్పటికి ఇల్లు నీటుగా లేదనీ భార్య నలిగిన చీరతో వుందని గొంతు

చించుకునే మగాడి మనస్తత్వాన్నీ, మనుషులు నీట్‌గా అప్డేట్‌గా వుండడమే కల్చర్ అనుకునే సుమిత్ర దృక్పథాన్ని వివరించిన జె. శ్యామల కథ 'సరళరేఖలు'.

అయ్యేయస్ ఐ.పి.యస్.లకి సెలక్టయిన ఇద్దరు యువకులు పల్లెలోని ఓ ఆదర్శ విద్యాలయంలోని జెండా వందనానికి హాజరై భావోద్వేగాలతో ఉక్కిరిబిక్కిరవుతూ చేసిన గానం 'జయజయజయహే' కథ. రచన కె.వి. రామిరెడ్డి.

మొత్తం మీద 'వార్త' ఆదివారం అనుబంధంలో ప్రచురింపబడిన కథలన్నీ చిన్నవీ వస్తువైవిధ్యాన్ని సంతరించుకున్నవీనూ. శిల్పనైపుణ్యం, లోతు, ఆర్ద్రత గల కథలు కదిలించే కథలు, ఆలోచింపజేసే కథలు అతి తక్కువగా వున్నాయని చెప్పక తప్పదు.

1998లో మరింత వస్తు వైవిధ్యమూ ప్రయోగాత్మకమూ ప్రయోజనాత్మకమూ కథకి పరిపుష్టి చేకూర్చ గల కథలు 'వార్త'లో వస్తాయని ఆశిద్దాం.



# విశాలాంధ్ర ఆదివారం

'భా' రత కమ్యూనిస్టు పార్టీ' అధికార పత్రికగా వెలువడుతున్న "విశాలాంధ్ర" దిన పత్రిక ప్రధానంగా ఒక రాజకీయ పత్రిక. పార్టీ, దాని ప్రజా సంఘాలు నిర్వహిస్తున్న కార్యక్రమాలను; పార్టీ జాతీయ, రాష్ట్రసమితుల నిర్ణయాలను నిర్వహిస్తున్న ప్రజాపోరాటాలనూ ప్రచురించడం పత్రిక లక్ష్యం. అయితే, కేవలం రాజకీయ కార్యక్రమాలకు మాత్రమే పరిమితం కాకుండె; గురువారం సాహిత్యానుబంధం, ఆదివారం అనుబంధం ద్వారా అభ్యుదయ సాహిత్య ప్రచారానికి కూడా తగిన ప్రాధాన్యత నివ్వడం ప్రశంసనీయం.

"విశాలాంధ్ర" దిన పత్రిక ఆదివారం అనుబంధం లో ప్రతివారం - "ఈ వారంకథ" శీర్షికన ఒక కొత్త కథ; "ఆణిముత్యాలు" శీర్షికన ఒక పాత కథ; "హాస్య-తోరణం" శీర్షికన ఒక అధిక్షేపకథ ప్రచురింపబడుతున్నాయి.

1997 జనవరి - డిసెంబర్ మధ్యకాలంలో సామాజిక స్పృహకల చక్కని కథలను "విశాలాంధ్ర" పత్రికకోసం రచించిన ప్రముఖ కథారచయితలు డా॥ పరుచూరి రాజారామ్, డా॥ చందుసుబ్బారావు, శ్రీ వల్లూరి శివప్రసాద్, డా॥ కాలువ మల్లయ్య, శ్రీ బి. వేణుగోపాలరావు, శ్రీ పి.ఎం.సుందరరావు తదితరులు. ఈ సంవత్సరకాలంలో తెలుగు నేలను కుదిపివేసిన అనేక సామాజిక, రాజకీయ పరిణామాలనూ; మనస్తత్వ అంశాలనూ, పత్తిరైతుల ఆత్మహత్యల వంటి సమకాలీన సమస్యలను ఈ కథలు ప్రతిబింబిస్తున్నాయి. తెలుగు సాహిత్యంలోని అనేక ప్రక్రియలు వ్యాపారమయమైపోయి, తమ చారిత్రక కర్తవ్యాలను విస్మరిస్తున్న నేటి పూర్వరంగంలో 'తెలుగు కథలు' ఇంకా ఆరోగ్యకరంగా,

బాధ్యతాయుతంగా పయనిస్తున్నాయనడానికి "విశాలాంధ్ర" లో అచ్చయిన కథలు లక్ష్యప్రాయంగా ఉన్నాయి.

ఒక "ఆణిముత్యాలు" శీర్షికన 'అరసం' నిర్వాహక కార్యదర్శి శ్రీ పెనుగొండ లక్ష్మీనారాయణ ఎంతో శ్రమకోర్చి ప్రముఖ రచయితల కథలను సేకరించి, ప్రతివారం అందించడం అభినందనీయం. ఆయా రచయిత జయంతి, లేదా వర్ధంతిని పురస్కరించుకుని, కనీసం నెలరోజుల ముందు నుండే కష్టపడి మంచి కథలను సేకరించి, సందర్భానుసారంగా 'విశాలాంధ్ర' ఆదివారం అనుబంధంలో ప్రచురిస్తున్నారు. కథతో పాటు, రచయిత క్లుప్తపరిచయం, కథ వైశిష్ట్యం పొందుపరచడం సముచితంగా ఉంది.

1997 సంవత్సరం ఆణిముత్యాల్లో కీ.శే. చాగంటి సోమయాజులు, కీ.శే. శారద, కీ.శే. వట్టికోట ఆళ్వార్ స్వామి, కీ.శే. తుమ్మల వెంకట్రామయ్య, రావి శాస్త్రి మొదలైన ఉత్తమ శ్రేణి కథారచయితల కథలు ప్రచురించారు. సాహిత్యాభిరుచి కల పాఠకులు భద్రంగా దాచుకోదగిన అత్యుత్తమ కథలను అందిస్తున్న ఈ శీర్షిక లోని కథలు నిజంగా ఆణిముత్యాలే.

'హాస్యతోరణం' శీర్షికన డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు అనేక అపురూపమైన అధిక్షేపకథలను అందించారు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, విద్యావిషయకమైన అంశాలను సునిశితమైన హాస్యం, సున్నితమైన వ్యంగ్యం, సూటిగా తగిలే అధిక్షేపం కలగలిపిన కథాకథనంతో, చక్కని నిర్మాణ శిల్పంతో ప్రకటించారు. కడుపుబ్బ నవ్వుకోడానికే కాక, కళ్ళు తెరవడానికి కూడా ఈ కథలు తోడ్పడతాయి.



## ఆంధ్రప్రభ వారపత్రిక

మారుతున్న విలువల్తో కాలానుగుణంగా కొన్ని మార్పులు వచ్చినా ఆంధ్రప్రభ కథల స్థాయి మాత్రం పడిపోలేదు.

సంవత్సరం మొత్తం మీద దగ్గర దగ్గర 150 కథలు వచ్చేయి. అన్నిటినీ చదవగలిగేనే కాని సమీక్షించడం కుదరదు.

ఈ కథలు ఒక యాభై ఏళ్ళ తరువాత చదివితే 'ఛీ! అప్పటి మనుషులు అంత కుళ్ళిపోయేరా' అని అసహ్యించుకుంటారు.

మనుష్యుల్లో తల్లి, పిల్ల సంబంధాలు పోయేయి. భార్య, భర్త అనుబంధాలు పోతున్నాయి. డబ్బే మనల్ని పాలిస్తోంది.

స్వార్థం మన ఊపిరి. మానవత మచ్చుకైనా లేదు. మానవతా విలువలు లేకుండా పోయేయి.

సీతమ్మ పల్లెటూర్లో అందరిచేత మంచి అనిపించుకుంటుంది. తనకున్న దాంట్లో తనింత తిని, ఇతరులకి ఇంత పెడుతుంది. ఆవిడ కొడుకు పట్నంలో ఉద్యోగం చేస్తున్నాడు. ఉన్న ఇల్లు, పొలాలు అమ్మేసి వచ్చి తన దగ్గర ఉండమంటాడు. తను అక్కడ ఉండగలదో, లేదో అన్న అనుమానంతో, వెళ్ళి కొన్ని రోజులు చూద్దామనుకుంటుంది. అక్కడ కోడలు మనస్తత్వం ఆవిడకి అర్థం కాదు. పనిమనిషి కడుపుతో ఉందని తెలిసిన సీతమ్మ ఒక పాతచీర, పచ్చడి యిస్తుంది. అలా ఇవ్వటం కోడలు కిష్టంలేదు. కోడలు మిగిలిన అన్నం, కూరలు ఫ్రిజ్‌లో పెట్టి మూడు రోజులు తింటుంది కాని ఎవరికీ ఇవ్వదు.

పాతబట్టలతో స్టీలు సామాను కొంటుంది. ఆవిడకి డబ్బే ప్రపంచం. ఆ ప్రపంచం సీతమ్మకి నచ్చదు. తిరుగు ప్రయాణం అవుతుంది. తోవలో ఒక చిన్నపిల్ల, ముసలమ్మ కనిపిస్తారు. ఆ పిల్లకి తల్లి, తండ్రి లేరు. మేనత్త ఆ పిల్లకి తిండిపెట్టదు. చాకిరి చేయించుకుంటుంది. ఆ బాధలు చూడలేని అమ్మమ్మ ఆ పిల్లతో ఊరికి బయలుదేరింది. ఆ కథ విన్న సీతమ్మ మనసు బోధపడుతుంది.

రెక్కలొచ్చి ఎగిరిపోయిన పిల్లల కోసం చింతిస్తూ కూర్చునేకన్నా ఇలాంటి నిస్సహాయుల్ని చేరదీసి ఆదరిస్తే రెట్టింపు ప్రేమనివ్వరూ అనుకుంటుంది. వాళ్ళని తనతో తీసుకు వెళుతుంది.

కన్నపిల్లలో కేవలం స్వార్థం వల్ల తల్లిని పోగొట్టుకుంటున్నారు. ఇదే జాస్తి రమాదేవి రాసిన 'హృదయానికి కనులుంటే' (20-10-97) కథాంశం.

అయితే పిల్లలందరూ అలా ఉండరనీ, అక్కడక్కడ కూతుళ్ళు మంచి వాళ్ళుంటారనీ చెప్పే కథ కలువకొలను సదానంద రాసిన 'మారుతున్న దృశ్యాలు' (2-4-97).

కొడుకులిద్దరు, కోడళ్ళు, మనవలు వస్తున్నారని తెలిసిన కమలమ్మ, భర్త పొంగిపోతారు. కమలమ్మ కొడుకులకి ఇష్టమైన వంటలన్నీ చేసి వాళ్ళ కోసం ఎదురు చూస్తూ కూర్చుంటుంది. పొద్దున్న వస్తానన్న వాళ్ళు సాయంత్రం వచ్చేరు. అదైనా కొడుకులు మాత్రమే. చదువుపోతుందని మనవలు రాలేదు, కోడళ్ళు వచ్చేరు కాని ఈ పాతకాలం ఇంటిలో సదుపాయలుండవని హోటల్లో దిగేరు. కమలమ్మ, భర్త అవాక్కైపోయేరు. అయినా ఏం మాట్లాడరు. ఆ ఇల్లు అమ్మేసి తల్లి, తండ్రి వచ్చి ఇద్దరి కొడుకుల దగ్గర చెరొకరు ఉండాలి. ఇదీ కొడుకుల ఆలోచన. కాని అప్పటికే కొడుకుల సంగతి అర్థం అయిన కమలమ్మ, భర్త ఒప్పుకోరు. వాళ్ళు కోపమొచ్చి వెళ్లిపోతారు. వెళ్లే ముందు వీధి తలుపుల మీద తమ పేర్లు రాస్తారు.

ఆ మర్నాడు కూతురు, అల్లుడు వస్తారు. అమ్మ, నాన్నకి కొత్తబట్టలు పెట్టింది కూతురు. అంతేకాదు తనకి ఉద్యోగం వచ్చింది. తను ఈ స్థితికి రావడానిక్కారణం అమ్మ, నాన్న శ్రమే. అంచేత తను వాళ్ళ రుణం తీర్చుకుంటుంది. అంచేత ప్రతి నెల కొంత డబ్బు పంపిస్తుంది. అదీ కూతురి అభిప్రాయం. కమలమ్మ, భర్త ఎంతో సంతోషిస్తారు. యింకా కొందరు మంచితనం గా ఉన్నారు అన్న నమ్మకం కలుగుతుంది.

దాదాపు కొంచెం తేడాతో ఇదే అంశం చెప్పేరు కె. మురళీకృష్ణ "బంగారు బంధాలు" కథలో (7-5-97)

రామ్మూర్తి తండ్రి ఎన్నో కష్టాలు పడి ముగ్గురు కొడుకుల్ని చదివిస్తాడు. పెద్ద

కొడుకులిద్దరు పెళ్ళిళ్లు అయ్యేక ఇంట్లో డబ్బు యివ్వడం మానేస్తారు. తండ్రి పెన్షను మీదే ఇల్లు గడవాలి. కూతురికి పెళ్ళికి పెద్ద కొడుకులిద్దర్ని డబ్బు సాయం చెయ్యమంటాడు. డబ్బు అందలేదని యివ్వరు సరికదా కోడళ్ళిద్దరు ఒంట్లో బాగులేదని పుట్టింటికి వెళ్ళిపోతారు. అప్పుడా తండ్రి చేసేది లేక ఇల్లు తాకట్టుపెట్టి పెళ్లి చేస్తాడు. కొడుకులకి కోపం వచ్చి తండ్రిని తిడతారు. తండ్రికి పక్షవాతం వస్తుంది.

తల్లిదండ్రులు తమ రేపుని తమ సంతానంలో చూసుకుంటారు. కాని ఆ రేపు ఇలా ఉంటుందని వాళ్ళు ఊహించలేదు. ఇన్నేళ్ళు వాళ్ల పడ్డ శ్రమ ఎవరికో! ఈ ప్రపంచంలో మానవ సంబంధాలే నిజమైనవి. డబ్బు, అంతస్తులు తాత్కాలికాలు. మనిషిని మనిషిగా నిలిపేవి బంధాలే అనుకున్న రామ్మూర్తి తన రీసెర్చ్ మానుకుని, ఉద్యోగం చేసి తండ్రి, చెల్లెలు బాధ్యత తీసుకుందామనుకుంటాడు. ముగ్గురు కొడుకుల్లో ఒక్కడైనా మంచివాడున్నాడు. ఒక్కడే కొడుకుంటే! ఏమో!

ఒకప్పుడు తల్లిదండ్రుల్ని చూసి పిల్లల్లో మర్యాద, దానగుణం, ఆదరం, అభిమానం అన్నీ నేర్చుకునేవారు. ఇప్పుడు పరిస్థితులు మారేయి. మనుషుల మనస్తత్వాలు మారేయి. పిల్లల్లో గడుసుతనం, స్వార్థం ఉన్నప్పుడు పెద్దవాళ్ళు మంచితనం పట్టుకొని వేళ్ళాడ్డంలో అర్థం లేదు. వాళ్ళూ స్వార్థం నేర్చుకోవాలి అంటారు కె. రామలక్ష్మిగారు "స్వార్థంలోనూ అర్థం ఉంది' అన్న కథలో (21-7-97).

పురుషోత్తమరావుగారు రిటైరై కొడుకు దగ్గరే ఉంటున్నారు. రిటైరయ్యేక వచ్చిన డబ్బు బేంకులో వేసేరు. ఆ ఇల్లు ఆయనదే. అయితే ఆ డబ్బుతో డాబామీద గదులు వేసి అద్దెకిస్తే డబ్బు వస్తుందంటాడు కొడుకు. పురుషోత్తమరావు గారు ఒప్పుకోరు. కావలిస్తే నువ్వ లోన్ తీసుకుని కట్టుకోమంటాడు. అతని స్నేహితుడు నాగభూషణం ఎప్పటికైనా యిచ్చేదే కదా అని కొడుకులకి డబ్బు యిచ్చేస్తారు. వాళ్ళు అతనికి మందు కూడా కొనరు. పురుషోత్తమరావు గారు ఆలోచించి ఒక నిర్ణయం తీసుకుంటాడు. తన ఇల్లు బేంకుకి అద్దెకిచ్చేసేననీ, కొడుకుని వేరే ఇల్లు తీసుకోమనీ, తను, నాగభూషణం హోమ్‌కి వెళ్లిపోతున్నామనీ చెప్తాడు.

ఇది స్వార్థం కాదు. అవసరం. ఈనాటి పెద్దలు నేర్చుకోవాలసిన పాఠం. తల్లిదండ్రుల మీద పెట్టే ప్రతి రూపాయి వేస్ట్ అనుకునే తరం ఇది. అంచేత తల్లిదండ్రులూ, పిల్లలున్నారు జాగ్రత్త! ఇదే పరిస్థితి పులికంటి కృష్ణారెడ్డి రాసిన 'చలువ రాతి సమాధి' (30-6-97) కథలో ఒక పెద్దాయనకే వచ్చింది. అతను ఉన్నదంతా ఊడ్చి కొడుకులకి పెట్టేస్తాడు. చివరి దశలో కొడుకు కట్టిస్తున్న బంగళాకి వాచ్‌మన్‌గా ఉంటాడు. అక్కడే పని

చేస్తున్న తాపీ మేస్త్రి ఈశ్వరయ్యకి తండ్రి లేడు. అతను ఆ పెద్దాయన్ని తండ్రిలా చూసుకుంటాడు. అప్పుడప్పుడు డబ్బు యిస్తాడు. తనతో పాటే హోటలుకి తీసికెళ్ళి తిండి పెట్టిస్తాడు. ఆ పెద్దాయన బతికుండగా గ్లాసుడు మంచినీళ్ళు కూడా ఇవ్వని కొడుకులు అతను చచ్చిపోతే కర్మ గొప్పగా జరుపుతారు. తండ్రి చేసిన అప్పు ఈశ్వరయ్యకి తీరుస్తామంటారు. ఈశ్వరయ్య ఒప్పుకోడు. పోనీ ఆ డబ్బుతో సమాధి కట్టమంటారు.

"పెద్దాయనకు గుండెల్లో గుడి కట్టుకున్నాను. ఆ పెద్దాయన గుండెల మీద బరువు పెట్టమంటావా?" అని ఏడుస్తాడు.

"దేవుడు మనిషిని సృష్టిస్తాడు తన ఛాయగా. అంటే దేవుడే మనిషి" అంటారు రచయిత.

పూర్వకాలంలో ప్రయాణీకులకి సత్రాలుండేవి. పూటకూళ్ళ ఇళ్ళు ఉండేవి. ఊళ్ళో ఉండే కలవారు ఆతిథ్యం యిచ్చేవారు. రూపాయి ఖర్చు లేకుండా కన్యాకుమారి నుండి కాశీ వరకు నడిచి వెళ్ళిపోయేవారు. "అన్నం పరబ్రహ్మ స్వరూపం" అని అప్పటివారి నమ్మకం. అన్నం అమ్ముకోవటం మహాపాపం అనుకునేవారు. మరి ఇప్పుడో? ప్రతి ఊర్లోను స్టార్ హోటళ్ళు వెలుస్తున్నాయి. అక్కడ తిండి మాత్రవేఁ కాకుండా మధిర, మగువతో సహా అన్నీ దొరుకుతాయి. ఇదే మనం నేర్చుకున్న కల్చర్. నవభారత్ విలాస్‌లో అన్ని గదుల్లోను అందరు చేసేది ఒకటే. తాగటం, ఆడదాన్ని రప్పించుకోవడం. అక్కడ పనిచేసే రంగ అందరికీ సప్లయి చేస్తూ ఉంటాడు. ఆవేళ అందరూ బుక్ అయిపోయేరు. ముగ్గురు దున్నపోతుల్లాంటి వాళ్ళు అర్జంటుగా అమ్మాయిని తెమ్మంటారు. అక్కడ వరాలమ్మ బేరం లేక దిగులుగా ఉంటుంది. ఆవేళ పిల్లలు పస్తే అనుకుంటుంది. బేరం చూడమని రంగని బతిమాలుతుంది. వరహాలు ఒంట్లో తూస్తే కిలో మాంసం లేదు. అంచేత దున్నపోతుల దగ్గరకి వరహాల్ని పంపడం ఇష్టం లేదు రంగకి. కాని ఆమె వెళ్తుంది ఆకలికి తట్టుకోలేక, తెల్లారేసరికి చచ్చిపోతుంది. డి. వెంకట్రామయ్య రాసిన 'మనుషుల్ని తినేవాళ్ళు' (23-6-97) ఈ కథారంభం డికెన్స్ రాసిన టేల్ ఆఫ్ టూ సిటీస్ జ్ఞాపకం తెస్తుంది. ఈ కథ చదివితే మనం యింకా మృగం దశ దాటలేదని అర్థమౌతుంది. ఆడది కేవలం పిల్లల్ని బ్రతికించుకోవడానికి శరీరాన్ని అమ్ముకుంటుంది. అయితే డబ్బిచ్చి కొనేవాళ్ళు కొందరుంటే, బలవంతంగా వశపరుచుకునే వారు కొందరుంటారని ఓల్గా రాసిన కథ 'మొదటి చావు' (4-4-97) చెప్తుంది. అంతేకాదు చావు అనేది మనిషికి ఒకసారే అయినా ఆడది అస్తమానూ ఛస్తూనే ఉంటుందని చెప్తుంది కథ.

ఇందిర తల్లి నాలుగిళ్ళలో పాచిపని చేసి బతుకుతుంది. తండ్రి రిక్షా తొక్కుతాడు.

ఒకనాడు అతని రిక్షాని లారీ గుద్దేసి చచ్చిపోతాడు. తల్లి ఆస్పత్రిలో తండ్రి దగ్గరున్నప్పుడు ఇందిర ఒక్కర్తె ఇంట్లో ఉంటుంది. అప్పుడు ఎదురింటి రాజయ్య వచ్చి ఆ పిల్లని పాడుచేస్తాడు. ఏం చేస్తున్నాడో కూడా అర్థం కాని వయస్సు, భయపడి తల్లితో చెప్పదు. తరవాత నెలతప్పిందని తెలిసిన తల్లి మరో ఊరు తీసికెళ్ళి ఇందిరకి అబార్షను చేయిస్తుంది. నేను బతికున్నానా? అనడిగిన ఇందిరతో తల్లి 'ఎన్నిసార్లు బత్కాలె. ఎన్నిసార్లు సావాలె. ఆడదాన్కి ఒక్కసావు కాదమ్మా. ఆడది శానా సావుల్తో సస్తది' అంటుంది. కథంతా తెలంగాణా యాసలో రాసినా బాగానే అర్థమౌతుంది. ఇదీ ఆనాటి సాంఘిక పరిస్థితి.



# ఆంధ్రభూమి వారపత్రిక

ఆంధ్రభూమి వారపత్రికలో ఈ సంవత్సరం '132' మామూలు కథలూ, వారానికి రెండు మూడూ చొప్పున సింగిల్ పేజీ కథలూ వెలువడ్డాయి.

కథలన్నిట్లోనూ వైవిధ్యం కొట్టవచ్చినట్లుగా కనిపించింది.

యిన్నాళ్ళూ ఈ పత్రికపై పాఠకులేర్పరచుకున్న ఓ రకం అభిప్రాయం కొంతవరకు తొలిగిపోయిందనే చెప్పాల్సి వుంటుంది.

అయితే ఈ సంవత్సరం కొత్త రచయితలకి బాగా ప్రోత్సాహం లభించినట్లుగా ఉంది. కాని కథావస్తువులు ఎంత బావున్నా వారు కథ చెప్పే విధానం మాత్రం అంత గొప్పగా లేదు. వాక్యాల పొందికలోనూ, కథనం అల్లికలోనూ, సంఘటనల్ని పేర్చటంలోనూ, వారింకా ఎంతో కృషి చేయాల్సి వుంది.

అలాగే పాత తరం రచయితలు ఎంతగొప్పవారైనా వారిపుడు వ్రాసిన కథలంత చెప్పుకోదగ్గవిగా లేవని నిర్మొహమాటంగా చెప్పక తప్పదు. కాని చాలాకాలం తర్వాత ఈ పత్రికలో వారి పేర్లు కనిపించటం మాత్రం ఆనందదాయకంగా వుంది.

కొత్తవారిని ప్రోత్సహించేందుకు ప్రవేశపెట్టిన 'సింగిల్‌పేజీ' కథల శీర్షిక మాత్రం పాఠకుల్ని బాగా ఆకర్షించి వుంటుందనటంలో సందేహం ఏ మాత్రమూ లేదు. ఈ పేజీ కథలన్నీ కూడా 'కొసమెరుపు' టెక్నిక్‌ని ఉపయోగించి వ్రాయబడటంతో చాలా బాగా పేలాయి.

ఈ సంవత్సరంలో పెద్ద ఎత్తున నిర్వహించబడిన కథల పోటీలో చాలా కథలు

బహుమతుల్ని గెలుచుకున్నాయి. వాటిలో మానవసంబంధాల కథలు బాగా ఆదరణని పొందాయి. పాతనీరూ కొత్తనీరూ కలిసినట్లుగా ఆతరం ఈతరం కథకుల కథలన్నీ కలిసి ఓ పెద్ద కథాసాగరాన్ని పాఠకుల కందించాయి.

ఈ సంవత్సరం పాతతరం రచయితలు సమర్పించిన కథల్లో 'జీవీయస్' ని ముఖ్యులుగా పేర్కోవచ్చు. 'సుశీల కథలు' అన్న శీర్షికతో సీరియల్‌గా వెలువడిన ఆణిముత్యాల్లాంటి కథల్నందించిన ఆయనెంతో అభినందనీయుడు.

సుశీల కథల్లో మరుపురాని పదప్రయోగాలు, వాక్యాలూ పాఠకుల మనస్సుల్లో పదిలంగా వుండిపోతాయి. ఆ మాటల మూటలు పాఠకులపై చెరగని ముద్రని వేసే వుంటాయి...

"అక్షరం లక్ష మెదళ్ళని కదిలిస్తుంది....."

"మాట కోటి మనసుల్ని మేల్కొలుపుతుంది...."

"నినాదం అగ్నిని రగిలింపజేస్తుంది....."

పై వాక్యాల్ని పలికింది 'జీవియస్' కాకున్నా వాటిని ఆయన తమ కథల్లో వాడుకున్న విధానం మనల్ని బాగా ఆలోచింపచేసేలా వుంది.

ఈ సంవత్సరం ఆంధ్రభూమి పాఠకుల్ని అలరించిన మరో బలమైన కథామాలిక 'పాపం పసివాళ్ళు!' డాక్టర్ వేదగిరి రాంబాబు అనాధశిశువుల దయనీయ యదార్థ స్థితిని కథా వస్తువుగా తీసుకుని మలిచిన ఎన్నో కథలు ధారావాహికంగా వెలువడ్డాయి. ఇవి యదార్థగాథలైనా కథలుగా చెప్పబడ్డాయి.

తమలోని రచనాశక్తిని యింకా కుంటుపడలేదనీ, మరింత పటిష్టమైందనీ ఓ పటిష్టమైన కథ 'దాస్యం' ని అందించారు శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు.

అంచెలవారీగా లంచగొండితనం పాకుతూ అన్ని దిశల్నీ ఆవహిస్తోందని వాపోయారీ మహామనీషి 'దాస్యం' కథలో. పోలీసు వ్యవస్థని దుమ్మెత్తిపోయటానికి సాహసించకుండా మెత్తగా మందలించిన విధానం మనకి కనిపిస్తుంది.

ఈ తరం ఆడవాళ్ళు తమ మొగుళ్ళు వీధిలో కెళ్ళగానే మరో ఆడదాన్ని కొంగు కోసం చొంగకారుస్తారనీ, తమని నిర్లక్ష్యం చేస్తున్నారనీ ఓ భ్రమతో రంగుటద్దాల్లో నుంచి చూడటం అలవాటు చేసుకుంటున్నారని ధైర్యంగా చెప్పగలిగిన వ్యక్తి మధువని. ఈ రచయిత్రి (తా?) 'వసంతయామిని' అన్న తమ కథలో పై సమస్యకి మంచి పరిష్కారాన్ని సూచించగలిగినందుకు స్త్రీ పాఠకులంతా ఆమెని అభినందించాల్సి వుంటుంది.

పురుషాహంకారం ఓ సాంఘిక దురాచారం అని మనం అంగీకరించక తప్పదు. అలాగే సహధర్మచారిణిగా భార్యకి చేయాల్సి పనుల్ని దాటవేయటం కూడా దురాచారమే అవుతుంది. ఆచరణలో ఈ రెండు కర్తవ్యాలూ ఏ విధంగా పోటీపడ్డాయో తెలుసుకోవాలనుకుంటే కొత్త రచయిత శ్రీ గోవింద రాజారావు వ్రాసిన 'అర్దేచా' అన్న కథని చదవాలి.

ఇద్దరు భార్యాభర్తలు ఒకే ఆఫీసులో... పైగా ఒకే సెక్షనులో పనిచేస్తుంటారు. తను 'భర్త' అన్న అహంతో అటు ఇంట్లోనూ... ఇటు ఆఫీసులోనూ తన పనుల్ని ఆమెకి అప్పగించేసి తను కుషీగా కాలాన్ని గడిపేస్తుంటాడతను.

పాపం ఆ భార్య నిజంగా మంచిమనిషి! తను భార్యనన్న భావంతో ఇంట్లో అతని అవసరాల్ని గమనిస్తూ ఉంటుంది. ఇక్కడ ఆఫీసులో ఆయనకు చెడ్డపేరు రాకూడదన్న భయంతో అతని పనంతా తన నెత్తినే వేసుకుంటుంది.

ఈ విషయాన్ని గమనిస్తాడు ఆ కంపెనీ యజమాని! భార్యలోని నిజాయితీని గమనించి ఆమెను 'మేనేజరు' గా ప్రమోట్ చేసి ప్రక్క సెక్షనులోకి మార్చేస్తాడతను.

దాంతో భర్తకి తిక్క కుదురుతుంది. తను చూస్తుండగానే భార్య ఉన్నత పదవిలోకి వెళ్ళిపోయింది. పైగా ఇపుడు తన పనిని తానే చేసుకోవాల్సి వచ్చింది. మరిపుడా భర్త పరిస్థితి ఎలా వుంటుందంటారు?

రామాయణం కథని చాలా మంది చాలా విధాలుగా వ్రాశారు. అవన్నీ అవాల్మీకాలే! కాని ఆ అవాల్మీక గాథలన్నీ కూడా శ్రీరామునిపైన భక్తి చేతనే వ్రాయబడ్డాయని డా. దాశరథి రంగాచార్య గారంటారు.

అలాంటి కొత్త తరహా రామాయణ గాథని అందునా పౌరాణిక గాథని చాలాకాలం తర్వాత ఆంధ్రభూమి ధైర్యంగా ప్రచురించింది.

ఈ రామాయణ కథ పేరు 'సీతాపహరణం!'

ఈ కథలో రామాయణ, భాగవత గాధలు సంధించబడ్డాయి.

భాగవతంలో శ్రీ మహావిష్ణువును సందర్శించేందుకు వచ్చిన సనకసనందాదులనబడే మహర్షుల తాపాగ్నికి గురయిన జయవిజయులనే ద్వారపాలకుల కథని ఎరుగనివారుండరు.

"మూడు జన్మల్లో యిలా రాక్షసులం అవుతాం కాని ఏడు జన్మలకాలం మీకు దూరంగా వుండలేం స్వామీ!" అన్నారు జయవిజయులు. "తథాస్తు!" అన్నాడు శ్రీ మహావిష్ణువు.

ఆ రకంగా హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల కథ ముగిసింది. అదే విధంగా శిశుపాల దంతవక్త్రుల కథ కూడా అయిపోయింది.

అది భాగవతంలో....

కాని ఇపుడు రామాయణంలో... వాళ్లిద్దరూ రావణ కుంభకర్ణులై పుట్టారు.

శ్రీరాముడే తమకు శాపవిమోచనం కలిగిస్తాడని ఆ ఇద్దరికీ తెలుసు.

కాని కాసేపు ఆ భాగవతాన్ని ప్రక్కన పెట్టేస్తే రామరావణుల మధ్యనున్న శతృత్వమెలాంటిదో రామాయణం చెప్పేస్తుంది. కాదంటారా?

అందుకే శ్రీరాముల వారు తీరిగ్గా వనవాసం చేస్తూ వుంటం రావణ, కుంభకర్ణుల రూపాల్లో వున్న జయవిజయులకు ఎంతకీ నచ్చలేదు. తమ శాప విమోచనా సమయంలో ఆలస్యం అవటం వారు సహించలేకపోయారు. తమ స్వామికి ఇంకా దూరంగా వుండటం వారు భరించలేకపోయారు.

దాంతో భద్రాచలం సమీపంలో నిద్రిస్తూన్న శ్రీరామచంద్రుడి దగ్గరకు వచ్చి ఆయన పాదాలపై పడి తమకు త్వరగా శాపవిమోచనాన్ని కలిగించమని కోరుకున్నారు.

ప్రయోగాత్మకంగా యస్వీచారి వ్రాసిన కథ 'సీతాపహరణం'

బానిసత్వం వంశపారంపర్యంగా క్రింది తరాలకు జారుతూ నేటి వ్యవస్థకి అస్థిరత్వాన్ని కొనితెస్తోందని 'మానవత్వం మరిచినవేళ' కథ వివరిస్తుంది. శ్రీమతి వేముగంటి శుక్తిమతి వ్రాసిన ఈ కథకి మొదటి బహుమతీ, పదివేల రూపాయల నగదునీ అందజేసింది ఆంధ్రభూమి వారపత్రిక.

తండ్రి బానిస బ్రతుకుని తనక్కూడా అంటకట్టటంతో ఆ జీవితంతో తండ్రి ఎంతగా కుమిలిపోయాడో తెలుసుకుంటాడు కొడుకు. దాంతో అతను యజమానిని ఏ రకంగా ఎదురించగలిగింది చక్కగా తెలుపుతుందీ కథ. కాని ఆ సమస్యకి పరిష్కారాన్ని మాత్రం ఈ కథ అందించలేకపోయింది.

తాగుబోతు భర్తల చాటులో భార్యలకి భద్రత వుండదనేది పచ్చినిజం! సానుభూతి పేరిట వారికి చేరువవటానికి కొందరు ప్రయత్నిస్తూ వుండటం కూడా వాస్తవంగా భావించాల్సి ఉంటుంది. కాని సంస్కారం ఆ భార్యల్ని కాపాడుకుంటూ వుంటుంది. కాని అదే అండ లేని ఆడది అవుతేనో?.... తనను కోరుకుంటున్న వ్యక్తి పెళ్ళాడటానికి సిద్ధపడి వస్తేనే ఆమె జీవితం తిరిగి 'రహదారి' లో ప్రయాణిస్తుంది. లేకపోతేనో?....

పెళ్ళయిన పదేళ్ళకే నూరేళ్ళ నరకాన్ని అనుభవించింది ఆ అభాగ్యురాలు! చచ్చిపడి వున్నాడు భర్త!! ఆ శవం వంక ప్రక్కనే కూచుని భయంగా చూస్తోందామె.

త్రాగి నిద్దట్లోనే ప్రాణాల్ని పోగొట్టుకున్న భర్త లేచి తనని ఎక్కడ కొడతాడో అన్న అనుమానం ఆమెనింకా ఆవహించే వుంది.

"అమ్మా! నాన్న చచ్చిపోయాడా? నిజంగా చచ్చిపోయాడంటావా?" కొడుకు కంఠంలో కూడా అనుమానం ధ్వనిస్తూనే వుంటుంది. కాని ఆ పసివాడి కంఠంలో ఏదో రిలీఫ్!... ఏవిటది?

ఇపుడా అండలేని ఆడదాన్ని చేరదీయటానికి ఎవరన్నా వస్తే ఆమె ఏం చేయాలి. అదే శ్రీమతి జాస్తి రమాదేవి వ్రాసిన 'రహదారి' కథ.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థని ఆధారం చేసుకుని అల్లిన ఓ మంచికథ మిథునం! రచయిత శ్రీరమణ, నాలుగు వారాలు సీరియల్‌గా వచ్చిన ఈ కథలో తెలుగుతనం తొణికిసలాడింది. ఈ కథలో కొత్తదనం ఏమీ లేకపోయినా పాతదనం కమ్మనిరుచిని మనకు అందిస్తుంది. కథనం చాలా బాగా సాగింది.

ఆవిడకు ఎపుడూ ఏదోకొనటం అలవాటు! అదో సరదా! పెద్ద 'షో ఆఫ్' మనిషి! పనికట్టుకుని అయిదు రూపాయలు ఖరీదు చేసే వస్తువుని కొనేందుకు రానూ పోనూ యాభై రూపాయలు ఆటో కోసం ఖర్చు చేస్తుంది. రేపు కొనాలనుకున్న వస్తువు కోసం ఈ రోజు బజారుకెళ్లి సర్వే చేసి వస్తుంది.

తనుచేసే పని ప్రతివారికీ గొప్పగా తెలియాలని తాపత్రయపడుతుంది. ఆమె గొప్పింటి స్త్రీ కాదు. పదహారణాల మధ్యతరగతి ఆడపడుచు. అపుడా భర్త బ్రతుకు ఎలా వుంటుంది? ఈనాటి స్త్రీల చవకబారు 'భారీతనం' జీవితాలకి అద్దం పట్టారు శ్రీమతి శారదా అశోకవర్ధన్ తమ కథ "కళ్ళు అబద్ధం చెప్తాయి' లో.

'అబార్షన్' అన్నపదం ఎంతటి భయంకరమైనదో వేరే చెప్పక్కరలేదు. ఈ ప్రక్రియ స్త్రీకి ఎప్పుడూ వరం కాదు. కేవలం కొన్ని సమయాల్లో పాపప్రక్షాళనకు మాత్రమే పనికి వస్తుంది. కాని ఈ 'అబార్షన్' అన్న చర్య వల్ల 'అమ్మ' అనే పదం అంతరించిపోతుంది. అది స్త్రీకి శాపం!

మాతృత్వపు విలువల్ని అబార్షన్‌ల ద్వారా కోల్పోతున్న స్త్రీమూర్తులను హెచ్చరించేలా 'అమ్మ' అనే కథ వ్రాయబడింది. 'నందచైతన్య' అనే ఈ కొత్త రచయితని మనం అభినందించాల్సి వుంటుంది.

మారుతున్న కాలంతోబాటుగా ఈ దేశం మారటం లేదనే బాధతో తల్లడిల్లిపోతున్నారు శ్రీ ఇమంది రామారావు.

"నిన్ను చూస్తే నాకు జాలేస్తోందయ్యా! సమాజం! దేశం!... అనే ఈ పదాలు

మాటల్లోనూ, అక్షరాల్లోనూ చాలా అందంగా కనిపిస్తాయి. కాని వాస్తవంలో అవి నీటిపై వ్రాసిన వ్రాతలు... ఎండమావుల్లా కనిపించే నిజాలు!"

"ఈ సమాజం ఓ నిమ్మచెట్టు! ఎంత నీరుపోసినా మడుగు కనిపించదు. దేశం కూడా అంతే! నీవేం చేసినా కనిపించదు!

అలాగే మన జీవితాలు కూడా నిశ్చింతగా గడిచిపోతున్నాయి. నాడు బ్రిటిష్ వారి కాలంలోనూ.... నేడు మన ప్రజాప్రభుత్వకాలంలోనూ... మనకేమీ వొరిగింది లేదు. మనవి నిమ్మచెట్టు లాంటి బ్రతుకులు. ఏం చేసినా ఎదగని మార్పు లేని జీవితాలు!" అంటూ 'సారా హుషార్' కథలో సారాత్రాగని వాళ్ళని హెచ్చరించాడీ రచయిత.

పొద్దున్నే శుభమా! అంటూ బయలుదేరాడతను. కాని ఎదురింట్లోంచి విధవరాలు ఎదురొచ్చింది. అది మంచి శకునం కాదంటూ రోజంతా ఆమెని తిట్టుకుంటూనే వున్నాడతను. కాని ఆ రోజు అతనికే హాని కలుగలేదు. పైగా అనుకున్న దానికంటే సులభంగా పనులు జరిగిపోయాయి. దాంతో సంతోషంతో ఇంటికి తిరిగొచ్చాడతను.

ఎదురింట్లో గుంపు కనిపించింది. అతనలా చూస్తుండగానే తనకి పొద్దున్నే ఎదురయిన విధవరాలి శవం కాటికి కదిలివెళ్ళింది.

"తెల్లారకముందే గుడికెడదామని బయలుదేరింది పుణ్యాత్మురాలు! మళ్ళీ ప్రాణాలతో తిరిగిరాలేదు. లారీ గుద్దేసింది. అంత పొద్దున్నే ఏ వెధవ మొహం ఆమెకి ఎదురయిందో? ప్చ్!" అన్నారెవరో.

శ్రీ బద్దిగం పాండురంగారెడ్డి వ్రాసిన సింగిల్ పేజీ కథ 'గుర్తొచ్చింది' చదివితే ఎవరికైనా 'బుద్దొస్తుంది'.

కాలక్షేపం కోసం చేసే పనులు ఎన్నో వుంటాయి. కాని వాటిని వొదిలేసి టెలిఫోన్ డైరెక్టరీలో కనిపించిన నంబరుకల్లా ఫోన్ చేస్తేనో? .... ఏం జరుగుతుందో శ్రీ మల్లాది వెంకటకృష్ణమూర్తి 'రాంగ్‌నంబర్' కథ చెప్తుంది.

పెద్దలకు మాత్రమే కథల్ని పూర్తిగా కొట్టివేయడానికి లేదని దోనేపూడి ప్రేమ్‌దులారి 'నగ్నసత్యం' లాంటి కథలు చెప్తాయి. ఈ శీర్షికలో వచ్చేవన్నీ మలిన శృంగార కథలే కాదు. జీవితంలోని నగ్నసత్యాల్ని చెప్పే కథలు వస్తున్నాయి. అదే విషయం ఈ కథ చెబుతుంది. ఘోస్టు రచయితలే కాదు ఘోస్ట్ అవయవ ప్రదర్శకులూ వున్నారని చెప్పడంతో పాటు మగాడిని ఈ కథలో చక్కగా చెప్పారు.

నాటు వైద్యం ఎంతటి హానికరమో మనకు తెలీనిది కాదు. కాని ఆ ఫేక్ డాక్టర్ల

ప్రాక్టీసుని రద్దు చేయకుండా లంచాలు లాక్కుని కళ్ళు మూసుకునే అధికార్ల నిర్లక్ష్య ధోరణి ఎలాంటి పరిస్థితులకు దారితీస్తుందో శ్రీనందం రామారావు వ్రాసిన 'ఎవరికి వారే ఈ లోకం' కథ చక్కగా తెలియజేస్తుది.

కథలన్నీ చదివాక కొత్త రచయితలు బాగా తొందరపడి పోతున్నారన్న బావన కలుగక మానదు. కొద్దిగా శ్రమని తీసుకుని కథని అల్లటం బాగా ప్రాక్టీసు చేస్తే వీరి నుంచి చాల మంచి కథలు వస్తాయన్న ఆశాభావం మాత్రం కలిగింది.

కాని కొత్తవారు ఓ విషయాన్ని గుర్తుంచుకోవాలి! ఆనాడు కాశీ మజిలీ కథల ధోరణిలోలా కేవలం ఓ నాలుగు పేజీల కథల్లో పాత్రల మొత్తం జీవితాల్ని వర్ణించకూడదు. చెప్పదలుచుకున్న విషయాన్ని ముక్తసరిగా మాటల పొందికతో అల్లేస్తే చాలు! ఎక్కువ ఇన్సిడెంట్లు... పెద్ద పెద్ద డైలాగులు నిండిన కథల్ని ఈ కాలంలోని పాఠకులు అంత సులభంగా ఆదరించలేరన్న విషయాన్ని ఈనాటి రచయితలంతా గమనించటం ఎంతో అవసరం!



# ఆంధ్రజ్యోతి వారపత్రిక

ఆంధ్రజ్యోతి వారపత్రికలు సంవత్సరకాలంలో 52 రావలసి ఉండగా, ఈ సమీక్ష చెయ్యడానికి కొద్ది సంచికలు మాత్రం లభించాయి. ఒక్కొక్క సంచిక ప్రకారం సమీక్షించే వీలు లేదు. కనుక, ఈ కొద్ది సంచికలూ చదవగానే వాటిలోని కథల గురించి కలిగిన సాధారణ అభిప్రాయాలు పేర్కొనడం జరిగింది.

చదువుకున్న సగటు తెలుగువాడి జీవితంలో వేగం పెరిగింది. ప్రపంచం చిన్నదై, దగ్గరకొచ్చేస్తున్నది. దీనికి ఎలక్ట్రాన్ మీడియా ప్రభావం చాలా ఉంది. ఆ ప్రభావం సాహిత్యం మీద ఉంది. టెక్నాలజీ ప్రభావం పెరిగింది.

వీటన్నింటి ఫలితం 'చదువరితనం' పైన ఉన్నదనిపిస్తున్నది (దీనికి సంబంధించి స్టాటిస్టిక్స్ తీసి, శాస్త్రీయ పరిశీలన చేస్తే గాని కచ్చితంగా చెప్పడం కష్టం). కేవలం కాల్పనిక సాహిత్యమేకాక, దైనందిన జీవితంలో వివిధ విషయాలకీ (ఆరోగ్యం, వైద్యం, సౌందర్య పోషణ మొ.) వివిధ దేశాలలోని సమాచారం తెలుసుకోవడానికి పాఠకులు ఇష్టపడుతున్నారు. అందువల్ల వాటికి సంబంధించిన వ్యాసాలు, ప్రశ్నోత్తరాల వంటివి కాల్పనిక సాహిత్యంతో పోటీగా ప్రచురితమవుతున్నాయి.)

దీర్ఘమైన రచనలు చదవడం తగ్గింది. అందుకే కథానిక పరిమాణంలోనూ, ఇంకా చిన్నవిగానూ ఉన్న రచనలకి ఆదరం పెరిగింది. కథానికకు ప్రాచుర్యం పెరిగింది. కథానిక కూడా ఆధునికావసరాలకు తగ్గట్లు మినీ కథగా, కార్డు, కవరు కథగా ఇంకా చిన్నదిగా పరిణామం పొందింది. పెద్దకథలూ తగ్గిపోయాయి.

సీరియల్ నవలలు కథానిక పరిమాణంలోనే వారం వారం ప్రచురితమవుతున్నాయి. అంతేకాక, పాఠకులపై పట్టు ఉండటానికి అవి (సీరియల్స్) థ్రిల్లర్‌లో, ప్రణయ సంబంధాలో అయి, ప్రతి వారం సస్పెన్సులో పెడుతున్నవే ప్రాచుర్యం పొందుతున్నాయి. అట్లా అయితేనే అవి మనగలుగుతున్నాయి. అందువల్ల సీరియల్స్‌లో చూసినంతవరకూ పాఠకులను ఆకర్షించే గుణం తప్ప. సాహిత్యపరంగా ఆలోచింపజేసే, అనుభూతి కలుగజేసే గుణం కనబడలేదు.

కథానికలలో పరిస్థితి మెరుగ్గా ఉంది. మొత్తం మీద చూస్తే, లభించిన సంచికలు కొన్నయినా మంచి కథలు ఉన్నాయి. అంతేకాక, కథానికలు సీరియల్ నవలల్లా కేవలం పాఠకుల ఆకర్షణ పొందడం కోసం రాసినవి కాక, ఆలోచింపజేసే విషయాలు వస్తువులుగా గ్రహించినవి ఎక్కువ ఉన్నాయి. కథానిక విషయంలో ఇదొక ఆరోగ్యకరమైన లక్షణం (సీరియల్స్‌మీద).

లభించిన కొద్ది సంచికల ప్రకారం ఆంధ్రజ్యోతి వారపత్రికలో కథలు 3 రకాలుగా కనబడ్డాయి. మొదటిరకం ఆధునికరూపంలో కథానికలు. రెండోరకం చిట్టి (మినీ) కథలు, మూడోరకం పెద్దకథలు. పైన పేర్కొన్న కారణాల వల్ల పెద్దకథల సంఖ్య చాలా తక్కువ. ఈ కొద్ది సంచికల్లో 2 మాత్రం ఉన్నాయి. ఆంధ్రజ్యోతివారు చిట్టి కథలను ఇన్‌లాండ్ కవరు కథలనే పేరుతో (పైన చెప్పిన రెండో రకానివి) ప్రయోగం చేసి, కొత్త కథకులకు ఆహ్వానం పంపారు. ఇవికాక మినీ కథల పేరుతో కూడా చిట్టికథలు ప్రచురించారు.

బహుశా కథానికలలో కొత్త పోకడలుండి, ఆలోచన కలగజేసే కథలకు ప్రాధాన్యం ఇవ్వడం కోసం కాబోలు 'గురజాడ వీధి' అనే శీర్షికన ఒక్కో సంచికలో ఒక్కో కథ ప్రచురించారు. అయితే, సమీక్షకు లభ్యమైన సంచికలలో, ఈ శీర్షిక కింద ప్రచురితమైన కథలలో తక్కిన కథల కంటే విశిష్టంగా చెప్పుకోదగినవి ఎక్కువ సంఖ్యలో లేవు.

ఒకేసారి లభించిన కొద్ది సంచికలలో కథలు చదవగా వాటిలో పేర్కొనదగినట్లున్నవి ఇవి.

'న్యాయం కోసం' పి.వి.బి. శ్రీరామమూర్తి గారి కథానిక. ఒక విషయంలో జరిగిన అన్యాయాన్ని ఎదిరించడానికి న్యాయశాస్త్ర విద్యార్థులందరూ న్యాయపోరాటం సలపదలచి, నాయకత్వంపై విభేదించి, కొట్లాడుకొని, ఎన్నికలు జరిపి అన్యాయంగా, ఒక విద్యార్థి ఎన్నికలలో గెలవటం కథాంశం. కథనం బాగుంది. కథాంశం ఆలోచింపజేసేది. (8-8-97 సంచిక)

విజయ్‌కుమార్‌రెడ్డి తుమ్మా రచించిన 'జాణవులే' చిన్న కథ. ఒక యువతి తాను స్త్రీ కావడాన్ని, అంటే తన స్త్రీత్వాన్ని ఆయుధంగా ఉపయోగించుకొని, అబలగా అసహాయగా నటించి, పురుషపుంగవుల జాలిగుణాన్ని రెచ్చగొట్టి, పరిస్థితిని తనకనుకూలంగా మలుచుకోవడం, అట్లా మలచుకోగలగినందుకు లోలోన సంతోషించడం కథాంశం. కథ, కథనం బాగున్నాయి. (8-8-97)

'డిఫరెన్స్' అనే మినీ కథ ఒక చిన్న సంఘటనతో సగటు మనిషి మనస్తత్వాన్ని చిత్రిస్తుంది. (8-8-97)

మంత్రవాది మహేశ్వర్‌గారు రచించిన 'చెరవీడిన హృదయాలు' కథానిక ప్రారంభం సినిమాల్లోని ఇద్దరబ్బాయిలు ఒకమ్మాయిని ప్రేమించడం కథాంశం అయినా, ముగింపు వాస్తవికంగా ఆచరణయోగ్యంగా ఉంది.

తనకూ, తన కుటుంబానికీ కాక, స్నేహానికీ స్నేహితుడికీ మనోవాక్కాయకర్మలా మొదటి స్థానం ఇచ్చే స్నేహితుడి కథ 'హోమం'. కథనం బాగుంది. రచయిత ఎస్.పి. చారి (5-9-97)

సింహప్రసాద్‌గారు రచించిన 'నరుడి బ్రతుకు నటన' కథ పుత్రుడి నిరాదరణకు గురయి, ఏజ్‌డ్ హోంలో చేరి కూడా, తామంటే తమ కొడుకుకి ప్రేమేనని తోటి వారి ముందు నటించే ముసలి తల్లిదండ్రుల దయనీయమైన కథ (19-9-97).

ఈ సంచికలో (19-9-97) అనన్యగారు రచించిన 'కొత్త జీవితం' మంచి కథ. సగటుమనిషి రోజువారీ జీవితం వర్ణిస్తూ, జీవిత పరమార్థం ఏమిటో సరళంగా, పఠనీయంగా, సూటిగా చెప్పే మంచికథ. కథనం బాగుంది.

యల్లంరాజు నిర్మల అనువదించిన 'మోడు' కథ దారిద్ర్యంతో నిత్యయుద్ధం చేస్తూ ఓడిపోయాననుకొని, జీవితం చాలించాలనుకునే ఒక ఉద్యోగి కథ. చివరి నిమిషంలో, తానున్న దుర్భర పరిస్థితులలోనే బతకాలని నిశ్చయించుకోవడం కథాంశం. కథ, కథనం కూడా బాగున్నాయి. కథలో ఆశావాద దృక్పథం మంచి అంశం.

మల్లాది వెంకట కృష్ణమూర్తి గారి 'డచ్‌పార్టీ' వార్తా పత్రికలో రిపోర్టు లాగుందే గాని, ఒక పెద్ద రచయిత కథలా గనిపించదు. దానికి కారణం మల్లాది వారి ప్రతిభా వ్యుత్పత్తుల లోపం కాదు; కథ చదివిన తరువాత ఒక జీవిత సత్యంకాని, కథలో ఒక ప్రయోజనం కాని కనబడకపోవడమే. అది కేవలం రిపోర్టే.

చిలకూరి దేవపుత్ర గారి 'ఔషధం' మంచి కథ. మనం కృత్రిమంగా ఏర్పరచుకున్న కులాలు అసమానమైనవైనా అందరిలోనూ ఉండేది ఒకే రక్తం అనేది దీనిలో కథాంశం.

ఈ అంశంపై గతంలో ఎన్నో రచనలు వచ్చినా కథనం సరళంగా, సూటిగా, పఠనీయంగా, ఆకర్షణీయంగా ఉంది.

వారాల ఆనంద్ రచించిన 'జిమ్నాస్ట్' నేటి యువతరం అవసరాలు తీర్చలేని, వారి ప్రతిభను వెలికి తెచ్చుకునే వీలు కల్పించలేని ఈ వ్యవస్థ, దానిలో యువతరం అసంతృప్తి వివరించే ఒక మంచికథ.

కె.కె. రఘునందన గారి 'దేవతలు' బతకడానికి సవ్యమైన మార్గం ఏదీ దొరకక, దొరికినా, స్వార్థపరులు దానికి అడ్డం తగలడం వల్ల, మనుషుల్లో బలహీనతలను రెచ్చగొట్టే శృంగార తారల పటాలు రోడ్లమీద గీసి, సంపాదించుకోవడం ప్రారంభించిన ఒక యువకుడి కథ.

చంద్రశేఖర్ అజాద్ గారి 'గౌరమ్మ' కథ ఆసక్తికరమైనది. తనను మాయమాటలతో తన యజమాని లోబరుచుకొన్నాడు. అని తెలిసిన శ్రామిక స్త్రీ, అతని చేత, అతని మందు పార్టీ స్నేహితుల చేత ఎంగిలి విస్తరాకులలో మిగిలిపోయిన స్వీటుముక్కల్ని మాయమాటలతో నేర్పుగా తినిపించి, తన కక్ష తీర్చుకోవడం ఈ కథలో కథాంశం. కథనం బాగుంది.

కోరుకొండ సత్యానంద్‌గారి 'తనవాళ్ళు' కథ మనుషుల మధ్య సంబంధాలూ బాంధవ్యాలూ, వాటి కలకాలం పోషించుకోవాలంటే వాటి పట్ల ఉండవలసిన అవగాహన తెలియజేసే ఒక మంచి కథ.

బి.ఎస్. రాములు గారి రచన 'తెల్లబట్ట' పెద్ద కథ. సాంఘిక పరిస్థితులు బలీయమైనవనీ, సగటు మనిషి జీవితాన్ని తీర్చడంలో ముఖ్యపాత్ర వహిస్తాయనీ, ఆ సగటు మనిషి అనుభవంలో ఎదిగాక, తాను కోల్పోయిన జీవితాన్ని అదే మనుషుల మధ్య అదే సమాజంలో తిరిగి తన కృషితో గెల్చుకోవాలనీ, అదే విప్లవమూ జీవితమూనని చెప్పే ముగ్గురు బాల్యస్నేహితుల కథ ఇది. కథనం బాగుంది. కథ ద్వారా చెప్పిన జీవిత దృక్పథం ఆలోచింపజేస్తుంది.

'మంచికి మరోపేరు' గా చెలామణీ అవుతూనే స్వార్థచింతన కోసమే, దాన్ని అనుసరించే తమకు అనుకూలంగా పనులు జరుపుకొనే ఉద్యోగుల గురించిన కథ. పి.వి. మురళీకృష్ణ గారి కథ. ఉద్యోగుల మనస్తత్వ చిత్రణ సమర్థవంతంగా జరిగిన కథ.

కాలువ మల్లయ్య గారి 'దాహం' విషయగతంగానూ, రూపగతంగానూ మంచి కథ. కొత్త టెక్నాలజీ తో పరిస్థితులు మారిపోతుండటం వల్ల గ్రామాల్లో గతంలో చిన్న చిన్న వ్యాపారాలతో పొట్ట గడుపుకునే 'రాజన్నల' కులానికి చెందిన వ్యక్తి పొట్టగడవదు.

అందువల్ల అతను తిరిగి అడుక్కోవడానికి ఈ వ్యవస్థ కారణమవడం, అల్లా అడుక్కొని కూడా బ్రతకనివ్వని ఈ వ్యవస్థలో అతని జీవితాన్ని పాఠకుడి మనసు మీద ముద్రపడేటట్టు చిత్రించిన బలమైన కథ. కథనంలో రాజన్నల వారి బ్రతుకు తీరు వర్ణనలో స్వాభావికత, మాండలిక ప్రయోగంతో కూడిన శైలీ కథకు మరింత బలం చేకూర్చాయి.

'బామ్మగారి సామెతలు' రూపంలో పెద్ద కథానిక. వెర్రివెంగళాయి కథల లాగా, ఒక బామ్మగారింట్లో ఒక చిన్న పనిపిల్లవాడి అమాయక చేష్టల జాబితాయే కథంతా. అయితే, ఈ కథ చదువుతుంటే రచనలో ఉద్దేశమైన నవ్వు రాదు సరిగదా, చదువుకొంటూ స్కూల్లో ఆడుతూ పాడుతూ గడపవలసిన బాల్యంలో ఈ పిల్లవాడు పడుతున్న అవస్థ జాలిగొలుపుతుంది. ఇటువంటి పిల్లల్ని మనచుట్టూ సమాజంలో ఇదే పరిస్థితుల్లో చూస్తూనే ఉన్నా కాని, ఈ పరిస్థితికి వ్యవస్థలోని లోపాలు గుర్తు వస్తాయి.

రిటైర్‌మెంటు జీవితంలో ఒక కోణాన్ని చిత్రించే కథ 'నేను చేసింది న్యాయమేనా' అనేది. వార్ధక్యజీవిత సమస్యల చిత్రణకు ఇటీవల ప్రాముఖ్యం పెరిగింది.

ఒక మరాఠీ కథ అనువాదం 'బంగారుసంకెళ్ళు'. ఉద్యోగిని అయి, ఉద్యోగంలో ఉన్నతి సాధించాలని కృషి చేస్తున్న ఒక స్త్రీకి, అనుకోకుండా వచ్చిన గర్భం అడ్డంకి కావడం, మొదట అబార్షన్ ద్వారా ఆ అడ్డంకిని దాటాలనుకొని కూడా, ఆమె అంతరంగం అంగీకరించకపోవడంతో, మళ్ళీ మాతృమూర్తి కావడానికే సిద్ధపడటం కథాంశం. ఇది ఆలోచన రేపే కథ. వ్యక్తిగతంగానే కాక, సామాజికంగా కూడా ఆలోచించవలసిన విషయం.

అర్చనా చౌహాన్ కథానిక 'ఫస్ట్‌టైమ్' ఒక మంచి కథ. ప్రతి కష్టమైన పనికీ ఫస్ట్‌టైమ్ అంటూ ఉంటుంది. అలవాటు లేక భయపడి పిరికివాళ్ళలా రంగాన్ని వదిలి పారిపోకూడదనీ, ధైర్యంతో ఎదుర్కొంటే సాధించలేనిది లేదనీ ఆకర్షణీయంగా, పఠనీయంగా చెప్పే కథ. (11-7-97)

'విధివంచిత' కథ తండ్రి బాధ్యతారహితంగా వదిలి వెళ్ళిపోయిన కుటుంబాన్ని ఆదుకొంటూ, తల్లి కోసం డబ్బు సంపాదించాలని వ్యభిచరించబోయి, విధివశాత్తు తండ్రే విటుడుగా రావడం, అది భరించలేక యువతి ఆత్మహత్య చేసుకోవడం కథాంశం. ఏ తల్లికోసం డబ్బు సంపాదించాలని వ్యభిచారానికి పూనుకొందో, ఆ తల్లి కోసం కూడా ఆత్మహత్య విరమించుకోలేకపోవడమే ఆశర్యంగొలుపుతుంది. కథ షాక్ ట్రీట్‌మెంటు కోసం రాసినట్లుగా ఉంది. కథలో కథనంలో పరిపక్వత లేదు.

'బ్లాషర్ట్' అనే గుజరాతీ కథను నలిమెల భాస్కర్ అనువదించారు. స్త్రీమూర్తి

మనసులో ఒక విచిత్రమైన అరుదైన కోణాన్నీ మానసిక సంఘర్షణనూ చిత్రించే కథ ఇది. ఆలోచింపజేసే ఆసక్తికరమైన కథ; కథనం కథాంశానికి తగినట్లుగా ఉంది.

దోనేపూడి ప్రేమ్‌దులారి గారి 'తస్మాత్ జాగ్రత్త' కథ రోజువారీ జీవితంలో సాధారణ పరిస్థితులలోనే నమ్మించి ద్రోహం ఎంత నేర్పుగా చేస్తారో చిత్రిస్తుంది. కథనం, శిల్పం ఆసక్తికరంగా, పఠనీయంగా ఉన్నాయి.

కొండముది శ్రీరామచంద్రమూర్తి గారి 'నగరంలో నారి' ఆకర్షణీయంగా కనబడే బ్రతుకు వెనకగల దుస్సహ సత్యాలూ, వాటి పోలికతో సామాన్య జీవితాలుగా పైకి అనిపించే వాటిలో నిండుదనం చిత్రించే కథ.

అమాయక బాలికలపై అత్యాచారం జరిపిన సంఘటనలను వర్ణించి, అటువంటి దుర్మార్గులకి శిక్ష ఏమిటో తెలిపే కథ 'చిన్నీ'. వీధి బాలుర అంతరంగ చిత్రణం 'అమ్మ' మినీ కథ.

సలీంగారు రచించిన 'తుఫాను' డబ్బు అవసరాలు మనిషి చేత ఎంత అనూహ్యమైన పనులు చేయించగలవో, ఆ పరిస్థితులలో కూడా ఆ మనుషుల మధ్య నిజమైన అనుబంధం ఏమిటో చిత్రించే కథ. కథనం బాగుంది.

తల్లావఝుల పతంజలి శాస్త్రి రచన 'రైలు' కథ. రూపగతంగా, వస్తుగతంగా మంచి కథ. రైలు ప్రయాణంలో కలుసుకున్న సామాన్యమైన మనుషులు ఒకరి కష్టసుఖాలు మరొకరితో కలబోసుకుని ఒకరి మంచిచెడులు మరొకరు తెలుసుకుని ధైర్యం చెప్పుకోవడం, మనుషుల మధ్య స్నేహసంబంధాలూ, సౌహార్దం ప్రతిభావంతంగా చిత్రించిన కథ ఇది. కథాంశానికి తగిన భాషాశైలి కథను మరింత బాగా మలచింది.

భూపాల్‌గారి 'రేపటివార్త' నిజామాబాద్‌లోని నక్సలైట్ ఏరియాలో పర్యటనానుభవం వర్ణనలా ఉంది. కథానికలా లేదు.

సంగంబండ జగన్నాథరెడ్డి గారి 'బలిపశువు' కథ ఇంకా మారుమూల పల్లెప్రాంతాలలో ఉన్న బలులు, బసివినుల ఆచారాన్ని కళ్ళకు కట్టినట్లు సమర్థవంతంగా చిత్రించిన ఒక మంచి కథ.

'ఆకుపచ్చని సంతకం' హాయిగా చదివించే ఒక అందమైన ప్రేమకథ. అంతకు మించిన ప్రయోజనం కథలో లేదు.

పమ్మి వీరభద్రరావు గారి 'ప్రదక్షిణం' అవసరం మనిషి చేత ఎటువంటి పనులు చేయిస్తుందనే అంశం మీద రచించిన ఒక నిరుద్యోగి కథ. కథ, కథనం బాగున్నాయి.

కేవలం స్వార్థచింతన మనుషులలో విలువలను ఎలా మాయం చేస్తుందో, ఎ
దిగజారుస్తుందో వర్ణించే కథ కాకాని కమల గారి 'పరిస్థితులు'.

పల్లేటి బాలాజీ గారి 'ఋణం' పెద్ద కథ. విదేశాలకు మేధావుల వలస దేశానికి హా
చేస్తోంది. మేధావుల నివాసం పట్టణాలలో కావడం వల్ల పల్లెలు నిర్లక్ష్యమైనాయి. ప
ప్రజలకి జీవితం అంటే ఏమిటో తెలిపి, పల్లెటూరిని మార్చాలనే ఉద్దేశంతో పట్నా
అవకాశం ఉండి కూడా పల్లెలోనే కృషి చేసి సమాజరుణం తీర్చుకొన్న ఒక వ్యక్తి కథ
కథనంలో కొంత నాటకీయత, అపరిపక్వత వల్ల ఇంత మంచి కథావస్తువూ ఒక్కోచో
కృత్రిమంగా అనిపించింది.

ఇన్లాండ్ కవరు కథలూ, మినీ కథలు శీర్షికల కింద ప్రచురించిన కథలలో సాధారణంగా రోజువారీ జీవితంలో మనం చూసే ఒకచిన్న సంఘటనో ఒక చిత్తవృత్తి ఆవిష్కరణో జరిగింది. ఇన్‌లాండ్ కవరు కథలు కొత్త రచయితలు, రచయిత్రులను ప్రోత్సహిస్తూ ప్రవేశపెట్టినవని పత్రికలో ఒక చోట పేర్కొన్నారు. ఆ దృష్ట్యా చూస్తే ఈ కథలకు వచ్చిన స్పందన, కథలూ గుణాత్మకంగా బాగున్నవే ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని చెప్పవచ్చు. కొన్ని కథలకి కొసమెరుపు ముఖ్యమైతే, కొన్ని కథలు కేవల చిత్రణలుగా ఉన్నాయి. కొన్ని చమత్కారం ప్రధానమైనవైతే, కొన్ని కథనం ప్రధానంగా ఉన్నాయి. ఎక్కడో కొన్నిటిలో తప్ప చాలా వాటిలో (లభ్యమైనంత వరకు) భాషా శైలి బాగుంది. కొత్త రచయితలు ఆధునిక ప్రమాణ భాషాశైలిని చక్కగా రచనలో ఉపయోగించ గలిగారు. కొన్ని కథల రచయితలు, రచయిత్రులు కథనంలో సాధన చేస్తే ముందు ముందు మంచి కథలు రాయగలరనే స్థాయిలో ఉన్నారు. లభ్యమైన వాటిలో రచనకు కొత్తకాని రచయిత్రి రాసిన ఇన్‌లాండ్ కవరు కథ 'పాపం కండక్టర్'లో కథనమూ, కొసమెరుపూ బాగున్నాయి. 'పట్టుచీర' కథలో భాషాశైలి బాగుంది. 'కల', 'నిరుద్యోగి' కథల్లో కథనం బాగుంది. 'ఐమాయ్ అన్‌ఫిట్ ఫర్ లవ్' కథ పరిస్థితులను తనకనుకూలంగా తిప్పుకునే సమర్థత లేని ఒక సగటు మనిషి మనస్తత్వ చిత్రణ 'బాధ్యత' కథ రిటైరైన సగటు మనిషి జీవితంలో తన పరిధిలో సమస్యల పరిష్కరణను చక్కగా చిత్రించేది. 'స్వామీజీ' కథనమూ, కథంశమూ బాగుండి, మంచి కొసమెరుపున్న మంచి కథ. మూఢనమ్మకాల కన్న, స్వశక్తిపై ఆధారపడటం సమర్థుల లక్షణం అని చెప్పే కథ 'గుణపాఠం'. అచ్చుకాని రచనలతో నిస్పృహ చెందిన ఒక రచయిత మనఃస్థితి వర్ణన 'అనుభవ శకలాలు'. సెలక్షన్ మంచి కొసమెరుపు గల కథ. 'ఆశల స్వప్నం' ఒక చిత్తవృత్తి వర్ణన.

ప్రత్యేక సంచిక :

మామూలు వారపత్రిక సంచికలలో పాఠకులకి కాలక్షేపపఠనం అందించడమే పత్రిక ప్రధానం లక్ష్యంగా కనబడుతుంది. సాహిత్య విలువల గురించి గాని, సిద్ధాంతాల ప్రతిపాదనకి గాని, సిద్ధాంతం కోసం నిబద్ధతకి గాని ప్రాధాన్యం లేదు. ఎప్పుడైనా ఎక్కడైనా చెదరు మదురుగా రచయితలు, రచయిత్రులు అట్లా రాసిన కథలు లేకపోలేదు గాని, పత్రికకి మాత్రం కాలక్షేపం కలిగించడమే ప్రధానం.

అయితే ఈశ్వరనామ సంవత్సర ఆంధ్రజ్యోతి వారపత్రిక ప్రత్యేక సంచికలో తెలుగు కథానిక బహుముఖ విలక్షణతనూ, విశిష్టతనూ చూపాలన్న ప్రయత్నం కనబడుతుంది. ఈ సంచికలో కథాప్రక్రియలోని చాలా రకాలు, అంటే అనువాద కథ, హాస్య కథ, పెద్ద కథ, ప్రయోగాత్మకమైన పౌరాణిక కథ, చిన్న కథ ప్రచురితమయ్యాయి. ప్రక్రియాపరంగానే కాక, గుణాత్మకంగా ఎక్కువ మంచికథలున్నాయి. ప్రముఖ కథానికా రచయితలు, రచయిత్రులు రాసినవి కూడా వీటిలో ఉన్నాయి. ఇటీవల కథానికలలో వార్ధక్యం, రిటైర్డ్ జీవితం వస్తువుగా గ్రహించిన కథలు ఇదివరకన్న ఎక్కువ వస్తున్నాయి. అంటే ఇప్పటి సమాజంలో వార్ధక్య జీవితం ఒక ముఖ్య సమస్య అయిందన్నమాట.

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు రాసిన 'పునరపి జననం' కథ వార్ధక్యం, ఒంటరితనం సమస్యను గురించినది. మనుషుల మధ్య సంబంధాలు 'బాంధవ్యాలు' వాటివెనుక స్వార్థపూరితమైన అవసరాలు, కొన్ని విలువలు గురించి ఈ కథ చర్చిస్తుంది. ఆ రకంగా జీవిత పరమార్థాన్ని గురించి చర్చిస్తుంది. నిజమైన బాంధవ్యం నిస్వార్థమైన ప్రేమ నుంచి వచ్చేది; ఈ ప్రేమకు శారీరక బాంధవ్యం అక్కరలేదు. అది విశ్వజనీనమైనది. ప్రేమించే మనసుండాలని సూచిస్తుంది.

'ఉన్నది ఉన్నతి' కథానిక శ్రీ విరించి రచన. కుశ్శంకలు మాని, స్వార్థం మాని ఉన్నదానిని ఉన్నట్లుగా, విన్నదానిని విన్నట్టుగా తీసుకొంటే మనుషుల మధ్య సంబంధాలు బాగవుతాయని, జీవితంలో మాధుర్యం పెరుగుతుందని సూచిస్తుంది.

'కన్నీటి అంచుల్లో కడలి' కథ ముందుచూపు లేకుండా పర్యావరణాన్ని నాశనం చెయ్యకూడదనే కథ. ఒక ప్రదేశంలో ప్రకృతి సంపద ఆ ప్రదేశానికి శరీరం లాంటిది. ఆధునికావసరాల పేరుతో ఆ శరీరాన్ని ఇష్టం వచ్చినట్లు మార్చే హక్కు ఎవరికీ లేదని దీనిలో భావం. కథనంలో స్వాభావికతలోపించడం వల్ల పాఠకులకు అనుభూతి అందదు.

'సంగమం' శ్రీ ఏడిద గోపాలరావు రచన. రిటైరైన దంపతుల జీవితం వర్ణిస్తూ, వాళ్ళ మానసికావరాలు, రోజువారీ ఎదుర్కొనే సమస్యలు, పరిష్కరణలు అనాయాసంగా

చూపే చక్కని కథ. హాయిగా చదివించే కథ ఇది. 'తప్పెవరిది' కథ శ్రీమతి డి. కామేశ్వరి రచన. చదువు పేరుతో, పోటీ పరీక్షల పేరుతో విద్యార్థులపై ఈ వ్యవస్థ, తల్లిదండ్రులూ మోపుతున్న కఠినమైన భారం, ఆ భారం కింద కుంగిపోతున్న పిల్లల కథ ఇది.

ఈ సంచికలో శ్రీ ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు రచించిన 'మొగుడూ పెళ్ళాల ప్రేమకత' చాలా మంచి కథ. రాయసీమలో అట్టడుగు వర్గాలలోని ఒక జంట, వారి జీవిత సమస్యలు, వారి అనుబంధం చక్కగా చూపుతుంది. వస్తుపరంగానే కాక, కథనం పరంగా, భాషాశైలీ పరంగా ఉత్తమమైన కథ ఇది. సజీవమైన రాయలసీమ మాండలికం ఈ కథానికను మరింత ఉత్తమంగా మలచింది.

తన సంతతిపై మమకారం ప్రకృతి సహజమని, ఏ తరానికి ఆ తరం తన సంతతిని ప్రాణాధికంగా ప్రేమించడం ఒక పరంపర, ప్రకృతి న్యాయం అని శ్రీమతి బి. కనకలత రచించిన 'పరంపర'లోని సారాంశం. చక్కగా చదివించే కథ. స్వాభావికత గల కథ. కృతకంగా లేదు.

'రెక్కల చూపు' శ్రీమతి శీలా సుభద్రాదేవి రచన. బీడీ కార్మికుల జీవితవర్ణన ఇది. వాళ్లు తీవ్రవాదం వైపు ఎందుకు మొగ్గు చూపుతారో అవగాహన కలిగించే చక్కని కథనం గల కథ.

'అపురూప సందర్శనం' శ్రీ గిడుగు రాజేశ్వరరావు రచన. సామాన్యమైన మనుషులు ఒక్కో సందర్భంలో తోటి మనిషి పట్ల చూపే అసామాన్య స్పందనని వర్ణిస్తుంది ఈ కథ. ఆ సందర్భంలో మనిషి మనీషిగా ఉన్నతస్థాయి ఎలా ఎదుగుతాడో చూపుతుందీ కథ.

బమ్మిడి జగదీశ్వరరావు గారు రచించిన 'ఒక హత్య ఒక ఆత్మహత్య' పెద్ద కథ. జీవితంలో ఓడిపోయి, పిరికిగా ఆత్మహత్యను శరణుకోరే ఒక భర్త, తనతోపాటు తాను సర్వస్వంగా ప్రేమించే భార్యను సహితం ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఆత్మహత్యకు ప్రేరేపిస్తాడు. ఒకరకంగా అతని భార్యను అతను హత్య చేసినట్లే. ఒకసారి చదివితే చెదిరిపోని బలమైన ముద్ర వేసేటట్లున్న కథాంశమూ, కథనమూ గల కథానిక ఇది. దీనిలో ఆ పరిస్థితుల వర్ణన, ఆ భార్యాభర్తల మనఃస్థితి వర్ణన మర్చిపోలేనట్లు ఉన్నాయి. ఆలోచింపజేస్తాయి.

'నూకలు' కాయితి అప్పారావు గారి కథానిక. చీమలకు రోజూ నూకలు అడుక్కుని మరీ వేస్తూ వాటికి ఉపకారం చెయ్యడం కోసమే బతికే దేవుడమ్మ ఆ పనిలోనే ఉండగా మిలిటరీ జవాన్ల కామానికి బలి అవడం దీనిలో కథ. బలవంతుల దౌర్జన్యానికి అమాయకులైన బహీనులు బలికావలసిందే, దేశాన్ని రక్షించే జవాన్లు దేవుడమ్మ మరణానికి

కారణమయ్యారు. ఏ చీమల్ని రోజూ నూకలతో దేవుడమ్మ పోషించిందో ఆ చీమలకు ఆమె ఆహారమయింది. దేవుడమ్మ అతి పరోపకార జీవితం, తనకు హాని అని తెలిసీ చీమలకు ఆహారం వెయ్యడానికి వెళ్ళి ఆపదలో చిక్కుకోవడం సంఘజీవికి ఉచితమేనా అనే ఆలోచన కలుగుతుంది.

'ముసుగు' కథ మనిషి మనస్తత్వ చిత్రీకరణ. వస్తువు బాగానే ఉన్నా, అనవసరమైన ఇంగ్లీషు పదజాల ప్రయోగం శైలికి ఇబ్బంది కలగజేసి, అపరిపక్వం చేసింది.

'ముందుచూపు' కథా కథనంలో కొత్తదనం గానీ, పరిపక్వత గానీ లేక చెప్పదలచిన విషయం మంచిదే అయినా, నీతిబోధలా తయారయింది.

ఎంత మేధావికైనా, తాను ఒంటరివాడిని కాదనీ, తన గురించి పట్టించుకొనేవారు ఇంకొకరున్నారంటేనే, ఆ జీవితానికి అర్థం ఉంటుంది. ముఖ్యంగా వార్ధక్యంలో పలకరించే దిక్కే లేకపోతే ఏమి ఉన్నా లేనట్లేననీ, జీవితేచ్ఛే ఉండదనీ చెప్పే కథ 'తోడు' మడపల్లి రమేష్ రాజు గారి రచన.

డా. గీతాంజలి రాసిన 'వంటింట్లో నులకమంచం' కథ బాగుంది. ఆలోచింపచేసే కథ ఇది. ఇంట్లో పనులే కదా అని తేలికగా తీసివేసినా, ఆ పనులలోనే శ్రమ విభజన లేక నేటి సగటు స్త్రీ బానిసలాగా పనిచేసే యంత్రం లాగా మారిందని వివరించే కథ.

ముద్దంశెట్టి హనుమంతరావు గారి 'ద్రోహి' కథ మనిషిలో స్వార్థచింతన పెరిగితే మానవత్వాన్ని కూడా ఎలా దిగజారుస్తుందో, మానవ సంబంధాలను ఎలా నాశనం చేస్తుందో, మనిషిలో విలువలు ఎలా నశింపజేస్తుందో చెబుతుంది. బుర్రా లక్ష్మీనారాయణ గారి 'శూన్యంలోకి' సగటు మనుషుల జీవితాల్లో జరిగే 'తొలిప్రేమ' అనుభవం, దాన్ని పండించుకోలేకపోవడం, జీవిత మలిదశలో ఆ ప్రేమికులు కలుసుకొన్నప్పుడు, వారిలో కలిగే భావాలు చిత్రిస్తుంది. పరోక్షంగా మనుషుల్లో 'సగటుతనాన్ని' సూచిస్తుంది. అదే ఎక్కువ చైతన్యమూ, సమర్థతా గలవారయితే, పరిస్థితిని తమకనుకూలంగా మార్చుకోగలుగుతారు. సగటు మనిషి పరిస్థితికి తానే అనుకూలంగా మారి, ఆ గాలివాటున కొట్టుకుని పోతాడని అనిపిస్తుంది.

'ఇద్దరి మధ్య' అనే శైలకుమార్‌గారి కథ ఒక అందమైన సినిమా నటి తనను పైకి తెచ్చిన డైరెక్టరును ప్రేమించడం, అతను మాత్రం తన భార్యమీది ప్రేమతో ఈమెను తిరస్కరించడం కథాంశం. కథనంలో ఈ కథాంశం నిజంగా జరగదగ్గదనే నమ్మకం పాఠకుడికి కలిగించే బలంగానీ, స్వాభావికత గానీ లేదు.

శారదా అశోకవర్ధన్ గారి 'మొగ్గ' కథ కలవారింటి బిడ్డకీ, ఆ ఇంట్లో పనిమనిషి

కొడుకుకీ ఉన్న అవకాశాలలో, జీవన విధనంలో స్పష్టంగా, అన్యాయంగా కనబడే వ్యత్యాసం చూపుతుంది. సులభంగా చదివించే భాషాశైలి.

రావినూతల సువర్ణాకన్నన్ గారి 'కోరిక' కథ సంఘటనాత్మకమైన శిల్పంతో ఆసక్తి రేకెత్తించి చదివించే సినిమాటిక్ కథ. కప్పగంతుల మల్లికార్జున రావు గారి 'ఒప్పందం' భార్యాభర్తల సంబంధాన్ని వివాహ వ్యవస్థను ఆధునిక దృష్టిలో నిర్వచించే కథ.

'జలంధర' సుప్రసిద్ధ రచయిత్రి లత గారి పౌరాణిక కథ. ఇదొక ప్రయోగమనవచ్చు. దుర్యోధనుడి భార్య భానుమతీ దేవికి చెల్లెలే జలంధర. ఈమె భీమసేనుడిని చూసి వరించడం, శ్రీకృష్ణుడు వారిద్దరి వివాహం జరిగేలా చూస్తానని మాట ఇవ్వడం ఇందులో కథాంశం. ప్రయోగం బాగుంది గానీ, పండితురాలై ఉండి కూడా భాషాశైలి విషయంలో లతగారు శ్రద్ధవహించలేదు. సగం గ్రాంథికం, సగం వ్యావహారికంలో ఉన్న కథనం, రసాత్మకతకు కొంచెం అడ్డుపడుతోంది.

'నిర్ణయం' మరాఠీ మూలం గల అనువాద కథ. ఇదొక మంచికథ. మహర్లకులంలో పుట్టిన కుర్రవాడు మెట్రిక్యులేషన్ పాసయి కూడా ఉద్యోగాలు దొరక్కపోవడం వల్ల చివరికి అతని తండ్రి వతందారీ కింద కులం పనికి, అంటే కక్కసులు కడిగే పనికి పంపడానికి సిద్ధమవుతాడు. ఆ సందర్భంలో వాళ్ళుపడే యాతనే ఈ కథ. దీనిలో రాయలసీమ మాండలికం, నిర్దుష్టంగా కాకపోయినా, చక్కగానే ప్రయోగింపబడింది.

'తాను వెలిగించిన దీపం' పెద్ద కథ. ముగింపు నాటకీయంగా ఉండి, పాఠకుడిని కథనుంచి వేరుగా ఉంచుతుంది.

కలువకొలను సదానంద గారి 'సందేశం', విశ్వనాధ రామారావు గారి దత్తత విశ్వనాథరావు చిన్న కథలు. సందేశం కథ హాస్యవ్యంగ్య భరితంగా, చిన్న కుటుంబం చింతలు లేనిదంటూ కొసమెరుపుగా సందేశం ఇచ్చిన మంచి కథ. చక్కని కథనంగ గలది. వస్తుపరంగానూ, రూపగతంగానూ మంచి కథ ఇది. దత్తత వ్యంగ్యంగా నేటి రాజకీయ పోకడలనీ, రాజకీయాల్లో విలువలనీ విమర్శించే కథ. మొత్తం మీద చూస్తే ఈ సంచికలోని కథల స్థాయి బాగుంది.

ఒక పత్రిక నడపాలంటే, వ్యాపారదృష్టి కొంతవరకైనా తప్పదు; ఇంత వ్యాపారయుగంలోనూ మనగలిగి, పత్రికను బతికిస్తున్న ప్రధాన ప్రక్రియగా మారిన కథానికకి ఇవి మంచిరోజులే, అన్నీ మంచి కథలే కావడానికి అవకాశం లేకపోయినా, మంచి కథలు కూడా రావడానికి కారణమవుతున్నది ఆంధ్రజ్యోతి వారపత్రిక.



# ఇండియా టుడే వారపత్రిక

సమకాలీన పరిణామాలను నిశితంగా విశ్లేషిస్తూ, ఉత్తమ శ్రేణి సమాచార సాధనంగా పాఠకుల ఆదరాభిమానాలను విస్తృతంగా చూరగొంటున్న పత్రిక ఇండియా టుడే. 1990లో పక్షపత్రికగా ఆవిర్భవించి 1997 జూలై నుండి వారపత్రికగా నూతన అధ్యాయం ప్రారంభించింది.

మౌలిక ప్రమాణాలను నిలబెట్టుకుంటూ ఉత్తమ పఠనానుభవాన్ని అందించే ఈ పత్రిక తెలుగు కథకు పెద్దపీట వేయడం ముదావహం. కథా రచయితల పేరుని బట్టి గాక రచనా ప్రామాణికతను దృష్టిలో పెట్టుకుని వైవిధ్యమున్న కథలను అందించడంలో పత్రికా సంపాదకులు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం గమనార్హం.

అయితే పక్షపత్రికగా వున్నప్పుడు క్రమం తప్పకుండా కథలందించిన ఇండియాటుడే వారపత్రికగా మారిన తర్వాత మధ్య మధ్య కొన్ని సంచికలలో కథానికలు వేయలేదు. ఆ స్థానే సమగ్ర సాహితీ వ్యాసమో, సంగీత, సాహిత్య, సాంస్కృతిక రంగాలకు చెందిన ప్రముఖుల పరిచయాలే ఇవ్వడం పాఠకులకు తెలిసిందే. ఆ విధంగా 1997 జనవరి నుండి డిసెంబర్ వరకు వెలువడిన సంచికల్లో మొత్తం ఇరవై ఎనిమిది కథలు వచ్చాయి. అందులో రచయిత్రుల కథలు ఎనిమిది. రచయితలవి ఇరవై.

జనవరిలో తోలేటి జగన్మోహనరావు 'జీవిత బంధం' - కలువకొలను సదానంద 'తమసోమా జ్యోతిర్గమయ' - ఫిబ్రవరిలో కుప్పిలి పద్మ 'గాయం' - మన్నెం శారద 'కిటికి' - మార్చిలో ఘండికోట బ్రహ్మాజీరావు 'మంద' - కె. రామలక్ష్మి 'నో నో ప్లీజ్' - ఏప్రిల్ లో

పులికంటి కృష్ణారెడ్డి 'భారతం మిట్ట' - డి. కామేశ్వరి 'ఈశిక్ష చాలు' - మేలో స్వామి 'విపర్యయం' పెద్దకథ - జూన్‌లో కాలువ మల్లయ్య 'భద్రత' - శ్రీ సుభా 'హస్తకళ' - జూలైలో బలివాడ కాంతారావు 'రంగస్థలి' - చిలుకూరి దేవపుత్ర 'తోడు' - సదానంద శారద 'సర్కారీ దోపిడీ' - సతీష్‌చందర్ 'మూడు అబద్ధాలు' - ఆగస్ట్‌లో మైనంపాటి భాస్కర్ 'రామునితోకపీకి...' - కె.బి. లక్ష్మి 'ముహూర్తం' - అవసరాల రామకృష్ణారావు 'తల్లిపేరూ పిల్లపేరూ' - సెప్టెంబర్‌లో నవీన్ 'ఎనిమిదో అడుగు' - సింగమనేని నారాయణ 'ఒకగతి ఒక శ్రుతి' - పి.యస్ నారాయణ 'అజ్ఞాత శత్రువు' - అక్టోబర్‌లో ఎమ్. హేమలత 'మా స్వర్గధామమిదే' - యద్దనపూడి సులోచనారాణి 'ప్రతిబింబం' - నవంబర్‌లో శ్రీ విరించి 'మీరనిమేరలు' - బోయ జంగయ్య 'తెల్లకార్డు' - డిసెంబర్‌లో సి. ఆనందరామం 'ఎర్రగోగుల ఎర్రెమ్మ' - బి.యస్. రాములు 'దుస్తులు' - పమ్మి వీరభద్రరావు 'నిన్ను నువ్వు తెలుసుకో' కథలు ప్రచురింపబడ్డాయి. స్త్రీవాదం, దళిత వాదం, సామాజిక న్యాయం, నైతిక, మానవతా విలువలు, మనస్తత్వాలు, మనోవికారాలు తదితర అనేక జీవితాంశాలను ఆవిష్కరించాయి ఈ కథలు.

తోలేటి జగన్మోహనరావు 'జీవిత బంధం' కుటుంబ పరిధిలో ఇద్దరు భిన్న వ్యక్తిత్వాలు గల వ్యక్తులు కలసి జీవించలేనపుడు ఉత్పన్నమయ్యే సమస్యలని సున్నితమైన హాస్యంతో మేళవించి అద్భుతంగా చెప్పిన కథ. "స్త్రీ విముక్తి అంటూ స్త్రీవాదులూ, పురుష విముక్తి అంటూ పురుషులూ చెరోపక్కనించి కొంపలు అంటిస్తారన్నమాట. పిల్లల సంగతి తర్వాత ఆలోచిస్తారా?" అని నిలదీసే బామ్మగారు, ఎవరి ధోరణిలో వాళ్ళు స్త్రీ పురుష వాదాల్ని బలంగా ప్రతిపాదించాలనుకునే సంధ్య శేఖరు దంపతులు, శేఖరు మిత్రులు, ఇరుగు పొరుగువారు, ఆఖరికి సంధ్య పుట్టింటి నుండి తెచ్చుకున్న 'జాంగ్‌పెట్టి' (దీన్నిండా స్త్రీ వాదం వుందని శేఖరం ఆరోపణ) అన్నీ హాయిగా నవ్విస్తూనే పాఠకుణ్ణి తీవ్రంగా ఆలోచింప జేస్తాయి. అప్పట్నించి ఇప్పటి దాకా ఈ కథ మీద ఇంకా వాదోపవాదాలు చెలరేగుతూనే వుండడంతో వాటి శైలీ శిల్పానికి బలమైన తార్కాణం. ఫెమినిస్టుల పోకడలపై వ్యంగ్యాస్త్రాలు సంధించిన ఈ కథా కథనంతో కాస్త డాక్యుమెంటేషన్ చోటు చేసుకోవడం కథలోంచి వ్యాసంలోకి వెళ్లామా? అన్న భ్రమ కలుగుతుంది అక్కడక్కడ. సంసారనౌక సాఫీగా సాగడంతో భార్యాభర్తల బాధ్యత, అనురాగ దాంపత్యానికి కావాల్సింది ప్రేమానురాగాలే గాని, పంతాలు, పట్టింపులు కావని ఢంకా బజాయించి చెప్పిందీ కథ.

స్వార్థం, ఆకలి మనిషిని ఎంతటి దారుణాలు చేయడానికైనా ఎలా పురికొల్పుతుందో చెప్పిన కథ కలువకొలను సదానంద 'తమసోమా జ్యోతిర్గమయ' సోమరితనం, కాఠిన్యం, క్రౌర్యం, అజ్ఞానం మొదలయిన తామస గుణాలన్నీ ఒక మూసలో పోసి బ్రహ్మదేవుడు

సింగన్నను సృష్టించాడు. భిక్షాటనంతో ఊరూరా తిరిగే సింగన్నకి సుబ్బి తారసపడుతుంటుంది. కలిసి వుంటారు. ఆమె ఇతని ఆలనా పాలనా చూసుకుంటుంది. ఆడపిల్లను ప్రసవించి ఆమె చనిపోతుంది. సింగన్నకు వచ్చిన విద్య అడుక్కోవడం ఒకటే. ఆరోగ్యంగా ఉన్న సింగన్న ముష్టి ఎత్తితే అందరూ ఈసడిస్తారు. సుబ్బితో పరిచయం, పెళ్ళి అన్నప్పుడు ఆవిడ ఓ షరతు పెడుతుంది. సంవత్సరం పాటు అతని పూర్తిపోషణ భారం ఆమె వహించేటట్లు ఆ తర్వాత బాధ్యత అతనిది అయ్యేటట్లు. సరేనంటాడు. సంవత్సరం తిరిగేటప్పటికి ఆడపిల్ల పుడుతంది. ఇద్దరి పోషణ భారం అతనిమీద పడడంతో వాళ్ళని వదిలి పారిపోతాడు. జాతరలో ఓ పిల్లాడు దొరికితే వాడి కళ్లు నలిపేసి గుడ్డివాణ్ణి చేసి, వాణ్ణి అడ్డం పెట్టుకుని అడుక్కుంటుంటాడు. ఓసారి శవమైన భార్య పక్కనే ఏడుస్తూ అడుక్కుంటున్న కన్నకూతురు సీతని చూస్తాడు. పశ్చాత్తాప పడ్తాడు. గుడ్డివాడు రాముణ్ణి, కన్నకూతురు సీతని కలిపి తాను తప్పుకుంటాడు. జరిగిందంతా విన్న పద్దెనిమిదేళ్ళ సీత చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చెల్లించుకోవాలని ఆరాటపడే కన్నతండ్రి కోసం గుడ్డిరాముణ్ణి భర్తగా అంగీకరించి త్యాగనిరతి ప్రదర్శిస్తుంది.

బాల్యం నుంచి చరమాంకం దాకా వనిత జీవితం ఓ దగ్ధపుష్పం. శరీరం నిండా, మనసు లోపల గాయాల చిల్లులతో ఆమె నడిచే గాయంలా జీవిస్తోంది అని నిరూపించడానికి ప్రయత్నించిన కథ కుప్పిలి పద్మ 'గాయం' కథ. ఇతివృత్తం పాతదే అయినా ప్రెజెంటేషన్ బావుంది. వరకట్నాలు, కిరసనాయిల్ మరణాలు నేటి సామాజిక వాస్తవాలను, అటు పుట్టింట్లో, ఇటు అత్తింట్లో వివక్షకు గురవుతున్న స్త్రీల దయనీయ గాథ ఇది.

మన్నెం శారద 'కిటికీ' కథ. పెళ్ళి అనేది స్త్రీని బందీ చేయకూడదు. స్వేచ్ఛా ప్రపంచంలోకి తెరుచుకునే మనసు కిటికీని మూయకూడదు అంటుంది. మేడలేని గొప్పింటి కోడలు విజయ, మేడ పక్క పేదింటి కోడలు నీలు జీవితాలు స్వేచ్ఛ విషయంలో ఒకేలా వుంటాయి. తగినంత కట్నం ఇవ్వలేని నీలు, తక్కువ చదువుకున్న నీలు. విద్యాధికురాలు, ధనవంతురాలు అయిన విజయల మధ్య స్నేహం, నీలు మరణం విజయ కళ్ళు తెరిపించి స్వేచ్ఛా నినాదం చేసిన తీరు కథలో చక్కగా వర్ణించారు. అయితే పురుషులు చేస్తున్న పని తామెందుకు చేయకూడదన్న కసితో గాక వ్యక్తిత్వానికి భంగం కలగకుండా విజయ నిర్ణయం తీసుకుని వుంటే బావుండేదనిపిస్తుంది.

స్వార్థ పరాయణత్వం ముదిరిన సభ్యసమాజంలో ఏటికి ఎదురీదే వ్యక్తి ఒంటరిగా మిగిలిపోతున్నాడు. సంకుచిత భావజాలం మనుషుల్ని సంఘటితం కాకుండా చేస్తోంది అన్న విషయాల్ని బలంగా చెప్పిన కథ ఘండికోట బ్రహ్మాజీరావు 'మంద' కథ. రిటైరయిన

రైల్వే ఉద్యోగి మూర్తి తనలాగే బ్యాంక్ నుండి పెన్షన్ తీసుకోడానికి వచ్చే మాజీ రైల్వే కొలీగ్స్‌కి సాయపడదామనుకోవడం, బ్యాంక్ ఉద్యోగులు చూపించిన ప్రలోభాలకు వాళ్లు లొంగిపోయి తమ కోసం కష్టపడుతున్న మూర్తిని పక్కకి నెట్టేయడం సన్నివేశ బలంతో చూపించిన కథ.

సమాజంలోని పురుషాధిపత్యంపై స్త్రీవాదులు పోరాడాల్సిందే. కానీ వితండంగా ముందుకు సాగితే, అదే పురుషానుకూల వలయంలో చిక్కుకుని, మరో ప్రాణికి అక్రమంగా ఊపిరిపోసినవారవుతారని చెప్పే వినూత్న కథ కె. రామలక్ష్మి 'నో నో ప్లీజ్!' పెళ్ళి కాకుండా కలిసి వుండాలనుకోవడం, 'హేవ్ సెక్స్ నాట్ ఎ బేబీ' అన్న అంశం పురుషహం గానీ, స్త్రీ ద్వేషం గానీ కాదు. సెన్సిబుల్‌గా ఆలోచించాల్సిన విషయం అని సున్నితంగా చెప్పిన కథ.

కథానాయకుడు తల్లీ తండ్రీ లేని అనాథ కావడం, ఓ సంస్కారవతి చేతిలో అతను పెరిగి డాక్టరవడం మానవ సేవావృత్తిలో వున్న అతనికి హృదయ సంస్కారం వుండడం ఈ నేపథ్యంలోని ఆరోగ్యవంతమైన అతని ఆలోచనాధోరణి ఇతివృత్తానికి పుష్టినిచ్చాయి.

పల్లెల్లో ఒకనాడు వెల్లివిరిసిన ఐకమత్యానికి డబ్బు, రాజకీయ చిచ్చుపెట్టి కక్షలు, కార్పణ్యాలు రెచ్చగొడుతున్న వైనం కళ్ళకు కట్టినట్లు చెప్పిన కథ పులికంటి కృష్ణారెడ్డి 'భారతం మిట్ట' స్వార్థ రాజకీయాల కోసం యువతను రెచ్చగొట్టి సమ్మెలు, దహనాలు పేరిట ప్రజాధనాన్ని దుర్వినియోగం చేసే దారుణస్థితిని దయనీయంగా వర్ణించారు రచయిత. నేతలు మారితేనే గాని ప్రజల తలరాతలు మారవని గట్టిగా చెప్పిన కథ 'భారతం మిట్ట'.

డి. కామేశ్వరి "ఈ శిక్షచాలు" శాస్త్ర, సాంకేతిక, వైద్య విజ్ఞానం వేగంగా అభివృద్ధి చెందుతున్న నేటి పరిస్థితులకు అనుగుణంగా మలిచిన కథ. పిల్లలు పుట్టక పోవడానికి కారణం తనలోని లోపమే అని తెలిస్తే మగవాడు భరించలేడు. తరతరాల పురుషాహంకార భావజాలం ఆ లోపాన్ని బాహాటంగా అంగీకరించనీయదు. ఈ అహం భార్యల్ని అకారణంగా తప్పు పడుతుంది. ఆ కోవకి చెందినవాడే జీరో అయిన ఈ కథలోని హీరో ప్రభాకర్. తన లోపం కప్పిపుచ్చుకుని, రిపోర్టులు మార్చేసి అబద్ధం చెప్పిన భర్తకి డాక్టర్ మిత్రురాలి ద్వారా ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ పద్ధతిలో గర్భం ధరించి అదంతా భర్త ప్రతిభే అని వైలమాలో పడేసి గుణపాఠం నేర్పిన హీరోయిన్ సుజాత కథ ఇది. మధ్య తరగతి. స్త్రీ మనస్తత్వాన్ని పురుషాహంకారాన్ని బేలన్స్‌డ్‌గా ఎస్టాబ్లిష్ చేశారు రచయిత్రి.

వర్ణవ్యవస్థ సృష్టించిన విపరీతాల్లోంచి తేరుకుని అగ్రవర్ణ సమాజానికి దళితుల

ఎదుగుదల మింగుడుపడకపోవడాన్ని విశ్లేషించి, పరిష్కారాన్ని ప్రతిపాదించిన మంచి కథ స్వామి 'విపర్యయం' హెడ్‌మాస్టారు నుండి అటెండర్ దాకా బ్రాహ్మణులే వుండి వారి మానేజ్‌మెంట్లో నడుస్తున్న స్కూల్లో ప్రతిభావంతురాలయిన దళిత ఉపాధ్యాయినికి జరిగిన అన్యాయం, దాన్ని ఆమె అభిమాన అగ్రకుల కొలీగ్స్ ప్రతిఘటించిన విధానం, సమర్థనీయంగా వుండి పాఠకుల్ని ఆకట్టుకుంటుంది. ఎంతో కష్ట సమయంలో కూడా తన అభిప్రాయాల్ని బలి పెట్టుకోకుండా ధైర్యంగా నిలబడిన కథానాయిక సరస్వతి వ్యక్తిత్వం కులాలకతీతంగా ఆ స్థితిలో ఉన్న స్త్రీలందరికీ అనుసరణీయం అన్పిస్తారు రచయిత.

యువతని ఆకర్షించి ఆవేశకావేషాలకు గురిచేసి ప్రాణాల్ని పణంగా పెట్టి ఉద్యమాల్లోకి దూకేలా చేసే వ్యవస్థ లోటుపాటులను, జీవిత ఆటుపాట్లను ఆలోచనాత్మకంగా ఆవిష్కరించిన కథ కాలువ మల్లయ్య 'భద్రత' - "రహస్య జీవితం గడుపుతూ వీళ్ళేం సాధించగల్గుతున్నారు? ఎండమావుల వెంట పరుగిడుతున్నారా? ఎంతమంది చురకత్తుల్లాంటి యువకులు బలైపోతున్నారు?" అని ప్రశ్నించే మనోహర్ "అనుక్షణం మృత్యుముఖంలో వుంటూ జీవన్మరణ పోరాటాలు చేస్తున్న దెవరికోసం? యేం బతకలేడనా? బతకరాదనా?" అంటూ ఇదంతా ప్రజల కోసమే అనే రాజేష్ ఈ వ్యవస్థలోని రెండు వర్గాలకు ప్రతీకలు. వ్యక్తి జీవితంలో భద్రత, మనశ్శాంతి అవశ్యమని చక్కగా సమర్థించిన కథ.

జేబుదొంగలు, గజదొంగలు, బందిపోట్లు, దోపిడీ దొంగలు తెలుస్తూనే వుంటారు. కానీ ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్టలేడన్న లెవెల్లో కంటికి నచ్చిన వస్తువుల్ని, నగానట్రాలను ఎంచక్కా కొట్టేసే హస్తలాఘవం 'క్లెప్టోమానియాక్' గురించి కళాత్మకంగా చెప్పిన కథ శ్రీ సుభా 'హస్తకళ'. పెళ్ళిళ్లకు వచ్చి తన హస్తకళను ప్రదర్శించే ముత్తయిదువ పద్మావతి గారి చేతిగాజుల్ని కొట్టేసిన విద్యాధికురాలు, ఆర్కియాలజిస్ట్, గొప్ప క్లెప్టోమానియాక్ వనజ - వనజ సంగతి తెలియక మనసిచ్చి తెలిశాకా వెనక్కి తెచ్చుకోలేని హీరో సుబ్బారావులు మనం ఏ పెళ్ళికి వెళ్లినా కన్పిస్తారేమో అన్నట్లు చిత్రించారు రచయిత.

పెద్దల ఆస్తిపాస్తులే కాదు వారి ఉత్తమ గుణాలను అందిపుచ్చుకున్నవారే నిజమైన వారసులు అనే గొప్ప సత్యాన్ని బలివాడ కాంతారావు కథ రంగస్థలి ఆవిష్కరించింది. ముత్తాత, తాత, తండ్రి నివసించిన మహల్ వంటి ఇల్లు శిథిలం కావడం, ఆ ముగ్గురు పురుషులతో బంటెమ్మ, గంగమ్మ, నీలమ్మల జీవితాలు పెనవేసుకున్న తీరును రచయిత హృద్యంగా చిత్రీకరించారు. ఉద్యోగ విరమణ చేసి ఊరికే చూసిపోదామని పుట్టిపెరిగిన

వూరికి వచ్చి ఇపుడు శిథిలావస్థలో వున్నా గత వైభవాన్ని, బంగారు బాల్యాన్ని గుర్తు చేసిన ఇంటిని చూసుకున్న అతను తన ఆలోచనలతో బాటు పాలకుణ్ణీ తన వెంట తీసుకెళ్తాడు. పోయింది పోగా మిగిలిన ఆ స్థలంలో పాక వేసుకుని వుండమని దాన్ని నీలమ్మకి ఇచ్చేస్తాడు. తనని పెంచి పెద్దచేసి మనిషిగా రాణించడానికి అన్ని విధాలా ముడిసరుకును, ఆలోచనలను అందించిన ఆ రంగస్థలాన్ని ఒక ఉత్తమురాలికి అప్పజెప్పానన్న తృప్తితో తిరుగు ప్రయాణం కడతాడు. మానవతా విలువల్ని విశ్లేషించిన ఉత్తమమైన కథ.

చెక్కుచెదరిన దాంపత్య బంధానికి మూలస్తంభాలు నిర్మలప్రేమ, సహృదయతలే అని చెప్పిన చిలుకూరి దేవపుత్ర 'తోడు' కథ. మగవాడి మంచితనానికి గొడుగు పట్టింది భర్త నుండి విడాకులు తీసుకుని విడిపోయినా ఆమె మీద అతని నిఘా, ఇద్దరు పిల్లల్తో అవస్థ పడుతున్న అందాల అమాయకురాలు, స్నేహమయి అయిన ఆమె నిస్సహాయత రాజారాంని కదిలించింది. పెళ్ళి చేసుకున్నాడు. తొలి రాత్రే ఆమెకు చెప్పకుండా వెళ్లిపోయాడు. కొన్నాళ్ళ తర్వాత తిరిగొచ్చాడు. మనకీ ఇద్దరు పిల్లలు చాలన్నాడు నీ ఆరోగ్యం కోసం వేసక్టమీ చేయించుకున్నానన్నాడు. అందుకే వూరికెళ్ళానన్నాడు. అతని ప్రేమకు ఆమె నోట మాట రాలేదు. మగవాడి అనురాగమంటే అలా వుండాలనుకుంది.

నిధులు సమకూర్చుకోవడం కోసం నానా జిమ్మిక్కులకు పాల్పడే ప్రభుత్వ విధానాలతో నలిగిపోతున్న సామాన్యుల వేదన సదానంద్ శారద 'సర్కారీ దోపిడీ' వదిన మెట్టెలమ్మి ఇచ్చిన వంద రూపాయల్తో రైలెక్కిన యువకుడి దీనగాథ, వ్యవస్థలోని లోపాలకు, వ్యక్తిగత అజ్ఞానానికి మధ్య వున్న తేడాను రచయిత సానుభూతితో దాటవేశారు. పల్లెలో డిగ్రీ చదివినా పట్నం పోకడలు తెలీని యువకుని నిరాశానిస్పృహలకు అద్దం పట్టిన కథ.

సతీష్‌చందర్ 'మూడు అబద్ధాలు' ముచ్చటయిన కథలా అనిపిస్తూనే గుండెని మెలిపెట్టే కరుణరసాత్మకమైన కథ. కులంతో పాటే ప్రేమనీ, అభిమానాన్నీ గుండెకింద దాచిపెట్టలేక న్యూనత్వాన్ని చీల్చుకుని కళ్ళు తెరిచిన అచ్చమైన కథ. దళిత కులాన్ని కప్పి పుచ్చుకుని పెయింటర్ పీటర్, పెయింటర్ రాజుగా మారినా - అనుక్షణం తన అస్థిత్వాన్ని మరువలేక పరాయికులంవాడిగా నటించలేక, ఉన్న కులంతో ఊరేగలేక మానసిక సంఘర్షణకు గురై ఆఖరికి ఒకనాడు తన అసలు కులాన్ని ఎలుగెత్తి చాటి అంతదాకా మనసుకి వేసుకున్న రంగుల్ని కన్నీళ్ళతో కరిగించుకుని మనశ్శాంతిని పొందడం గొప్ప ముగింపు.

నేటి సినిమా కథాకమామిషు మీద సంధించి వదిలిన వ్యంగ్యాస్త్రం మైనంపాటి

భాస్కర్ 'రాముని తోక పీకి.....' కథ. హఠాత్తుగా సినిమా రచయిత అయిపోవాలని దుర్బుద్ధి పుట్టిన రచయిత కథ సంచీలో వేసుకుని ఓ సినీ నిర్మాతను కలిసి ఆపైన వాళ్ళు కథను చీల్చి చెండాడిన విధానానికి విరక్తి చెంది ఇంటిదారి పట్టిన ఇతివృత్తాన్ని రచయిత చక్కని చిత్రానువాదంగా చూపించగలిగారు. సరదాగా చదువుకోడానికి బావుంటుంది.

కె.బి. లక్ష్మి కథ 'ముహూర్తం' ఈనాటి వాస్తవాలకు చాలా దగ్గరగా వుండి, సమస్య, పరిష్కారాలను రెండూ సమర్థవంతంగా ఎష్టాబ్లిష్ చేసింది. జీవితాన్ని సుఖమయం చేసుకోవాలన్నా చిరిగిన విస్తరి చేసుకోవాలన్నా ఎలా తీర్చిదిద్దుకోవాలన్నా అంతా మన చేతుల్లోనే వుందని చెప్పిన మంచికథ. ఆచారాలు, వ్యవహారాలు, సంప్రదాయాల్లో ఆంధ్ర, తెలంగాణాల్లో ప్రాంతీయ భేదాలు ప్రేమకు, పెళ్ళికి అడ్డురావని స్నేహమయంగా చెప్పిన తీరు కొత్తగా వుంది, బావుంది. పెళ్లి జరిగిన వెంటనే మంకుపట్టుపట్టిన పెళ్ళికూతురు వైదేహికి ఆమె స్నేహితురాలు కళ్యాణి చెప్పిన మాటలు వైవాహిక జీవితపు గొప్పదనాన్ని ప్రకటించాయి. స్నేహానికి ప్రాధాన్యతనిస్తూ కథ మలచిన తీరు బావుంది.

సనాతనపు బామ్మగారు మంగమ్మ సణుక్కుంటూనే సాటివారిని ఆదుకోవడం అతి నేర్పుగా చెప్పారు అవసరాల రామకృష్ణారావు 'తల్లిపేగూ-పిల్లవేరూ' కథలో మంగమ్మగారి మనసుకూ, మాట తీరుకూ పొంతనే వుండదు. నారికేళం లాంటి అలాంటి మనుషులు ఒకపట్టాన మింగుడు పడరు. వారిలోని మంచితనం మనసుతో చూస్తేనే కనిపిస్తుంది. పక్కింటి మేరీ కూతురు మెటిల్డాకి జ్వరం వచ్చినా, తన ఆచారాల్ని ఓ పక్క తిట్టి పోస్తూ మరదలు తన ఆస్తిపాస్తులు ఆశించినా అన్నింటినీ ఒకేలా నిర్వహించగల సహృదయురాలు మంగమ్మ. అన్ని పన్లూ తనే చేసుకుంటూ అందర్నీ ఆదరించే అరుదయిన ఆవిడ వ్యక్తిత్వం స్త్రీ పురుష భేదం లేకుండా అందరికీ ఆదర్శప్రాయం.

ముక్కు మొహం మాత్రమే తెలిసిన వ్యక్తితో ఏడడగులు నడిచి చీకటి పంజరంలో విలవిల్లాడిన ఓ అసహాయురాలి ఆక్రందన నవీన్ కథ 'ఎనిమిదో అడుగు' డబ్బు ఖర్చుపెట్టి మంచి సంబంధమని చూసి వైభవంగా పెళ్ళిచేసినా ఆడపిల్ల జీవితం ఆఖరికి ఏమౌతుందో చెప్పలేని లాటరీ పెళ్ళి. కథలోని హీరోయిన్ సృజన తన భర్త నుండి కోరుకునేది ఆరోగ్యకరమైన, సహజమైన సెక్స్ కాదని, అసహ్యమైన, భ్రష్టమైన సెక్స్ కోరికలు అతనికి వున్నాయని అతని బారినుండి తనను రక్షించమని తల్లిదండ్రుల్ని వేడుకున్నా వారు పెడచెవిన పెట్టారు. అపుడు ఆమె తండ్రి స్నేహితుడు ఆమెను ఆదుకొని ఆత్మహత్యప్రయత్నంలో రక్షించి ఉద్యోగం ఇప్పించి ఏడో అడుగు వేయించడం మెచ్చుకోదగిన క్లయిమాక్స్.

బాల్యంలో అల్లుకున్న స్నేహబంధం లేని అమలినత్వానికి అద్దం పట్టిన కథ సింగమనేని నారాయణ 'ఒక గతి - ఒక శ్రుతి' కష్టకాలంలో ఆదుకోవడం స్నేహధర్మం అయినా చిన్ననాటి స్నేహాన్ని మరువకుండా మంచి మనసుతో స్నేహానికి మరింత న్యాయం చేయడం అపురూపమైన విషయం. కలిసి చదువుకున్నా, కలిసి పెరిగినా ఎవరి అదృష్టాన్ని బట్టి వాళ్ళ జీవితాలు నడుస్తాయి. ఆడపిల్లల పెళ్ళిళ్ళకి వున్నా ఆస్తి అమ్మేసుకున్న స్కూలు మాష్టారు గంగాధరం, కాలేజీ లెక్చరర్ అయి మగపిల్లల్ని బాగా చదివించి మంచి ఉద్యోగాల్లో పెట్టి బేఫికర్‌గా వున్న రామకృష్ణ బాల్యమిత్రులు. ముప్ఫయ్యేళ్ళ తర్వాత అనుకోకుండా గంగాధరం ఇంటికి వెళ్ళిన రామకృష్ణ అతని కూతురు కరుణని తన కోడల్ని చేసుకుంటాడు. విద్యావంతురాలయిన ఆ అమ్మాయి మర్యాద, వినయం, విజ్ఞత, ఆదరాభిమానాలు రామకృష్ణకి నచ్చడంలో ఆశ్చర్యం లేదు. పెద్దతరం గతంలోని స్నేహమాధుర్యానికి మరింత వన్నెలు దిద్దాలంటే అందుకు పిల్లల మంచి ప్రవర్తన, సహకారం కూడా ఎంతో అవసరం అని చెప్పిక చెప్పిన కథ.

పి.యస్. నారాయణ 'అజ్ఞాత శత్రువు' కథ ప్రేమ, ఆప్యాయతలను తూచే తూనికరాళ్ళు లేవు, కానీ వాటిని కొందరు డబ్బుతో తూచే ప్రయత్నం మాత్రం మానలేరు. డబ్బు లేని వాళ్ళు డబ్బులు వెదజల్లుతుంటే కుక్కల్లా చుట్టూ పడి తిరుగుతుంటారు. లేకపోతే పాముల్లా కాటేస్తుంటారు. అని అనుకునేవారికి 'డబ్బులే బాంధవ్యాలకు కత్తెర్లవుతాయనేది లోకవిదితం, కుటుంబ సభ్యుల మధ్య వుండాల్సిన అభిమానాలకు ఆ కత్తెర్లు పడగూడదనే విషయాన్ని సెంటిమెంటు జోడించి చెప్పిన మంచికథ.

తల్చుకుంటే జన్మభూమి లోనే భూతల స్వర్గాన్ని సృష్టించుకోవచ్చు. మనసుండాలే గాని మార్గాలు కరువు కావు అని రైటర్ చెప్పిన కథ. ఎమ్.హేమలత 'మాస్వర్గధామమిదే' రాజమండ్రి పక్క పల్లెటూళ్లోని ఇంట్లో అమెరికా ఆధునిక సౌకర్యాలన్నీ దింపి తోడి కోడళ్ల మధ్య ఆలోచనల్లోని వ్యత్యాసాన్ని హాయిగా చెప్పిన కథ.

స్త్రీ పురుషుల మధ్య ప్రేమ అంటే బాహ్య సౌందార్యాకర్షణ కాదని స్పష్టంగా చెప్పిన యద్దనపూడి సులోచనారాణి కథ 'ప్రతిబింబం'. స్వార్థరహిత స్నేహానికి, స్వార్థభరిత స్నేమానికి మధ్య వుండే వ్యత్యాసాన్ని చెబుతూ పాత్రల మధ్య స్నేహాన్ని మలచిన తీరు బావుంది. కానీ సులోచనారాణి పాత ప్రేమ కథల్తో పోలిస్తే ఈ కథ నిరాశ కలిగిస్తుంది.

శ్రీ విరించి 'మీరనిమేరలు' కథ అభిమానానికి తక్కువలేని భార్యాభర్తల మధ్య పంతాలు, పట్టింపులకు కొదవేముంటుంది? అందుకు ఎవరి కారణాలు వాళ్లకి వున్నా

సహజీవనం ముఖ్యం అని చెబుతుంది. భార్యాభర్తల మధ్య సామరస్యం కుదర్చడానికి అంతకు ముందు పరిచయం లేని వాళ్ళు కూడా ఎంతో మంచితనం చూపగలరు అని శీర్షికకు న్యాయం చేకూర్చిన ఈ కథలో నాటకీయత ఎక్కువ.

ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరిగి తిరిగి విసిగి వేసారిన జనం వద్దకు ప్రభుత్వ యంత్రాంగమే స్వయంగా తరలివస్తే దొరలే సేవకులు కాక తప్పదనీ ఆమేరకు అటు ప్రభుత్వం, ఇటు ప్రజలు స్పందించాలనీ చెప్పిన కథ బోయ జంగయ్య 'తెల్లకార్డు'ఒక రేషన్ కార్డు కోసం ఓ దళితుడు పడ్డ పాట్లు, ఆ పాట్ల మధ్య ప్రభుత్వ యంత్రాంగం లొసుగులు, ప్రభుత్వోద్యోగుల అవినీతి, అరాచకాల్ని బట్టబయలు చేసిన సామాజిక స్పృహ వున్న కథ.

సి. ఆనందరామం కథ 'ఎర్రగోగుల ఎర్రెమ్మ' సర్వస్వం వదులుకుని ప్రాణాలు పణంగా పెట్టి పోరాడినప్పటికి తెరమరుగున వుండిపోయిన స్వాతంత్ర్య వీరుల కన్నీటి వెతలను తెర ముందుకు తెచ్చిన కథ. కథ వాస్తవానికి కాస్త దూరంగా వున్నా ప్రశంసనీయంగా వుంది. నిజానికి రెండవ ప్రపంచ యుద్ధంలో భారతీయ, సిపాయిలను కథలో చెప్పినంత నికృష్టంగా ఏం చూడలేదు.అయితే ప్రతి విషయంలోనూ బ్రిటిష్, ఇండియన్ అనే తేడా మటుకు స్పష్టంగా వుండేది, కథలో చెప్పినట్లు సింగపూర్ ఆపరేషన్స్‌కు నాయకత్వం వచ్చింది జర్మన్‌లు కాదు. జపాన్‌వారు, అయితే అప్పట్లో రెండో ప్రపంచయుద్ధంలో భారతీయ సైనికుల పాత్ర, ఆ తర్వాతి పరిణామాలు స్వాతంత్ర్యం రావడానికి దోహదపడిన నిజాన్ని వాళ్ళు దాచిపెట్టారు. ఆ నిష్ఠూర నిజాన్ని ఆనందరామం తన కథానిక ద్వారా వెలుగులోకి తేవడం ప్రశంసనీయం.

బి.ఎస్. రాములు 'దుస్తులు' కథలో రచయిత విప్పి చెప్పిన తాత్విక సూత్రం పాఠకుల్ని బాగా ఆలోచింపజేస్తుంది. మనిషి భౌతికంగా, మానసికంగా ఎన్నో ముసుగులతో బతుకుతుంటారు. వాటినన్నిటినీ పక్కన బెట్టి తనను తాను చూసుకోవడం అతనికి భయం. ఆ తొడుగులు వదిలిపెడితే ప్రేమ, మానవత్వం పొంగుకొస్తాయి అనే తాత్వికతను ఓ ఎమ్.ఆర్.ఓ పాత్రచిత్రణ ద్వారా వ్యవస్థ లేని లోటు పాట్లను విశ్లేషిస్తూ, విమర్శిస్తూ సమర్థవంతంగా ప్రతిపాదించారు రచయిత.

ఒక్కోసారి ఆవేశంలో మాట్లాడే మాటలు ఎదుటి వ్యక్తినే కాదు, ఆ తర్వాత మనల్నీ బాధిస్తాయి. అప్పుడు పశ్చాత్తాపపడినా ప్రయోజనం వుండదు. అన్నీ తెలిసుండి అలాంటి బాధకు గురైన ఓ రిటైర్డ్ పెద్దమనిషి వీరభద్రరావు "నిన్ను నువ్వు తెలుసుకో"కాలుజారినా తీసుకోవచ్చు గానీ నోరుజారితే తీసుకోలేం అన్న సామెతను అక్షరాలా నిజం చేసే కథ

ఇది. పాత్రలు, సన్నివేశాలు, సంఘటనలు చాలా సహజంగా కదుల్తాయి. రోజూ జరిగే చర్చల్లో అలవాటు ప్రకారం పరదేశిగార్లు నోరు పారేసుకోవడం ఆ మాటలకి సున్నిత మనస్కుడయిన శంకరం గారికి పక్షవాతం, గుండెపోటు వచ్చి మరణించడం, జరిగిందానికి పశ్చాత్తాపపడిన పరదేశి ప్రాణం వుండగా శంకరాన్ని క్షమాపణ వేడలేక ఉద్వేగంతో చనిపోవడం పాఠకుణ్ణి ఆ వాతావరణంలోకి తీసుకెళ్ళి తస్మాత్ జాగ్రత్త అని హెచ్చరిస్తుంది.

మంచికథ అంటే దరిద్రం, ఆకలి, కన్నీళ్ళు, కష్టాలే అని కాకుండా యువతీ యువకుల ప్రస్తుత సమస్యల్ని, వాటి పరిష్కారాలను ప్రస్తావించే కథలు రావల్సిన ఆవశ్యకత ఎంతో వుంది, నేటి కథ యువతకు మార్గదర్శకం కావాలి.



# సుప్రభాతం వారపత్రిక

1997వ సంవత్సరంలో ప్రచురితమైన సుప్రభాతం సంచికలలో వచ్చిన కథలలో వైవిధ్యం ఉంది. సహజత్వానికి సన్నిహితంగా వ్రాసిన కథలు, మనసును స్పదింపచేసే కథలు ఆసక్తిగా చదివింపచేశాయి. 1997 లో దాదాపు నవంబరు వరకు పక్ష పత్రికగా వచ్చి, సంవత్సరాంతం నుంచి ఇది వారపత్రికగా వెలువడుతున్నది. (ఇందులో వివిధ శీర్షికలు - యువతరంగం, వివాదం, కళ, స్పెషల్‌రిపోర్ట్) వంటి వాటితో పాటు ఒక కథ ప్రచురిస్తున్నారు) వాస్తవ చిత్రణలు, మధ్య తరగతి జీవితాలు, తరాల అంతరాలు, మానవత్వం, బాలకార్మికుల కథ, లంచాల కథ - ఇట్లా అనేక దృక్కోణాల్లో వ్రాసిన 21 కథలను సమీక్షార్థం చదవడం జరిగింది. కొన్ని సాధారణమైన కథలు, కొన్ని చాలా మంచి కథలు ఉన్నాయి. నిత్యజీవితానికి దగ్గరగా మనసు స్పృశించే రీతిలో కథలు అందించిన వారిలో ముఖ్యంగా గొరుసు జగదీశ్వరర రెడ్డి, ఎమ్బీఎస్ ప్రసాద్, డి. వెంకట్రామయ్య, బమ్మిడి జగదీశ్వర్రావు, బీనాదేవి గార్ల పేర్లు చెప్పుకోవచ్చు. ఇందులో డా వి. చంద్రశేఖర్ రచించిన కథలు 3, బమ్మిడి జగదీశ్వరరావు రచించిన కథలు 2 ఉన్నాయి.

తరాల అంతరాలను 'తరాలూ, తీరాలు' కథలో ఎమ్బీఎస్ ఒక ప్రత్యక్ష దర్పణం గా రచించారు. ఒకప్పుడు తల్లిదండ్రులకు తాను కలిగించిన బాధ తనకు పిల్లలు పుట్టి వాళ్ళూ అట్లా ప్రవర్తించినప్పుడు గానీ తెలియకపోవడమనే అంశాన్ని ఆధారంగా రచయిత చిత్రించిన తీరు ఎంతో బాగుంది. ఆనాడు తండ్రి తనను వదిలి హైద్రాబాదులో ఉద్యోగానికి వెళ్తానన్న కొడుకును వెళ్ళొద్దనీ, ఉన్న చోటే ఏదైనా ఉద్యోగం చూసుకోవచ్చనీ ఎంతగానో బతిమాలుతాడు. కానీ కొడుకు వినకుండా హైదరాబాదు వెళ్ళి సెటిలైపోతాడు.

ఎప్పుడో గానీ వచ్చి చూడ్డానికి కూడా కుదరనంత బిజీ అయిపోతాడు. ఈ రోజు తన కొడుకు అమెరికాలో ఉద్యోగం వచ్చింది వెళ్తానంటే ఉన్న ఒక్క కొడుకూ అంతదూరం వెళ్లిపోతే ఒంటరివాడ్నై పోతానన్న బెంగతో, బాధతో కొడుకు ప్రయత్నాలు అడ్డగిస్తాడు. ఏళ్ళు గడిచినా ఊళ్ళు, ప్రాంతాలు, పరిస్థితులు వేరైనా విషయం అదే. ఇది పాతతరం వాడైనా తన తండ్రి అర్థం చేసుకుని కొడుకుకు నచ్చచెప్తాడు. ఈ మూడు తరాల తాత, తండ్రి, కొడుకుల సంఘర్షణను ఎమ్బీఎస్ మంచి శైలితో, చక్కటి కథనంతో ఒక కనువిప్పుగా రచించారు.

వైజాగ్‌లోని జగదాంబా జంక్షన్‌ని స్క్రీన్‌మీద చూస్తున్న అనుభూతి కలిగించాడు రచయిత గొరుసు జగదీశ్వరరెడ్డి 'జగదాంబా జంక్షన్' కథలో. జంక్షన్‌లో కూర్చుని గురమ్మ ఉడికించిన పెండలం దుంపలను ఏళ్ళ తరబడిగా అమ్ముకుంటూ తన జీవితాన్ని గడపడం, అక్కడ వచ్చే పోయేవాళ్ళతో ఆమె మాట్లాడే తీరు, అందర్నీ అదిలించి పనిచేయించుకునే మనస్తత్వాన్ని, పేదరికంలో గురమ్మ పరిస్థితులను దుంపలమ్మితే వచ్చిన డబ్బును రెండు మడతలేసిన పాతబట్టల మధ్య దాచిపెట్టడం సహజంగా ఉంది. సిట్టి, రాజులతో దబాయించి పని చేయించుకుంటుంది. కానీ ఓ దుంప కూడా ఇవ్వదు. అదే, ఆమె మనవడు సినిమాకు వెళ్ళడానికి ఈమె సాయంత్రం వరకు కష్టపడి అమ్మిన సొమ్మంతా ఎత్తుకుపోవడమనే బాధాకరమైన సంఘటనతో కథ ముగుస్తుంది.

బమ్మిడి జగదీశ్వర్రావు కథలు రెండు ప్రచురితమయినాయి. ఒక కథపేరు పెనం, రెండోది మూడో ప్రపంచ యుద్ధం. 'పెనం' మధ్యతరగతి ఇల్లాలు నాన్‌స్టిక్ పెనం కొనాలని ఆశపడుతుంది. ఎన్నో ప్రణాళికలు వేసి ఎంతో కష్టపడి కొంటే తీరా అత్తగారు ఆ పెనాన్ని ఇసుక, బూడిద కలిపి తోమడం చూసి గుండెలు బాదుకుంటుంది. అతి స్వల్పమైన కోరికలు కూడా తీరని సగటు మనిషి కుటుంబం ఒక చిన్న వస్తువు కొనడానికి పడే పాట్లు రచయిత చక్కగా చిత్రించాడు.

మూడో ప్రపంచయుద్ధం కథ కూడా నేడు అతి ప్రభావవంతమైన ప్రసారమాధ్యం టీ.వీ. ప్రభావం సమాజం మీదా, ప్రజల మీదా ఎంతగా ఉందో ప్రతిభావంతంగా చిత్రించాడు రచయిత. ఇందులో కథానాయకుడు గోపాలకృష్ణ బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా రోజుల తరబడి టీవీలో ఛానల్స్ మారుస్తూ గదిలో ఉండిపోతాడు. తల్లి అనారోగ్యంగా ఉన్న ఉత్తరాలు, ఆ తరవాత చనిపోయిందన్న ఉత్తరం కూడా చూసుకోడు. పక్క ఇంటి పిల్లవాడు లెటర్ రైటింగ్‌లో సహాయం కోసం వస్తే అప్పుడు ఈ ఉత్తరాలు చూసినా 'సినిమాలో అప్పటికి తొమ్మిది హత్యలు చూశాక ఆ చావు ఏమంత భయపెట్ట లేదు... ఇప్పుడు తల్లి చావు ఒక మామూలు విషయంగానే ఉన్నట్లు - ఏ

స్పందనా లేక ప్రశాంతంగా ఉన్నాడు - అంటాడు రచయిత. రిమోట్ చేతివేళ్ళు ఆపరేట్ చేస్తున్నాయో, చేతివేళ్ళని రిమోట్ ఆపరేట్ చేస్తున్నదో అర్థం కాలేదు అవినాష్ తోటరాజులకు. ఇది చివరి వాక్యం. టీ.వీ. కలిగించిన స్తబ్దతకు, మానసికంగా బలహీనపరచిన విషయాన్ని రచయిత పాఠకులు స్పందించే రీతిలో రాశాడు.

ఇటీవలి కాలంలో వర్ధమాన రచయిత్రిగా అనతికాలంలో చాలా కథలు రాసిన రచయిత్రి దోనేపూడి ప్రేమ్‌దులారి. తక్కువ నిడివి చిన్న కథలు వ్రాయడం ఈమె ప్రత్యేకత. మనసు మంచిదైతే అందర్లోనూ మంచితనం చూడగలం - అన్న సూక్ష్మాంశాన్ని 'ఎంత తేడా' కథలో విశ్లేషించింది రచయిత్రి. పనిమనిషి రంగి రెండు వందలు అడ్వాన్సడిగితే ఆ ఇల్లాలికి విసుగొచ్చింది. కానీ ఆమె మరొకరికి సాయం చేసే ఉద్దేశంతో అడిగిన వైనం తెలుసుకుని తిరిగి ఇవ్వక్కరలేదని ఆ రెండొందలూ ఇవ్వడమనే సహృదయత గల వ్యక్తి స్పందనను రచయిత్రి ప్రత్యక్ష పరిచింది.

ఈసంచికలలో డా. వి. చంద్రశేఖరరావు 3 కథలు చోటు చేసుకున్నాయి. 'నలుపు', ఎక్కడకుపోతావీ రాత్రి.

'నలుపు' కథలో ఒక దళిత యువతి కథను గొప్పగా చిత్రించాడు రచయిత. గురువు స్థానంలో ఉండి లక్ష్మి అనే ఇంటర్మీడియెట్ విద్యార్థిని జీవితం నాశనం చేస్తాడు రమేష్ అనే లెక్చరర్. సల్ఫ్యూరిక్ ఆసిడ్ పోసి అతణ్ని శిక్షించడం ఆమెలోని బాధకు, ఆవేదనకు పరాకాష్ఠ. వార్డెన్ మానవత్వం లక్ష్మితో పాటు హాస్టల్‌లో ఉన్న విద్యార్థినులకు ఓదార్పునిస్తుంది. 'లేవండి, లేచి స్నానం చేయండి. పై నుంచి కాకి రెట్ట వేసింది. కడుక్కున్నాం, పోయింది' అంటుందామె. అయితే కాకిరెటలా, పీడకలలా ఆ సంఘటన మరచిపోతే వార్డెన్ చెప్పినంత సులభంగా తీసుకోలేని లక్ష్మి అంతర్మథనం రచయిత చిత్రించిన తీరు అమోఘం.

ఈ కథలో ఒక రకమైన అంతర్మథనం ఉంటే 'ఎక్కడికి పోతావీ రాత్రి' కథలో మరో రకమైన సంఘర్షణాత్మకమైన పాత్రకు జీవం పోశాడు రచయిత. చాలా టెన్షన్ కలిగించేలా, ఆవేదనాభరితంగా రాసిన కథ. పెద్దనాన్న కొడుకును ప్రేమించి పెళ్ళిచేసుకున్న దంపతులకు పుట్టిన శంకర్ చిత్రమైన మనస్తత్వ పరిశీలన కథాంశం. ఎన్నెన్నో మలుపుల తరువాత ఒక ఉద్యమంలో ఒంటిమీద కిరోసిన్ పోసుకుని అంటించుకుని తగలబడిపోతాడు. తనలోని మనోవేదన గురించి చెప్తూ తన తల్లి వాంఛకు ప్రేమ అని పేరు పెట్టి ఇన్‌సెస్ట్ మ్యారేజీ చేసుకుంది. నిప్పులగుండంలో నడిచింది. 40 ఏళ్ళుగా ఆ నిప్పులగుండంలో నేనూ తగలబడుతున్నాను. ఐ హేట్ హర్ అని ఆక్రోశిస్తాడు. 'నాకో శుద్ధమైన, సాంప్రదాయ

బద్ధమైన ప్రపంచం కావాలి. నాకో అమ్మ కావాలి. పురాతన సమాజం కావాలి. అంతులేని ఈ సంఘర్షణకు కారణం వరస తప్పిన సంబంధాలు, కథానాయకుడి బాధ మనకు అనుభవయోగ్యం చేశాడు రచయిత.

'లెనిన్‌ప్లేస్' అనే కథలో కమ్యూనిజం మీద ప్రేమతో తన ఇంటికి లెనిన్ ప్లేస్ అని పేరు పెట్టుకున్న ఒక ఆశావాది కథ.

భరాగో రాసిన 'సారంగ్ తేరీ యాద్‌మే' కథలో స్వాతంత్ర్య సమరయోధుడి సర్టిఫికెట్టు తెచ్చుకుని వీరుడై పరాక్రమంతో దురాక్రమణ తలపెడ్తే మరి స్వయంగా మంత్రిగారే కథ నడిపిస్తే ఆ కథ ఇది.

ఓల్గా తన 'నూరేళ్ల నిశ్శబ్దం కథ' లో నేడు రూపుదిద్దుకుంటున్న అనేక సౌఖ్యాలను రచయిత్రి వ్యంగ్య ధోరణిలో చెప్తూ 'ఈనాడు ప్రపంచంలో సుఖదుఃఖాలకు కూడా ఒక నమూనా తయారైంది' అనడం నేటి పరిస్థితుల వాస్తవ చిత్రణకు ప్రతిబింబం. కూతురికి అమెరికా సంబంధం చెయ్యాలని తల్లిదండ్రులు అభిలషిస్తారు. ఈ రోజుల్లో అమెరికా వెళ్ళాలనీ, అమెరికా సంబంధం చెయ్యాలన్న తపన చిత్రించింది రచయిత్రి. కూతురికి ఒక అమెరికా సంబంధం ఖాయం చేసి చేసుకుతీరాలని పట్టుబడ్తే కూతురు ప్రతిఘటిస్తుంది. అయితే పాతతరంలో నాయనమ్మ మనవరాలికి బాసటగా నిలిచి ఎన్నో ఏళ్ళకు నోరు విప్పింది. ఈ సంఘర్షణను రచయిత్రి ప్రతిభావంతమైన శైలితో చిత్రించింది.

'పేగు బంధం' కథలో పద్మినీవర్దన్ ఒక పేదతల్లి కొండమ్మ వేదనను చక్కగా వర్ణించింది. 'వాల్ల పిల్లోడు వాల్లకు ముక్యమనుకున్నారే కానీ ఆ పిల్లోన్ని పొద్దుగూకులూ సూసుకునే పిల్లా ఓ అమ్మగన్న బిడ్డే అనుకోకపోయిరే' - అని చనిపోయిన కూతురి కోసం కొండమ్మ విలపిస్తున్న బాధ పాఠకుడి మనసుకు తాకేట్లు వర్ణించింది రచయిత్రి.

వైశాలి, డి.ఆర్. ఇంద్ర రచించిన 'భూకంపం' కథలో కష్టపడడానికే అంకితమైన స్త్రీని మగమహారాజెంతగా ఎక్స్‌ప్లాయిట్‌చేస్తాడో చెప్పారు. తాను కన్న కలలు కల్లలైపోతుంటే వేసారిన నాయిక చివరికి 'ఈ ఇంట్లో తినే నోళ్ళెన్ని ఉన్నాయో వాటికి రెట్టింపు చేతులున్నాయంటూ' ఒక్కసారిగా ప్రతిఘటించడం భర్త వెంకట్రావుకి భూకంపం వచ్చినట్లుంది. నోరు మూసుకుని తలఒగ్గి చేసినన్నాళ్ళు మగాడట్లానే సాగించుకుంటూ ఉంటాడు. కానీ స్త్రీ యంత్రం కాదుగా. భూకంపం రావలసిందే మరి.

డి. వెంకట్రామయ్య 'పండగొచ్చింది' కథలో ధనవంతులకీ, పేదవాళ్ళకీ తేడాను కడుపు తరుక్కుపోయేలా రచించాడు. ధనవంతుడైన రాజారావు కొడుకు బాబ్జీ ముద్దుగా చాక్లెట్ కొనిపెట్టవా నాన్నా అన్నంత తేలిగ్గా కొత్తకారు కొనిపెట్టమని అడిగితే

ఆయనకో్కపమొచ్చిందట. ఎందుకూ? విమానం కొనిపెట్టమని కొడుకు అడగనందుకు. అదే రంగమ్మ కొడుకు మూడేళ్ళ పోలిగాడు 'అమ్మా బువ్వెట్టవే' అని అడిగితే మంచినీళ్ళడక్కుండా బువ్వెట్టమని అడిగినందుకు తన చేతకానితనానికి ఏడుపొచ్చింది. ఏమీ మాట్లాడలేకపోయింది. ఈ వ్యత్యాసాన్ని రచయిత సహజంగా చెప్పారు.

కుప్పిలి పద్మ రచించిన 'ఆకాంక్ష' కథలో ప్రారంభంలో బాల్యానుభూతులు, స్పందనలు ఎంతో స్పందనతో రచించారు. ఆకాంక్ష ఆధునిక యువతి. చైతన్యానికి మారుపేరుగా ఉద్యోగనిర్వహణలో ఆమె చాకచక్యానికి ఆకర్షితుడైన నిహార్ ఆమెను అభినందించి, చేరువవుతాడు. కానీ మరో అమ్మాయి మందిరను చూశాక ఆకాంక్ష తనను నిర్లక్ష్యం చేసినట్లు భావిస్తుంది. కాన్ఫరెన్స్ రెండోరోజు తానాశించని విధంగా ఫస్ట్‌పేపర్ ప్రెజెంట్ చేయడం, దానికి అనూహ్యమైన రెస్పాన్స్ - ఆ వెంటనే ఆమెను జి.ఎమ్. మార్కెటింగ్ గా అప్పాయింట్ చెయ్యడం కొసమెరుపు.

గురజాడ శోభాపేరిందేవి వ్రాసిన 'లంచావతారం' కథలో ప్రస్తుత జీవితాల్లో లంచం పాత్ర ఎంతగా పెరిగిపోయిందో వివరించింది. లంచాన్ని ప్రోత్సహించకూడదనుకున్న ఒక పోలీసు అడుగడుగునా ఎదుర్కొన్న సమస్యలు, కుటుంబ బాంధవ్యాలు కూడా లంచం మీదే ఆధారపడుతున్నాయనీ, చివరికి దేవుడే దిగివచ్చినా లంచావతారంతోనే వస్తాడని పోలీసుపాత్రతో రచయిత్రి కథనం. ఇది పోలీసు వ్యవస్థకు, లంచాలకూ ఉన్న సంబంధం వివరించే కథ.

బీనాదేవి రచించిన 'వ్యయంలో ధనాధిపతి' కథలో నరసింగరావు ఒక లాయర్. వ్యాపారం మీద మోజు. మధ్య తరగతి కుటుంబం. పత్తిపంట కోసం భార్య ఒడ్డాణం తాకట్టుపెట్టి స్నేహితుడు చలపతికి డబ్బిస్తే అతను ఎగవేయడం, ఆ దెబ్బతో నరసింగరావు వ్యాపారం, వ్యవసాయం అనడం మానేసి 'వ్యయంలో ధనాధిపతి ఉన్నాడని సరిపెట్టుకుంటాడు. భర్తకు బుద్ధి వచ్చినందుకు భార్య సంతోషిస్తుంది. మధ్యతరగతి జీవితాల్లో బలహీనతలకు ఉదాహరణగా నిలుస్తుందీ కథ.

కార్మిక వ్యవస్థలోని లోపాలను ఎత్తిచూపుతూ ఆత్మవిమర్శ పంథాలో నడిచిన కథ కోడూరి విజయకుమార్ రచించిన గోర్కీ చెప్పిన కథ. కార్మికుల్లో లోపాలు, పనిమీద వాళ్ళల్లో కొంతమంది ప్రదర్శించే అశ్రద్ధ, వీరి పనుల్లో రాజకీయ నాయకులు కల్పించుకోవడం అనే అంశాలు చిత్రించాడిందులో రచయిత.

శ్రీ రంగం ఎ. శ్రీనివాసరావు రచించిన 'ఆత్మవంచన' కథలో వ్యక్తి సైకాలజీని విశ్లేషించిన తీరు బాగుంది. భార్య చనిపోయిన భాస్కరం తన అవసరం కోసం, తన

...ఖం కోసం మళ్ళీ పెళ్లి చేసుకుంటాడు. కానీ, ప్రతి క్షణం తాను సమాజం కోసం, పిల్లల ...ం పెళ్ళి చేసుకున్నట్లు ఒప్పించే ప్రయత్నం చేస్తుంటాడు. చనిపోయిన భార్య రాధను ...స్కారం సుఖపెట్టింది లేదు. తాము అన్యోన్యంగా ఉండేవాళ్ళమని చనిపోయాక ...పోవడం కూడా అతణ్ని అతడే మభ్య పెట్టుకోవడం. ఆత్మవంచన తగదనీ, ఇకనైనా మారమనీ రచయిత స్నేహితుడిగా సలహా ఇస్తాడు.

'దేవుడిచ్చిన తమ్ముడు' కథలో రచయిత రాధామనోహరన్ బాలకార్మికుల స్థితిగతులను విశ్లేషణా పూర్వకంగా రాశాడు. ఇంట్లోనే బాలకార్మికుణ్ణి ఉంచుకుని సమాజంలో బాలకార్మికులపై సర్వేకి వెళ్తాడిందులో నాయకుడు. అక్కడి హృదయవిదారక దృశ్యాలకు చలించి, ఆత్మావలోకనం చేసుకుని తన ఇంట్లోనే ఉన్న రామును దేవుడిచ్చిన తమ్ముడిగా భావించి ఐ.ఏ.ఎస్. అధికారిని చేస్తాడు. ఇరవై ఏళ్ళనాటి కథను స్మరించుకుని ఆ అనుభవాలను పాఠకులకు అందించాడు రచయిత.

వాడ్రేవు వీరలక్ష్మీదేవి కథ 'ప్రభావం' ఒక రచయిత్రి కథ. ప్రహిరాజు రాధాకృష్ణ వ్రాసిన 'భగవంతుడు' కథలో దేవుడున్నాడా లేడా అని వాదించుకోవడం ఎంత అజ్ఞానమో, మూర్ఖత్వమో ఆ క్షణంలో అవగతమయింది' అంటూ జ్ఞానజ్యోతి వెలిగిందంటాడు రచయిత.



# 'స్వాతి' సపరివారపత్రిక

కథ రాసిన ప్రతివాడు రచయిత కాడు. పద్యం వ్రాసిన ప్రతివాడు కవికాడు. మనం ఏవిటి రాస్తున్నాం, ఎందుకు రాస్తున్నాం ఎవరికోసం రాస్తున్నాం అన్నది రచయితకి అవగాహన ఉండాలి మరి.

సామాజిక స్పృహమాట దేవుడెరుగు ఒంటి మీద స్పృహ ఉంటే మంచిది.

మంచి మనిషి జీవితంలో సెక్సు, శృంగారం, ప్రేమ, యివన్నీ కొన్ని భావాలు మాత్రమే.

కాని ఈ మధ్య వస్తున్న కథల్లో సెక్సు మోతాదు ఎక్కువైందేమో అనిపిస్తుంది.

తెల్లవారిలేచింది మొదలు మనకి పొద్దున్న పనిమనిషి, పాలపాకెట్టు మొదలు అన్నీ సమస్యలే.

జీవితం సమస్యల పుట్ట అయిపోయింది. బ్రతుకు ఒక వ్యాపారం అయి పోయింది. రాస్తే, రాయగలిగితే ఎన్నో సమస్యలున్నాయి.

రచన గ్లామరు కోసం కాకుండా ప్రయోజనం కోసం ఉపయోగిస్తే బావుంటుంది. సాధారణంగా ఒక వార పత్రికలో సంవత్సరానికొకటి కనీసం వంద కథలొస్తాయి. అందులో పదికథలు బావున్నవి ఎంచమంటే కష్టం అయితే అక్కడక్కడ ఒకటీ అరా మంచి కథలు లేకపోలేదు.

అలాంటిదే ఎన్. శివనాగేశ్వర్రావు రాసిన 'రంగసాని' (24-10-97) కథ.

మంచితనానికి కులానికీ ఎలాంటి సంబంధంలేదు.

మనిషి గొప్పతనం అతని కులం వల్లకాదు. అతని వ్యక్తిత్వం, మంచితనం వల్ల వస్తుంది. రంగనాయకి వేశ్య. రాయుడు ఆమెని ఆ వృత్తి నుండి రక్షించి తెచ్చి తన దగ్గర పెట్టుకుంటాడు. రంగనాయకి అతని మనసెరిగి నడుచుకుంటుంది. రాయుడుకి పేకాట పిచ్చి. డబ్బంతా పేకాటలో పోగొట్టుకుంటూ ఉంటాడు. అయితే రాయుడు డబ్బు రంగనాయకి కోసం, పేకాట కోసం తగలబెట్టేస్తున్నాడని అనుకుంటారు. రాయుడి చేత అతని తోట రంగనాయకి తన పేర రాయించుకుంటుంది. రాయుడు చనిపోతాడు. అప్పుడు రంగనాయకి ఆతోట రాయుడి భార్యపేర రాసిచ్చేసి తను మరో ఊరు వెళ్లిపోతుంది. రంగనాయకి పుట్టింది వేశ్య కులంలో అయినా చాలా మంచి మనసున్నది. రాయుడు భార్య బిడ్డలకే లేకుండా ఆస్తి తగలేస్తున్నాడని తెలిసి తోటతన పేర రాయించుకుంటుంది కాని తనకోసం కాదు.

మనిషికి ఉండవల్సింది మానవత్వం మంచితనం కాని కులం, డబ్బు కాదు. ఇది మంచి కథ అనే చెప్పొచ్చు.

అమెరికా వెళ్ళాలంటే అబ్బాయి ఏ పరీక్ష పాసవ్వక్కర్లేదు గ్రీన్ కార్డున్న అమ్మాయిని పెళ్లి చేసుకుంటే ఎంచక్కా దాని కొంగు పట్టుకొని ఎగిరిపోవచ్చు.

అలాగే గిరిజనులుండే పొలాలు, కొండలు వగైరాలు సంపాదించాలంటే అక్కడి పిల్లని పెళ్లి చేసుకొని వాళ్ళలో ఒకడైతే అవన్నీ సంపాదించే హక్కు వస్తుంది. ఈ సంగతి గ్రహించిన కృష్ణమూర్తి గాలికొండపురం వెళ్లి అక్కడి ప్రజలకి ఉచితంగా వైద్యం చేస్తాడు. ఫీజు తీసుకోకుండా హుండీ పెడతాడు. ఆ డబ్బుతో చిన్న ఆసుపత్రి కడతాడు. అదే ఊర్లో రత్నమేణి, రత్నమణి ఉంటారు. వాళ్ళు పట్నం వెళ్లి బియ్యం వగైరా సరుకులు తెచ్చి వాళ్ళ గూడేల్లో అమ్ముతూ ఉంటారు. కృష్ణమూర్తి వాళ్ళ ఇంట్లోనే ఉన్నా వాళ్లు అతన్ని ఎంత కవ్వించినా లొంగడు. అక్కడే పుల్లలేరుకొని అమ్ముకునే గూడెం అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. అప్పుడతనికి ఆదిమవాసులకుండే హక్కులుంటాయి. ఆస్పత్రిలో ఉండే శమంతకమణి అనే నర్సు కృష్ణమూర్తి భార్య అన్న సంగతి ఎవరికీ తెలియదు. ఇది చాలా తెలివైన దోపిడీ. ఎవ్వరూ పట్టుకోలేని దోపిడీ. ఇది వంశీ రాసిన 'ధారావాహికం' అన్న కథ (17-10-97) చాలా మంచి కథ. కథనంకూడా బావుంది. గిరిజనుల అమాయకత్వాన్ని కృష్ణమూర్తి ఎలా వాడుకున్నాడో బాగా చెప్పేరు.

సినిమాలు చూసి పిల్లలు ఎలా చెడిపోతున్నారన్న విషయం మీద ఇది వరకు "సుడిగుండాలు" సినిమా వచ్చింది. అదే థీమ్ మీద రాసిన కథ వియోగి రాసిన 'ప్రేరణ'

కథ (27-6-97). నలుగుర్రైదుగురు స్కూలు పిల్లలు ఒక అమ్మాయిని రేప్ చెయ్యబోయి చంపేస్తారు. వాళ్లు కోర్టులో ఎందుకు చేశారన్న ప్రశ్నకి సమాధానంగా" T.V. లో చూపించినట్టు ఏదైనా ఎడ్వెంచరు చేద్దామనిపించింది" అంటారు ఆ పిల్లలు, కేబిల్ ఛానల్స్ వచ్చేక హింస, సెక్సు ఎక్కువైపోయి చిన్న పిల్లలు పాడైపోతున్నారన్నది అందరూ ఒప్పుకుంటారు. అయితే దాన్ని ఆపే ప్రయత్నం ఎవరూ చెయ్యడంలేదు. పసిపిల్లల మనసులో అలాంటి భావాలు ప్రవేశపెట్టడం అమానుషం. సింగిల్ పేజీ కథ అయినా ఈ కథలో ఒక సందేశం ఉంది. ఒక ఉద్దేశం ఉంది.

పిల్లల మనస్తత్వం మీద రాసిన మరో సింగిల్ పేజీ కథ కొత్తడి గణపతిరావు రాసిన "బరువు" కథ (22-8-97).

సుందరం తండ్రి బస్తాడు మామిడికాయలు తోటనుండి భుజం మీద వేసుకొని మోసుకొస్తాడు. వాళ్ళపాలేరు రాలేదు. మరో పాలేరుచేత తెప్పించితే డబ్బు దండుగ "ఇదో పెద్ద బరువా?" అంటాడు. వాటిని పట్నంలో అన్న కూతురికిచ్చి రమ్మని సుందరాన్ని పంపిస్తాడు. బస్తా బరువైపోతుందని రెండు సంచులలోకి సర్దుతాడు. పట్నంలో బస్సుదిగిన సుందరం కొంచెం దూరం ఉన్న అక్కగారింటికి రిక్షా బేరమాడతాడు. రిక్షావాడు లాగలేక అవస్తపడుతూ ఉంటే "లాగటం కష్టంగా ఉందా ?" అనడుగుతాడు. దానికి ఆ రిక్షావాడు "ఈ మాత్తరం బరువు లాగలేకపోతే ఐదుగురుపిల్లల్ని, సంసారం ఎలా లాగుతాను బాబూ" అంటాడు. అప్పుడు సుందరానికి జ్ఞానోదయం అవుతుంది.

'డబ్బు విలువ శ్రమించి సంపాదించే వాడికే తప్ప, తీసుకొని ఖర్చు పెట్టే వాడికి తెలీదు. బాధ్యత తెలిస్తే తప్ప డబ్బు విలువ తెలీదు. అప్పుడు ఏదీ బరువనిపించదు' అనుకుంటాడు వెంటనే రిక్షాదిగి రిక్షావాడికి డబ్బు యిచ్చి సంచీలు తీసుకొని వెళ్తాడు.

ఇది కూడా మంచికథే,

పిల్లలకి బాధ్యతలు, విలువ నేర్పాలి. అప్పుడే వాళ్ళు మంచి పౌరులుగా తయారవుతారు.

ఈ కథ కూడా ఒక మంచి సందేశం యిస్తుంది.

ఇలాంటి ప్రయోజనం ఉండే కథలో, మానవతావిలువలు చెప్పే కథలో అవసరం తప్ప అర్థం పర్థం లేని ధనికొండ రవిప్రసాద్ రాసిన "అలాంటి దాన్ని కాదు" (18-7-97) లాంటి కథలో నిష్ప్రయోజనం.

ఒక అందమైన ఆవిడకి భర్త అందవికారి. ఆమె రోజూ గుడికి వెళ్తుంది. అక్కడ ఏదో కర్మ ముక్తి వగైరాలు మాట్లాడుకుంటారు. అక్కడి కొక సైకాలజిస్టు వస్తాడు. ఆమె,

ఆతను ఎన్నో విషయాలు మాట్లాడుకుంటారు. ఒకనాడు అతను ఆమెని ప్రేమిస్తున్నానని చెప్పాడు. ఆమె వద్దంటుంది. మర్నాడు అతను ఆత్మ హత్యచేసుకుంటాడు. పరమ పిచ్చి కథ. అతనలా ఆమెని ప్రేమిస్తూనే బతకొచ్చు. చచ్చిపోనక్కర్లేదు. పైగా భర్త ఎలాంటివాడైనా ఏ ఆడదీ అతన్ని వదిలి రావడానికిష్టపడదని సైకాలజిస్టుగా అతనికి తెలియాలి. ఇలాంటి కథలు రాయకపోవటమే మంచిది.

ప్రతిసారీ చెప్తున్నాను. మళ్ళీ మళ్ళీ చెప్తున్నాను. భాష సరిగా రాకపోతే కథలు రాయడానికి సాహసించకూడదు. తెలుగే అంతంత మాత్రంగా ఉన్నప్పుడు వచ్చీరాని ఇంగ్లీషు అసలు రాయకూడదు.

"కాసేపు రిలీఫ్ ఫీలయ్యేడు"

"పెళ్లి చేసుకుంటే అంత "ఎంజాయ్" ఉంటుందా?" లాంటి తప్పుడు ప్రయోగాలు మానేస్తే మంచిది.

ఏది ఏమైనా సాహిత్యం కాలక్షేపానిక్కాకుండా సమాజానికి పనికి వచ్చేదిగా ఉండాలని రచయితలు తెలుసుకోవాలి.



# జాగృతి వారపత్రిక

1997లో జాగృతిల్లో అచ్చయిన కథల నీ విధంగా విభజించవచ్చు.

భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంచిక కథలు, దీపావళి ప్రత్యేక సంచిక కథలు, ఇతర సంచికల కథలు, కాశ్మీర రాజతరంగిణి కథలు

ఈ కథా రచయితల్లో లబ్ధ ప్రతిష్ఠులు, కొత్తవారు కూడా ఉన్నారు. స్థాయి విషయానికొస్తే రెండు మూడు కథలు చాలా బాగున్నాయి.

భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంచిక కథలు :- ఆదర్శంగా ప్రవర్తించడం కొందరికే చాతవుతుంది. దానికి ఉన్నవాడు లేని వాడని తేడా లేదు. అదే భావం అడవి సూర్యకుమారి గారి "మాటలు దాటిన చేతలు" కథలో వ్యక్తమైంది.

రాజు, ప్రకాశం బాల్యస్నేహితులు. ఉద్యోగాల్లో ఉన్నారు. చిన్నప్పుడు చదువు చెప్పిన మాస్టారు నీతి, నిజాయితీలతో జీవిస్తున్నవాడు. అతడిప్పుడు అల్లుని ఆకస్మిక మరణంతో మానసిక క్షోభననుభవిస్తున్నాడు. పెళ్ళయిన కొద్దిరోజుల్లోనే వితంతువైన కూతురు శాంతిని చూస్తుంటే మాస్టారు గుండె తరుక్కుపోతుంది. దైవోపహతురాలైన శాంతిని రాజు, ప్రకాశం ఇద్దర్లో ఎవరన్నా ఒకరు పెళ్లాడితే ఆదర్శంగానూ, మాస్టారుకు మనశ్శాంతిగానూ ఉంటుందనుకుంటారు. కాని ఆ ఆదర్శాన్ని ఆచరణలో చూపాలంటేనే హడలిపోతారు. చదువు చెప్పించిన మావయ్య కూతుర్ని చేసుకుతీరాలి కాబట్టి తాను శాంతిని పెళ్లాడలేనంటాడు రాజు. వితంతువుతో వివాహాన్ని తన తల్లిదండ్రులసలే అంగీకరించరని, తనకది అసాధ్యమని వాదిస్తాడు ప్రకాశం. నువ్వంటే నువ్వు పెళ్ళి

చేసుకొమ్మని వాదించుకుని ఇద్దరూ మానుకుంటారు. రాజుతోపాటు వాళ్ల మావయ్య ఇంట్లో పెరిగిన కృష్ణకు ఉద్యోగమొచ్చి మాస్టారున్న ఊరికెల్తాడు. అతడే శాంతిని తన జీవితంలోకాహ్వానిస్తాడు. మోడైన శాంతి జీవితాన్ని మళ్లీ చిగురింపజేసి మాస్టారు మనసులో శాంతి నింపేస్తాడు.

యువతకు స్ఫూర్తినిచ్చే ఈ కథ పాఠకులను ఆలోచనలో పడవేస్తుంది.

వాతావరణ కాలుష్యానికి వంతలు పాడే నగరాల్లో మధ్య తరగతి మనుషుల జీవితం పైనపటారం లోనలొటారంలాగుంటుంది. కొన్ని అంతస్తుల బంగళాలో ఎన్నో చిన్నపోర్షన్లు అమర్చి, ఇల్లు మీ సొంతం చేసుకోండని పెట్టుబడిదార్లు, కంట్రాక్టర్లు ప్రకటనలిస్తారు. నగరంలో సొంతిల్లు సమకూర్చుకోవడమంటే నేరుగా స్వర్గసౌధములో అడుగుపెట్టినట్లు సంతోషించే మధ్యతరగతి వాళ్లు వాటిని ఎగబడి కొంటారు. అప్పో సప్పో చేసి అపార్ట్‌మెంటులో ప్రవేశిస్తారు. అప్పుడు ప్రారంభమౌతాయి అసలు కష్టాలు. అపార్ట్‌మెంటు జీవుల అధోగతికి అద్దం పట్టే చంద్రశేఖర్ ఆజాద్ కథ "దుర్గంధం".

32 అపార్ట్‌మెంట్సున్న బంగళా ముందు చచ్చిపడున్న కుక్క శవం కుళ్ళిపోయి దుర్గంధం ఎగజిమ్ముతూంది. అప్పటికే ఆ శవాన్ని పురుగులు చుట్టుముట్టి కెలికి కకావికలం చేస్తుంటాయి. అన్ని పోర్షన్లలో అమోఘంగా నిండిన దుర్వాసనను భరించలేక అందరూ బాధపడ్తుంటారు. ఆ వాసనను తరిమేసేందుకు అగరొత్తులు వెలిగిస్తారు. సెంట్లు చల్లుతారు. అందుకోసం వందల కొద్దీ రూపాయలు ఎవరికి వారు ఖర్చు చేస్తుంటారు, కాని ఎవ్వరూ ముందుకొచ్చి ఆ శవాన్ని ఎత్తి వేయించరు. మున్సిపాల్టీవాళ్ళు చెయ్యాల్సిన పనిని నేనెందుకు చెయ్యాలనుకుంటారు. ఏ మున్సిపల్ వర్కర్‌కో పదో పరకో ఇచ్చి పని చేయించుకునేందుగ్గూడా ఇష్టపడరు. చివరికో ముసలి అస్పృశ్యుడు (ఎవడో, ఎక్కడివాడో తెలీదు) దాన్ని ఎత్తి పారేస్తాడు.

దీపావళి ప్రత్యేక సంచిక కథలు :- ఈ సంచిక కాశ్మీర రాజతరంగిణి కథను కలిపి నాలుగు కథల్ని సంతరించుకుంది.

తప్పో ఒప్పో ఒక మాటను నాల్గుసార్లు ఉచ్చరిస్తే అది మెదడు పొరల్లో కూచుండిపోతుంది. మానసిక శాస్త్ర వాస్తవాన్నుటంకించే కథ "రెండు రెళ్లు ఐదు"

ఉత్తమ కథకులుగా, అత్యుత్తమ కథా విమర్శకులుగా అందరికీ తెలిసి, ఇటీవలే స్వర్గస్థులైన శ్రీ ఆరెస్కే మూర్తి గారి సాహితీ వనములో విరబూసిన చివరి కథాపుష్పమిది.

ఓ రోజు క్లియోపాత్ర తనకిచ్చిన ఐదు చేగోడీలను తరగతి గదిలో స్మరించు కుంటున్న విద్యార్థి మావుళ్ళయ్యను టీచరు "రెండు రెళ్లెంత?" అని అడగ్గానే ఐదు అని

తకీన జవాబిస్తాడు. అతని బాబాయి గారింటి రెండు పోర్షన్లలో అద్దెకున్న రెండు జంటలు గూడా గుర్తుకొస్తాయి.సరోజ, రమ్మ ఉరఫ్ రమాదేవిలు తన బాబాయిని బాబాయని పిలుస్తూ, భర్తల్ని మావగారని పిలువమంటారు. ఆ రెండు జంటల మధ్య తానూ కలిస్తే ఐదు... అది గూడా అప్పుడే బుర్రలోంచి బురబురా పొంగుకొస్తుంది. కాబట్టి రెండు రెళ్ల ఐదే సరనుకుంటాడు. ఇదో చిన్న కథ. ఇది మధ్యలో ఆగిపోయిందేమో ననిపిస్తుంది.

మాటలతో, కథనముతో పాఠకుల మనసులు దోచుకోవడం ఆరెస్కే గారి కలవాటే. "మొహం కుంకుమ పూవులా చేసుకుని" "కాఫీ బదులు కాపు సారా పుచ్చుకొచ్చారేమో" లాంటి సంభాషణ లందుకుదాహరణలు.

బాలల మనోవికాసానికి బాటలు వేస్తున్న చిట్టా దామోదర శాస్త్రి గారి 'ముహూర్తం' కథ, కథలా కాకుండా పెళ్లిముహూర్తం ప్రాధాన్యతను వివరించే సంవాదం లాగుంది. కథలో కథ లేదు.

సామాజిక చైతన్యాన్ని అందరూ ఆశిస్తారు కాని అదెలా వస్తుంది? ఎవరికి వారే ఇసుకలో తలదాచుకున్న ఉష్ట్రపక్షిలా బ్రతుకుతూంటే అదెలా సాధ్యం? వ్యక్తిలో నైతిక విలువలు మాయమవుతూంటే కుటుంబం కుంటుబడుతుంది. సమాజం పతనం దారిలో పయనిస్తుంది. దాంతో సమాజంలో చేవ చచ్చిపోతుంది. నేడు మహానగరాల్లో మాయగాళ్లుగా, జూదగాళ్లుగా తయారౌతున్న యువతీ యువకుల చేతలతో సంస్కృతి చచ్చుబండలైపోతుంది. దానిక్కారణం బాధ్యతగల తల్లిదండ్రులు తమ పిల్లల్ని తప్పుడు పోటీ ప్రపంచములో నిలబెట్టి రెంటికి చెడిన రేవడిలా తయారు చెయ్యడమేననే సామాజిక స్పృహనందించేది వడ్డే ఓం ప్రకాశ్ నారాయణ గారి కథ 'మనకీ అనుబంధం చాలదా!'

ఉద్యోగరీత్యా సగటు పల్లెటూరు నుండి నగరానికొచ్చిన మురహరి తన కొడుకు శ్రీనును ఎంసెట్ కోచింగ్‌కు పంపకుండా అమ్మానాన్నలు (వ్యవసాయం) ఉన్న తన సొంతూరికి పంపాలని నిర్ణయిస్తాడు. భార్య స్నేహితుడు మూర్తి నీకేమన్నా పిచ్చి పట్టిందా అంటూ నిలదీస్తాడు. మురహరి వారికి వాస్తవాలను వివరిస్తాడు. పిల్లలంతా ఎంసెట్ కోసం లాంగ్ టర్మ్ కోచింగ్ కెళ్ళినా ఎంత మంది ర్యాంకులు సాధిస్తున్నారు? రాంకు రాక, వచ్చినా సీటు దొరక్క, సీటు వచ్చినా కోర్సులో ముందుకెళ్ళలేక మానసిక క్షోభ ననుభవిస్తున్నారు. ఎందరో యువకులు ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఎంట్రన్స్ టెస్టుల వెర్రి ఎల్.కే.జీ దాకా దిగజారింది. 'డాక్టరో, ఇంజనీరో కాకపోతే వాళ్ళు బ్రతకలేరా?' ఆత్మవిశ్వాసాన్ని ప్రోది చెయ్యని, సంస్కారాన్నందించని చదువులెందుకు పనికిరావని నిష్కర్షగా చెప్పేస్తాడు. కొడుకును రైలెక్కించి ఊరికి పంపి తృప్తిగా ఊపిరి పీల్చుకుంటాడు.

ఇతర సంచికల కథలు :- యువతీయువకుల మధ్య ప్రోది చేసుకున్న ప్రేమ తప్పకుండా "పెళ్లి కోసం ప్రేమ" అనుకోరాదు. ప్రేమకు అనేక రూపాలు. అందులో స్నేహం గురుశిష్య సంబంధం ఎన్నో ఎన్నెన్నో. వడ్డే ఓం ప్రకాశ్ నారాయణ కథ "నాకంటితో చూడు" ఈ కంటితోనే చూచింది.

ఉద్యోగం చేస్తున్న పద్మకు పెళ్లిచూపులు. పెళ్లీడుకొచ్చిన పిల్ల తల్లిదండ్రులకు గుండెల మీది కుంపటి కాబట్టి అమ్మానాన్నల కెదురు చెప్పకుండా యాంత్రికంగా తయారై కూచుంటుంది. పెళ్లిచూపుల కొచ్చిన యువకుడు రఘు తనకు పదో తరగతిలో ట్యూషన్ చెప్పిన మాస్టారని తెలుస్తుంది. పెళ్లిచూపులయాక ఇద్దరూ ఒక చోట కలుసుకుంటారు. రఘు పట్ల తన మనసులో గురుభావం తప్ప మరేదీ లేదనీ, పద్మ చెబుతుంది. అతణ్ణి భర్తగా ఊహించుకోలేనంటుంది. రఘు తన అభిప్రాయం గూడా అదేనంటాడు. తరతరాలుగా వస్తున్న గురుశిష్య సంబంధములోని పవిత్రతను చాటి చెబుతుంది కథ. ఇది సంక్రాంతి సంచికలో అచ్చయింది.

సాహిత్యం సమకాలీన సమాజానికి దర్పణం. సామాన్య జనజీవనం కథలో ఇమిడితే అది పాఠకుల మనసుల్లో తిష్ఠ వేసుక్కూచుంటుంది. ఆ కథ ద్వారా సందేశం అందితే గొప్ప కథ అవుతుంది.

తెలంగాణాలో నేడు గ్రామజీవనం ముందు నుయ్యి వెనక గొయ్యి లాగుంది. ఒకవైపు తీవ్రవాదుల భయం, మరోవైపు అపహాస్యానికి గురైన పోలీసుల అభయ భియంతో ఈ ప్రాంతం అగ్నిగుండంలా తయారైంది.

అణగారిన వర్గాల అభ్యున్నతి కోసమే అజ్ఞాత వాసం చేస్తున్నామంటున్న అన్నలు (తీవ్రవాదులు) అర్థరాత్రి పాటలు పాడుతూ ఇంటికొచ్చి అన్నం వండిపెట్టమంటారు. పెట్టకుంటే కాలో, చెయ్యో ఖతం. భోంచేశాక తమ ఉనికి ఎవరికి చెప్పినా ప్రాణాలు తీస్తామని హెచ్చరించి వెళ్లారు. ఈ సంగతి ఏదో విధంగా పోలీసులకు తెలిస్తే పగలు పోలీసుజీపు పరుగెత్తుకొస్తుంది. నేరగాళ్ళకు సహకరించడం పరమనేరమని ఎర్రటోపీలు, నల్లలాఠీలు వీరవిహారం చేస్తాయి. బొక్కలో తోసి బొక్కలిరగ పొడుస్తారు. ఆ చిత్రహింసను భరించలేక నిజం చెబితే అన్నలొచ్చి అన్నంత పంజేస్తారు. అలాంటి ఓ సంఘటనను కళ్లకు కట్టినట్టు హృద్యంగా చిత్రించిన కథ ఐతా చంద్రయ్య "చర్విత చర్వణం". ఇది ఉగాది సంచికలో చోటు చేసుకుంది.

సాయంత్రం నుండి పూజలు చేసి, భక్తులకు తీర్థ ప్రసాదాలు వితరణ చేసిన రామాచారి గుడికి తాళం వేస్తుండగా ఆ రోజు రాత్రి వాళ్లింటికి నలుగురు అన్నలు

భోజనానికొస్తారనే సమాచారమందింది. భయంతో వణికిపోతూ ఇంటికెళ్లి తండ్రి వెంకటాచారితో చెబుతాడు. భార్య వింటుంది. పట్టమంటే కప్పక్కోపం, విడువమంటే పాముక్కోపం. ఈ ఆపద నుండి ఎలా గట్టెక్కాలని తీవ్రంగా ఆలోచిస్తున్న వెంకటాచారికి తన చిన్ననాటి రజాకార్ల ఉద్యమ తీవ్రతలో ప్రజల పరిస్థితి గుర్తుకొస్తుంది. పగలు పోలీసులు, రాత్రి రజాకార్లు ప్రజల్ని హింసిస్తూంటే విధిలేని పరిస్థితిలో ప్రజలు ఆత్మరక్షణ కోసం ఆయుధాలు చేపట్టిన వైనం ధైర్యాన్నిస్తుంది. కొడుకూ, కోడలితో కలిసి ప్రాణాలకు తెగించి పథకం తయారుచేస్తాడు. అన్నమాట ప్రకారం అర్ధరాత్రి అన్నలొస్తారు. ఇంటి తలుపు ఒకటే తెరిచుంటుంది. అన్నలు ఒక్కొక్కరే లోపల ప్రవేశించగానే కంట్లో కారం, నోట్లో గుడ్డలు, పొత్తి కడుపులో త్రిశూలం పోట్లు సమాంతరంగా జరిగిపోతాయి. నలుగురికీ అదే సత్కారం. ఇంట్లో రోజూ పూజలందుకుంటున్న మహిషాసురమర్దని చేతిలోని త్రిశూలం జానకి చేతిలోకొచ్చాక ఆవిడ అపర మహిషాసురమర్ధనిలా కన బడుతుంది. హాహాకారాలతో అన్నల ప్రాణాలు గాల్లో కలిసిపోతుంటే చారి కుటుంబసభ్యులు ముగ్గురు విప్లవం జిందాబాదని నినాదాలిస్తారు.

విప్లవమంటే సామాన్యుని ప్రాణాలతో చెలగాటం కాదనీ, సామాన్యుడు తెగిస్తే అసామాన్యుడై విజృంభిస్తాడనే చక్కని ఇతివృత్తం, చిక్కని శిల్పం. "ఎర్రజెండ ఎర్రజెండెనియ్యలో" తో ప్రారంభమైన కథ. "విప్లవం జిందాబాద్" తో ముగిసి పాఠకునిలో ఉత్కంఠ రేకెత్తించి ఆసాంతం చదివిస్తుంది. తెలంగాణా మాండలిక సంభాషణలు మరో ఆకర్షణ.

కాశ్మీర రాజ తరంగిణి కథలు :- అఖండ భారతమాత నుదుటి సిందూరం అందాల కాశ్మీరం. అంతటి సిందూరానికో గొప్ప చరిత్ర ఉంది. దానికి సంబంధించిన ఇతిహాస కథలున్నాయి. ఉత్కృష్టమైన భారతీయ సంస్కృతీ, సంప్రదాయాల గనులు కశ్మీర రాజుల కథలు. కె. మురళీకృష్ణ కలం నుండి జాలువారిన, 'కాశ్మీర రాజ తరంగిణి కథలు' ఈ పత్రికకు చక్కని అలంకారాలు. నిడివిలో పెద్దవి కాబట్టి ఒక్కో కథ రెండు మూడు సంచికల దాకా సాగింది. ఇవి 13 కథలు.

1. ధర్మ రక్షణ 2. గురు దక్షిణ 3. జలౌక మహారాజు అద్భుత జీవితం 4. దామోదర సర్పం 5. ప్రజా పుణ్యైః సంభవతి మహీభుజః 6. కిన్నెరుని కోరిక 7. అజిత సింహుని ఆత్మార్పణం 8. సంధిమతి అద్భుత జీవితం 9. ధర్మదండం 10. సంభవామి యుగే యుగే 11. రాణీ సుగంధాదేవి 12. కాశ్మీర రాణి - ఉద్దాదేవి 13. తురుష్కహర్షుడు చరిత్ర.

ప్రబంధశైలిలో చక్కని అలంకారాలతో సాగిన ఈ సందేశాత్మక కథల్లోని పాత్రలు

రాజులు, రాణులు, గంధర్వులైనా ఆనాటి సంఘటనలు నేటి తరానికి పాఠాలు నేర్పుతాయి. భావాలతో చెట్టాపట్టా లేసుకున్న భాష పాఠకుణ్ని ఆనంద నందనవనములో విహరింపజేస్తుంది. గద్యరచనకు అలంకారాలు అత్యంత శోభనిస్తాయని చాటిచెప్పిన కథలివి.

మచ్చుకు "కిన్నెరుని కోరిక" కథ. కిన్నెరుని భార్యను బౌద్ధుడు అపహరిస్తాడు. ఆ కోపంతో కిన్నెరుడు బౌద్ధారామాలన్నింటినీ అగ్నికీలల కాహుతి చేస్తాడు. ధర్మబద్ధంగా జీవిస్తూ సుందర నగరాన్ని నిర్మించి కాశ్మీర మహారాజయాడు. కాని అదే కిన్నెరుడు కొన్నాళ్ల తర్వాత - అతిలోక సౌందర్యవతియైన విశాఖుని భార్య చంద్రకళ కనబడగానే పిచ్చివాడైపోతాడు. కాదు పిశాచం కలవరపెడ్తూంటే ఆమెను పొందాలనే తహతహ రోజు రోజుకు పెరిగిపోతుంది. ఇది అధర్మమని మంత్రులు చెప్పినా వినడు. విశాఖుణ్ని పిలిపించి చంద్రకళను తనకప్పగించుమంటాడు. అందుకొప్పుకోడు విశాఖుడు. పరుల భార్యలనాశిస్తే పతనం తప్పదని హెచ్చరిస్తాడు. కిన్నెర మహారాజుక్కోపమొస్తుంది. విశాఖునితో యుద్ధానికి దిగుతాడు. ధర్మబద్ధుడైన విశాఖుని చేతిలో చిత్తుగా ఓడిపోయి సర్వస్వం కోల్పోతాడు.

కామం కళ్లు గప్పితే, ధర్మం దాసీగా కనబడ్తుంది. ధర్మం మరిస్తే మనిషి దయ్యమై పోతాడనేది రావణాసురుడు, నహుష చక్రవర్తుల వృత్తాంతం గూడా చెబుతుంది. అధర్మాచరణకు దిగిన కిన్నెరుని నాశనంతో కథ ముగుస్తుంది. అందరికీ అర్థమయే సమాసాల కాలవాలమైన ఈ కథల్లో హృద్యమైన వర్ణనలు పాఠకుల నాకట్టుకుంటాయి.

ఇలాంటి కథలు చోటు చేసుకుంటున్నా జాగృతి కథాప్రక్రియకు సముచితమైన స్థానాన్ని కేటాయించాల్సిన అవసరముంది. ప్రతి సంచికలో కనీసం ఒక్క కథన్నా ఉంటే ఇంకా బాగుంటుంది.



# ఆంధ్రభూమి మాసపత్రిక

'ఆంధ్రభూమి' మాసపత్రికలో 6 నుంచి 8 వరకు కథలుంటున్నాయి. రచయితల్లో కొత్త వారికి బాగా ప్రోత్సాహం ఉంది. బహుశ చాలా మంది తొలి రచనలు ఇందులోనే ప్రచురితమౌతూ ఉండవచ్చు.

జనవరి సంచికలో డా॥ సి. రాజ్యలక్ష్మి రాసిన 'అపాత్రదానం' మంచి కథ. తన కుటుంబ సభ్యులకు సేవ చేయడం, వారి భారం మోయడం తన విద్యుక్త ధర్మమనుకుని, వారి నుంచి కృతఘ్నతతప్ప మరేమీ పొందని ఒక అవివేకురాలి కథ. అపాత్రుల కోసం ఉన్నత వ్యక్తిత్వంగల భర్తకు దూరమై, చివరికి తన పొరపాటు తెలుసుకున్న వైనాన్ని చక్కగా చిత్రీకరించారు రచయిత్రి.

ఇదే విధంగా కొఠారి వాణీ చలపతిరావు గారు రాసిన 'గంగా విలాపం' గంగానదిని భక్తి పేరిట, స్వప్రయోజనాలకోసం మనుషులు ఎలా కలుషితం చేస్తున్నారో సున్నితంగా చెప్పిన కథ. హాస్యం అన్ని ప్రక్రియల్లోనూ మృగ్యమైపోతున్న ఈ రోజుల్లో శ్యాంసుందర్ నాయుడు 'లెటర్ బాక్స్' అనే కథ ద్వారా కాస్సేపయినా నవ్వుకునేలా చేశారు.

స్వామి చిత్రానంద, గంటి రమాదేవి వంటి అనుభవజ్ఞులైన రచయితలు ఆంధ్రభూమికి అందించిన కథలు చాలా పేలవమైనవి. దోనేపూడి ప్రేమ్‌దులారీ రాసిన మూడు రెండు కథలు ఫర్వాలేదనిపించేలా ఉన్నాయి.

కొత్త రచయితలకు అవకాశం ఇస్తున్నందుకు 'ఆంధ్రభూమి' మాసపత్రికను అభినందించవలసిందే. కానీ కథల నాణ్యత విషయంలో కొంతైనా ప్రామాణికత

పాటించవలసి వుంటుంది. కేవలం కొత్త కథకుల అభ్యాసరంగంగా పత్రిక మిగిలిపోవడం అంత సముచితంగా లేదు. 'బ్రెయిన్ వాష్' అనే కథ (ఇ.టి. రామారావు) లో వస్తువు, కథనం బాగా ఉన్నాయి. స్త్రీ ని లైంగిక దృష్టితో తప్ప మరోలా చూడలేని పురుషుని బలహీనతను బహిర్గతం చేసే కథ. కానీ కథ శీర్షిక 'బ్రెయిన్ వాష్' ఏమాత్రం అతకలేదు. పత్రికా సంపాదకులు శీర్షికల విషయంలో కూడా శ్రద్ధ వహించడం అవసరం.

'ఆంధ్రభూమి' మాసపత్రిక కథల్లో ఏవాదాల స్పృహలేదు. అన్నీ కుటుంబ గాథలు, ప్రేమగాథలు ,మానవ సంబంధాల పై వ్యాఖ్యానాలు.



# ఆహ్వానం మాసపత్రిక

'ఆహ్వానం' మాసపత్రిక గత సంవత్సరంలో రెండు సంచికలే వచ్చాయి. అటువంటి మంచి పత్రికకి గ్రహణం పట్టడం విచారించదగిన విషయం. ఆర్థిక విషసర్పం కాటుకి గురికాక తప్పలేదు. త్వరలోనే విరుగుడు లభించి కోలుకుంటుందని ఆశిద్దాం.

1996 డిసెంబరు, 1997 జనవరి కలిసి ఒక సంచికగా వెలువడింది. ఇందులో 8 కథలున్నాయి. కథానికలు ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో ఈ సంచికలో కొన్ని కథలు చదివితే తెలుస్తుంది. కొన్ని కథలు నవలల్ని కుదించినట్లుగా ఉన్నాయి. కొన్ని వాదోపవాదాలతోనూ, కొన్ని సిద్ధాంత చర్చలతో కూడినట్లుగానూ ఉన్నాయి. రచయితలు కూడా తమ రచనల్ని పాఠకులుగానూ, విమర్శకులుగానూ చదివి చూసుకుంటే, కొన్ని లోపాల్ని సరిదిద్దుకోవచ్చు.

ఈ సంచికలోని కథలన్నిటిలోకీ పి. విజయలక్ష్మి రాసిన 'గేటు చప్పుడు' చక్కని కథానికా శిల్పానికి ప్రతీకగా చెప్పుకోవచ్చు. ఇంటి యజమానురాలూ, పనిమనిషీ - ఇద్దరూ చెరోరకంగా తమ గతం గురించీ, వర్తమానం గురించీ ఆలోచిస్తూ ఉంటారు. భర్త తొందరగా ఇంటికొస్తే ఇద్దరూ కలిసి భోజనం చెయ్యవచ్చు అని ఆదుర్దాగా ఎదురు చూస్తూ ఉంటుంది యజమానురాలు. కూలి కోసం వెళ్ళాడు పనిమనిషి మొగుడు. పై ఊరికి లారీలో వెళ్ళేపని దొరికితే అటు నుంచి అటే వెడతాను, లేకపోతే ఇంటి కొచ్చేస్తాను అని చెప్పి వెళ్ళాడు. మొగుడు ఇంటికి రాకుండా ఉంటే బావుండును అనికోరుకుంటుంది. అంతలోనే, "గేటు చప్పుడు అయింది" అంటూ కథ ముగుస్తుంది.

భర్త వచ్చాడో, పనిమనిషిమొగుడు వచ్చాడో చెప్పకుండా కథ ముగించడం ద్వారా కథా శిల్పాన్ని ప్రదర్శించారు రచయిత్రి.

కథానిక అంతా బావున్నా, ముగింపులో ప్రత్యేకత లేకుండా సామాన్యంగా ఉన్న కథ "ఒక హెచ్. సరస్వతి కథ'. రచయిత స్వామి. ఈ కథలో స్కూలు టీచర్ ఒక హరిజన యువతి. కులరాజకీయాలను బాహాటంగా చర్చించిన కథ ఇది. ముఖ్యంగా, బ్రాహ్మణులు హరిజనులను ఎలా అవమాన పరుస్తారో చూపించడానికి ప్రయత్నించారు. "ఆ స్కూలుని స్థాపించినది బ్రాహ్మణుడు కాబట్టి ఆ స్కూలు బెల్లుకొట్టే ప్యూను దగ్గరనుంచీ హెడ్‌మాస్టరు దాకా అంతా బ్రాహ్మణులే !" ట. 'అంతో ఇంతో డబ్బు ముట్ట గలిగి, మితిమీరిన అణుకువ ప్రదర్శించగలిగిన 'బీసీలు' కొన్ని పోస్టుల్ని దక్కించుకోగలిగారు"ట. స్కూలు 'ఏడ్‌మినిస్ట్రేషన్' వివరాలన్నీ చెప్పడంతో కథ ఆ వివరాలతో కిక్కిరిసినట్లుగా ఉంది. కథనంలో మధ్యమధ్య రచయిత వ్యాఖ్యానాలు కూడా ఉన్నాయి.

"మీలాంటి అమ్మాయ్యా హరిజనుల్లో పుట్టాల్సింది కాదండీ". అన్న "శేషశాస్త్రి మాటను మెచ్చుకోలుగా స్వీకరించలేని సరస్వతి గాంభీర్యంతో కాస్సేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది". కథ కిచ్చిన ఈ ముగింపు ఇంకా పదునుగా, ప్రయోజనాత్మకంగా ఉంటే బావుండేదేమో.

ఈ రోజుల్లో పై తరగతి, మధ్య తరగతి కుటుంబాల్లో తల్లీ కూతుళ్ల మధ్య స్నేహ భావం ఉండటం వల్ల వారి మధ్య తరాల అంతరం ఉన్నా, పరస్పర అవగాహన పెరగడానికి వీలవుతోంది. ప్రేమవ్యవహారంలో కూతురికి నచ్చజెప్పగలుగుతుంది తల్లి "థ్యాంక్యూ మమ్మీ" అని 'సీతాసత్య' రాసిన కథలో.

గ్రామీణ రాజకీయాలను ప్రతిబింబించే కథల్లో బడబాగ్ని శంకర రాజు రాసిన 'మృత్యుంజయుం' కథానికి ఒకటి, ముళ్ళపూడి సుబ్బారావు రాసిన 'పాలపుంత' అనే పెద్ద కథఒకటి.

మహమ్మద్ రఫీ కథానిక 'బహుమతి', యం.వి. సిద్దికి కథానిక 'ఉరితాడు' సామాన్యంగా ఉన్నాయి.

డి.ఆర్. ఇంద్ర కథ 'సహృదయ' - భర్తనీతిమాలిన ప్రవర్తన నచ్చక, అతణ్ణి విడిచి

పెట్టి ఒక వృద్ధాశ్రమంలో చేరి సేవ చేస్తూ బతుకుతున్న స్త్రీ గురించి. వృద్ధుల సేవలో ఆనందాన్ని పొందుతున్న ఆమెని చూసిన స్నేహితురాలు అనుకుంటుంది. "...కష్టాలను భవించిన ఆడవాళ్ళందరి జీవితాల్లోనూ ఇటువంటి మార్పు సాధ్యమా ? మార్పు సాధ్యమయ్యే పక్షంలో ఈ తరంలోని ఆడవాళ్ళందరూ మొగుళ్ళని వదిలి పెట్టేసి ఇలా జ్ఞానసంపన్నులైతే వచ్చేతరం నుండైనా స్త్రీ పురుష సంబంధాలలో విప్లవాత్మకమైన మార్పు వస్తుందేమో!" తన ఊహకి తనే నవ్వుకుంటుంది.

భర్తల నుంచి విడిపోయిన భార్యల పట్ల కొంత వ్యంగ్య భావాన్ని ప్రదర్శించి నట్లనిపిస్తుంది. ఇతివృత్త కల్పనలో కూడా అటువంటి దృక్పథం కనిపిస్తుంది.

ఏప్రిల్ 1997 సంచికలో 7 కథలున్నాయి. వీటిలో కొన్ని చాలా మంచి కథానికలు. వీటిలో సున్నితమైన హాస్యంతో కూడిన 'బరువుసామాను' కథగురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. రచయిత తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి.

అద్దె ఇల్లు ఖాళీ చెయ్యడమో, అద్దె ఇంట్లోంచి సొంత ఇంట్లోకి మారడమో మధ్యతరగతి సంసారులు అనేక మందికి అనుభవంలో ఉన్నదే. ఇంట్లో అడ్డమైన సామానూపోగు చేస్తూ ఉండడం, ఏ ఒక్క వస్తువూ పారెయ్యలేక పోవడమూ మామూలే. ఈ సామాన్య అనుభవాన్ని కథా వస్తువుగా తీసుకుని, ఆహ్లాదకరంగా ఆలోచనాత్మకంగా మంచి శైలిలో రాసిన కథానిక ఇది. సహజమైన సంభాషణలలో సున్నితమైన వ్యంగ్యం, హాస్యం ప్రదర్శితమవుతూ తెలుగు తనాన్ని ప్రతిబింబించే కథ.

వి. నాగరత్న రాసిన 'నాలోనేను' సందేశాత్మక మైన కథానిక. ఆత్మాభిమానం ఉన్న పనిమనిషి విమల ఆత్మవిమర్శ చేసుకుంటూ, సామాజిక పరిశీలన చేస్తూ చెప్పిన కథ. పనిమనిషిని నీచంగా చూడ్డం సహించలేదు. ఎదిరించి కొలువు మానేస్తే కుటుంబంగడవదు. ఆ సమయంలో గోపాలం అనే సమసమాజవాది ఇచ్చిన సలహావిన్నాక, ఆలోచనలో పడుతుంది. "ఇక పై నాలోనేను మధనపడ్డం కాదు. నాలా నలుగురూ ఆలోచించేట్లు చేయాలి...." అని నిర్ణయించుకుంటుంది. మనుషులు సంఘటితమై, తమ హక్కుల కోసం పోరాడినప్పుడే వాటిని సాధించడానికి సాధ్యమవుతుందని సూచించేకథ. కథనం సరళంగా, సహజంగా ఉంది.

కె. సూర్యముఖి రచన 'ఊర్మిళనిద్ర'. దాంపత్య సంబంధాలు ఎలా ఉండాలో,

ఎలా ఉండకూడదో దృష్టాంత పూర్వకంగా చెప్పిన కథ. "మూడు ముళ్ళంటే మమత, సమత, సహకారం కాని, దుష్టత్వం, దుర్మార్గం, దురహంకారం కానేకాదనే" వదిన గారి మాటలు అర్థం చేసుకుని చైతన్యవంతురాలై, పదేళ్ళతన 'నిద్ర'ని వదిలించుకుంటుంది కథానాయిక.

పెళ్లి చూపుల తతంగం ఆడపిల్లలో ఎంతటి ఆత్మన్యూనతా భావాన్ని కలిగిస్తుందో చాలామంది ఆడవాళ్ళకి తెలుసు. కానీ దాన్ని మానసిక వ్యభిచారంగా పరిగణించి బాధపడుతుందొక యువతి "వ్యభిచారం" కథలో. "ఎవడెవడితోనో పెళ్లిచూపులేర్పాటవుతాయ్. ఎవడెవడో నాలో ఆశలు రేపుతాడు. ఊహల్లో తిరుగాడి, కలల్లో చేరువవుతాడు. ఈ మానసిక వ్యభిచారం చాలు... ఇంకోసారి నా పెళ్ళి మాటెత్తారంటే నాశనాన్ని మీరు కళ్ల చూస్తారు జాగ్రత్త" అని బెదిరిస్తుంది తల్లిదండ్రుల్ని. తన కాళ్ళమీద తానునిలబడేందుకు కర్తవ్యోన్ముఖురాలవుతుంది. ఈ 'వ్యభిచారం' అనే ఆలోచన సాంప్రదాయకమైన "పాతివ్రత్యం" గురించి ఏర్పడిన భావజాలం ప్రభావం వల్ల కలిగినదని రచయిత గ్రహిస్తే, తన పాత్రలో కూడా సరియైన అవగాహన కలిగించగలుగుతాడు. ఈ కథా రచయిత ఆడెపులక్ష్మీపతి.

మరో భిన్నమైన కథావస్తువుని తీసుకుని రాసిన కథ "భిన్నస్వరాలు". రచయిత్రి ఓల్గా. కాలేజిలో ఆడపిల్లలు నాటకం వెయ్యాలంటే ఎదుర్కొనే సమస్యలూ, వివాహాలూ, పిల్లల గురించి భిన్నాభిప్రాయాలు ప్రకటితమవుతాయి కథలో. పెళ్ళివల్ల చేదు అనుభవాన్ని చవిచూసిన ఒక అమ్మాయి "ఆడదాని సృష్టిశక్తిని తనకంట్రోల్‌లో వుంచుకోటానికి మగవాడు కనిపెట్టిన తిరుగులేని ఆయుధం" అని నమ్ముతుంది. తన భావాలతో ఏకీభవించిన యువతులు కొంతమంది తిరుగుబాటుకి ఉద్యమిస్తూ చేతులు కలుపుతారు చివరికి.

ఈ సంచికలో డా॥. కాలువ మల్లయ్య రాసిన 'నా తెలంగానా' అనే దళిత కథ చెప్పులు కుట్టేవాడిని హేళనగా చూసే రోజులు పోయాయి. తెగిన చెప్పుకుట్టినందుకు రెండురూపాయలివ్వడం దండుగ అంటాడు ఇంజనీరు గర్వంతో ఒక్క రూపాయి కన్న ఎక్కువ ఇవ్వనంటూ, చెప్పులు కుట్టే పోచయ్యని కులం ప్రసక్తి ఎత్తి అవమానించినందుకు ఇంజనీరు పై కేసుపెడతానని బెదిరిస్తాడు. పక్కనే ఉన్న ఇంజనీరు మిత్రుడొకడు

కలుగజేసుకుని పోచయ్యకి క్షమాపణ కోరి, ఆవ్యవహారాన్ని అంతటితో ముగించమంటాడు. క్షమించమని అడిగి, రోషంతో, అవమానంతో, ఎర్రబడ్డ ముఖంతో అక్కణ్ణించి వెళ్ళిపోతాడు ఇంజనీరు. పోచయ్య ముఖంలో విజయహాసం కనిపిస్తుంది.

ఈ కథని అంతటితో ముగిస్తే మంచి కథానిక అయేది. కానీ, పోచయ్య గత స్మృతులతో కొనసాగించి, తెలంగాణా గ్రామాల్లో వచ్చిన మార్పుల్ని ఒక వ్యాసంలా రూపొందించారు రచయిత. పోచయ్య ఉప్పొంగిపోతూ 'నా తెలంగాణ' అని రెండుసార్లు అనుకోవడంతో కథ ముగుస్తుంది.

అనువాద కథల్లో కమలా దాస్, జపనీస్ రచయిత అగుటగవ రాసిన కథలున్నాయి. 'ది సీ తాంజ్' కథని కె.కె. రెడ్డి, 'రోషమాన్' కథని రాధిక మొవ్వ అనువదించారు.



# ప్రజాసాహితి మాసపత్రిక

ఎన్ని ఆర్థిక ఇబ్బందు లెదుర్కొంటున్నా ఏమాత్రం రాజీ పడకుండా ప్రజల సాహిత్యాన్ని మాత్రమే ప్రచురించడానికి కంకణం కట్టుకున్న ప్రజల పత్రిక ప్రజాసాహితి. ఏ వ్యాపార విలువల ప్రకటనల జోలికి పోకుండా ప్రజాసాహిత్యాన్నే ప్రచురిస్తూ రెండు వందల సంచికలను తీసుకు రావడం ఎంత అసిధారావ్రతమో తెలియంది కాదు. అసిధారావ్రతం లాంటి పనిని ముందుకు తీసుకు వెళుతూ త్వరలో రెండువందలవ సంచికను తీయబోతున్న జన సాహితీ సంసాంస్కృతిక సమాఖ్యను అభినందించాల్సిందే. రంగ నాయకమ్మ, కొత్త పల్లి రవిబాబు, నిఖిలేశ్వర్, వాసిరెడ్డి నవీన్, నిర్మలానంద లాంటి ఉత్తమ సంపాదకుల సంపాదకత్వంలో దివికుమార్ లాంటి వాళ్ళ అండదండలతో ఈ పత్రిక నిర్విఘ్నంగా నడుస్తూనే ఉంది. ఉత్తమ సాహిత్యాన్నందిస్తూనే ఉంది. ప్రజాసాహితి ముఖచిత్రాలు, సంపాదకీయాలు, సమీక్షలు, వ్యాసాలు, కవితలు అన్నీ ఓ నిబద్ధతకు లోబడి ప్రచురింపబడుతున్నవే! ఎన్నో మంచి కథలు, గల్పికలు ప్రచురించిన ఘనత ప్రజాసాహితికుంది. మహాసంకల్పం లాంటి కథలు. భూపోరాటం, సాంస్కృతిక పోరాట కథలెన్నో ప్రచురించి ఈ పత్రిక ప్రజల పక్షాన నిలబడుతూనే ఉంది. సర్క్యులేషన్ విషయంలో వ్యాపార పత్రికలతో పోటీ పడటం సాధ్యం కాకున్నా, ఉత్తమ సాహితీ విలువలను పెంపొందించడంలో ఇది అగ్రభాగాన ఉంటుంది.

ప్రతి సంవత్సరంలా ఆనవాయితీగానే 1997లోనూ ప్రజాసాహితిలో చక్కని కథలే వచ్చాయి. శిల్ప ప్రమాణాలతో కొలిస్తే అన్నీ గొప్ప కథలే కాకున్నా ఇవన్నీ నిబద్ధతతో

రాయబడిన కథలే. ఈ పత్రికలో ప్రతినెలా ఒకటి రెండు కథలు వస్తున్నాయి.

జనవరి నెలలో ఈ పత్రికలో చిన్న రాసిన ఎర్రజెండా, ఈరమ్మ మట్టి అనే ఒరియా అనువాద కథలు వచ్చాయి. ఫిబ్రవరి నెలలో చైతన్య ప్రకాశ్ రాసిన నేనేం చేయాలి? మార్చిలో మహాశ్వేతాదేవి కథ మకర స్వం అచ్చయ్యాయి. ఏప్రిల్, మే నెలల్లో గంటేడ గౌరు నాయుడు సెగ,బమ్మిడి జగదీశ్వరరావు 'గుండు' కథలు, బజరా గల్పిక మావహారం వచ్చాయి. మార్చిసంచిక మహా దేవి రచనల గూర్చి వచ్చిన ప్రత్యేక సంచికగా వచ్చింది. జూన్ నెలలో మహాశ్వేతా దేవి రాసిందే ద్రౌపది కథ, జూలైలో కొప్పల భానుమూర్తి రాసిన వరాలమ్మ కథలు వచ్చాయి. జూలై సంచికలోనే రొక్కం కామేశ్వర రావు గల్పిక జీవకారుణ్యం, యు. సూర్యచంద్రరావు క్లైమాక్స్ వచ్చాయి.

ఆగష్టు నెలలో వరాలమ్మ కథ పునర్ముద్రితమైతే, సెప్టెంబర్‌లో అట్లూరి పిచ్చేశ్వర రావు నెత్తురు కథ, కాలువ మల్లయ్య కథ పంజరం అచ్చయ్యాయి. అక్టోబర్‌లో గోపీచంద్ రాసిన గోడమీది మూడోవాడు, నవంబరులో బాలగంగాధర తిలక్ గారి అద్దంలో ఓన్నా, దివికుమార్ రాసిన పిడుగు పాటు గల్పిక అచ్చయ్యాయి. డిసెంబర్‌లో సాహసిరాసిన మూడోకన్ను కథ, దివికుమార్ గల్పిక శ్రీరామకాండం, కొ.కు. గల్పిక కథారచన, గణపతి గల్పిక కల్తీ అచ్చయ్యాయి.

ప్రజాసాహితిలో ఉత్తమ కథలతో పాటు పాతకథల్లో ఉత్తమ కథలు, అనువాద కథలు సందర్భోచితంగా ప్రచురింపబడుతున్నాయని పై కథలను పరిశీలిస్తే అర్థమవుతూనే ఉంది. ఈరమ్మ మట్టి అనే కథ ఒరిస్సా భూపోరాట కథ. పోరాటాలు లేనట్టు కనిపించే ఒరిస్సాలోనూ భూపోరాటాలున్నాయనడానికిలాంటి కథలు ఉదాహరణలు. జ్ఞాన పీఠ్ అవార్డు గ్రహీత, బెంగాలీ గిరిజనులతో అక్కగా పిలవబడే మహాశ్వేతా దేవి రాసిన రెండు కథలు, మకరసవర, ద్రౌపది ప్రజాసాహితిలో వచ్చాయి. గిరిజనుల జీవితాలపై గొప్ప సాహిత్యాన్ని సృష్టిస్తున్న మహాశ్వేతాదేవి రాసిన ఈ రెండూ గొప్ప కథలే.

భూపోరాటాలు ప్రారంభమవుతున్న కాలంలో, తెలుగుదేశంలో కమ్యూనిస్టు పార్టీ వేళ్ళూనుకుంటున్న సమయంలో ఎర్రజెండా యొక్క ఆవశ్యకతను గూర్చి కథలు వచ్చేవి. ఎర్రజండా పేర్ల మీద, ఇంకా అనేక జెండాల పేర్లతో పార్టీలు అనేకమై ప్రజల్ని సందేహాల్లో ఉంచుతున్న పార్టీకైనా తెలిపే కథ ఎర్రజెండా. ప్రజల జెండాల పేరుతో ఎర్రజెండా పేరుతో ప్రజలకుపయోగపడని పార్టీల అల్పత్వాన్ని, నిజమైన ఎర్రజెండా అవసరాన్ని తెలిపే కథ ఇది.

పోరాటాలున్న ప్రాంతంలో పోరాటాలతో సంబంధంలేని స్త్రీలు కూడా ఎలా వేదనకు, హింసకు గురవుతున్నారో తెలిపే కథ "నేనేం చేయాలి ?". పోరాటంలో తన భర్త మరణించినా ఏమాత్రం వెనుకడుగేయకుండా భర్త ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడానికి సన్నద్ధమైన స్త్రీ దృష్టికోణంలోంచి చూస్తుంటే ఆమె భయపడక పోగా మరింత రాటుదేలుతుంది. భర్త మార్గాన్నే అనుసరిస్తుంది.

కొన్ని ప్రాంతాల్లో దొరలు కల్లుదొంగతనం లాంటివి చేసిన వాళ్ళను తల గొరిగించి గాడిదపై ఊరేగించేవారు. ఘోరమైన మానసిక క్షోభకు గురిచేసేవారు. ఆతడు ఆ పని చేయడానికి గల కారణాలనేమాత్రం దృష్టిలోకి తీసుకోకుండా హింసిస్తూ రాక్షసానందమనుభవించేవారు. అయితే పోరాటాలుధృతమై పీడిత కులాలవారు కూడా ఎదురు తిరగడం మొదలయిన తర్వాత ఇలాంటివి కొంత తగ్గాయి. అయినా పోలీసులే గుండు గొరిగించడం, దొరలూ ఇలాంటి అవమానాలు చేయడం అక్కడక్కడ జరుగుతూనే ఉన్నాయి. స్త్రీలను గుండు గీయించి అవమానించడం అంశంగా గల కథ బమ్మిడి జగదీశ్వర రావు రాసిన "గుండు". అయితే ఈ కథను ఓ చిన్న పిల్ల పాత్ర ద్వారా చెప్పించడం అసహజంగా ఉంది.

ఉద్యమకారులను, ఉద్యమాలతో సంబంధముంటుందనుకున్నవాళ్ళను అందరి సమక్షంలోంచే తీసుకెళ్ళి చంపి మాకు సంబంధం లేదని బొంకడం పోలీసులు చేస్తున్నదే. ఇలాంటి సంఘటనలు ఉద్యమాలున్న చోట నిత్యం జరుగుతున్నవే. అట్లాంటి వ్యక్తికి సంబంధించిన కథే మూడో కన్ను. ప్రజల ముందు నుంచే తీసుకెళ్ళిన మనిషిని మేం తీసుకెళ్ళలేదని దబాయిస్తారు పోలీసులు. పౌరహక్కుల వాళ్ళు నిలదీస్తే ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడంటారు. శవాన్నయినా అప్పగించమంటే అది అరాచకమవుతుంది. ఇలాంటి కథలు తెలంగాణాలో రోజూ జరుగుతూనే ఉన్నాయి.

ప్రజాసాహితిలో వచ్చిన కథలన్నీ మంచి కథలే అయినా శిల్పరీత్యా, విషయం రీత్యా, ఇతర ప్రమాణాల రీత్యా ఈ సంవత్సరం వచ్చిన కథల్లో నాలుగు కథలను ఉత్తమమైన కథలుగా పేర్కొనవచ్చు. అందులో రెండు కథలు సెప్టెంబర్ సంచికలో వచ్చిన పంజరం, నెత్తురు కథ. ఈ కథలగూర్చి ప్రముఖ సినిమా నటుడు, ప్రజానాట్యమండలి

నాయకుడు, సాహితీ విమర్శకుడు కాకరాల డిసెంబరు సంచికలో రాసిన వాక్యాల నిక్కడ ఉదహరించడం అవసరం.

'పంజరం తెలంగాణా సాయుధపోరాట నేపథ్యం నుంచి నక్సల్‌బరీ సాయుధపోరాట నేపథ్యం దాకా నడిచివచ్చిన స్త్రీ సామాజిక జీవితాన్ని చిత్రిస్తూనే అదేసమయంలో అంతర్గత పరిమాణాత్మక పరిణామాల్ని పాఠకుల ఆలోచనకు వదిలి దాన్ని పదునుపెట్టే పద్ధతిలో సాగి, చివరకి స్త్రీ సామాజిక జీవితం గుణాత్మక పరిణామాన్ని మనవరాలి పాత్ర ద్వారా విస్ఫోటనం చేసింది. ఆ చైతన్యాన్ని అందుకోలేనివారు బంగారు పంజరంలోని చిలకల్లా ఏం కోల్పోతున్నది సూచించింది. నెత్తురు కథ నెత్తురు రూపెత్తిన నేలతల్లిని, ఆమెతో శతాబ్దపు జీవితం ఆటుపోట్లని ఫిలింబాటేజ్‌లా - మనశ్శరీరాల్ని ఒక్క లయని స్పందింపజేసే వేగంతో దృశ్యాత్మకంగా చెప్పింది. ఈ రెండు కథల్ని బిమల్ రాయ్, మెహబూబ్‌ఖాన్ లాంటివాళ్ళు చూసి వుంటే వేరొక పద్ధతిలోనూ దృశ్యకావ్యాలుగా మలిచేవారు. ఇప్పుడా పర్‌స్పెక్టివ్ వున్న దర్శక నిర్మాతలే లేరు. భవిష్యత్తులో వస్తారనే ఆశమాత్రం వుంది.

తెలంగాణా భూస్వామిక వ్యవస్థ పోకడలను, ఆ వ్యవస్థలో స్త్రీకున్న స్థానాన్ని పంజరం కథ వివరిస్తే, రక్తసిక్తమైన నేల తల్లి చరిత్రను నెత్తురు కథ వివరిస్తుంది.

నాగావళిప్రాంత గిరిజన రైతాంగ జీవితాల్ని ప్రతిభావంతంగా చిత్రిస్తున్న రచయిత గంటేడు గౌరునాయుడు. భూషణం శ్రీకాకుళ రైతాంగ పోరాటాలను కథలకెక్కిస్తే అప్పల్నాయుడు, గౌరునాయుడు ఆ ఒరవడిని సమర్థవంతంగా ముందుకు తీసుకెళ్తున్నారు. నాగావళి ప్రాంత రైతాంగ జీవితాన్ని అత్యంత వాస్తవికంగా చిత్రించిన కథ సెగ. అక్కడి అమాయకుల బతుకుల్లోని విషాదాన్ని చక్కగా చిత్రించిన కథ సెగ. చక్కని గ్రామీణ వాతావరణం, గ్రామాల్లో ఉండే సెంటిమెంట్లు ఈ కథనిండా కనిపిస్తాయి. ఈ కథ చదువుతుంటే నాగావళి ప్రాంత గ్రామాల్లో తిరుగుతున్నట్లనిపిస్తుంది.

భూమి, రైతు సమస్యనే తీసుకొని రాయబడిన మరో మంచి కథ కొప్పుల భానుమూర్తి రాసిన వరాలమ్మ. భూమి దున్నుకుంటూ బతికేవాడికుండే భూమి సెంటిమెంటు, రైతుకు భూమి మీదుండే ప్రేమ, విడదీయరాని సంబంధాన్ని ఈ కథలో

చక్కగా వివరించాడు రచయిత. భూమి తనకేమివ్వకున్నా భూమిని అమ్మడానికి ససేమిరా ఒప్పుకోడు రైతు. రైతు జీవితాన్ని, కడగండ్లను చక్కగా చిత్రించిన కథ వరాలమ్మ.

ప్రజా సాహిత్యోద్యమానికే అంకితమై నడుపబడుతున్న ప్రజాసాహితి మున్ముందు మరిన్ని మంచి కథలను ప్రచురిస్తుందనే ఆశిద్దాం.





# నందిని మాసపత్రిక

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించగల సహృదయలోకం అవసరమని గుర్తించి, ఆరెండింటినీ బలంగా పెంపొందించి సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి 'యువభారతి' ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుకాకుండా స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏకాలంవారయినా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణల ద్వారా, కార్యక్రమాల ద్వారా 'యువభారతి' యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యంలేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది.

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది' - అనే లక్ష్యం తో సమాజంలో వ్యష్టిగా, సమిష్టిగా శాంతియుత సహజీవనాన్ని, ప్రజాస్వామ్య విధానాన్ని, నిర్మాణాత్మక కార్యాలనీ మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించిచూపిస్తోంది యువభారతి. యువభారతి 1963 సం॥ విజయదశమి నాడుపుట్టింది.

'యువభారతి నందిని' ని త్రై మాసిక పత్రికగా ప్రారంభించి, ప్రస్తుతం

మాసపత్రికగా వెలువరిస్తోంది. తెలుగు వారు కథలు చెప్పడం లో దిట్టలు. అయినా తెలుగు కథ గురజాడవారి 'దిద్దుబాటు' తో 1910లో - ఆంధ్రభారతి పత్రికలో నవ్యప్రక్రియగా రూపుదిద్దుకుంది. అటువంటి అందమైన తెలుగు కథను శ్రీమతి కె.బి.లక్ష్మి గారు 'నాకు నచ్చిన కథ' శీర్షికలో నందిని ద్వారా తెలుగు పాఠకులకు పరిచయం చేశారు.

తెలుగు కథలోని అందచందాలు, కథాసంవిధానం, రచయిత చెప్పదలుచుకున్న సందేశం, కథా కథన శిల్పచాతుర్యం మొదలయినవన్నీ ఎంతో నేర్పుగా వెలికితీసి 'అయ్యో ఇంత మంచి కథను మనం ఇంత కాలం చదవలేదేమిటి అనే భావాన్ని పఠితృ లోకానికి కలిగిస్తూ - కథారచయిత - పరిచయం-ఆనాటి పరిస్థితులూ కూడా రమ్యంగా వివరిస్తూ వచ్చేనెల ఏరచయిత కథను వివరిస్తారోననే ఉత్కంఠతను రేకెత్తిస్తూ శ్రీమతి కె.బి.లక్ష్మి గారు తనదైన అపురూప శైలిలో 'నాకు నచ్చిన కథ' శీర్షికను నందినిలో నిర్వహిస్తున్నారు. గురజాడ వారి దిద్దుబాటు తర్వాత చింతా దీక్షితులుగారి 'పెద్దమేడ' శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి 'గులాబీ అత్తరు', సి.పి. బ్రౌను', 'దేవరమాకులు', సురవరం ప్రతాపరెడ్డిగారి "సంఘాల పంతులు', మల్లాది రామకృష్ణశాస్త్రిగారి 'శివరంజని' ఇల్లిందల సరస్వతీదేవి గారి, 'బలీయసేకేవల మీశ్వరాజ్ఞ' వేటూరి శివరామశాస్త్రిగారి 'వ్యత్యయము' ఇంతవరకు పాఠకులకు శ్రీమతి కె.బి.లక్ష్మి గారు హృద్యంగా పరిచయం చేశారు. యువ భారతి సాహిత్యోద్యమంలో తెలుగు కథను, దాని అందచందాలను పాఠక మహాశయులకు పరిచయం చేయడం కూడా ఒక భాగంగా పరిగణిస్తోంది.



# రచన మాసపత్రిక

1997 జనవరి రచన జన్మదిన సంక్రాంతి ప్రత్యేక సంచిక. కథా స్పెషల్ అనుకోవచ్చు. ఇందులో మొత్తం 33 కథలున్నాయి. వీటిలో మూడు నాలుగు మాత్రమే అతిమామూలుకథలు. మిగిలినవన్నీ మంచి కథలుకాగా వాటిలో కొన్ని మరీ మంచివి.

మొట్టమొదటిదైన "నైమిశారణ్యంలో సత్రయాగం". ఈ కథలు రచయిత మునిపల్లె రాజుగారు పాఠకుల్ని పురాణేతిహాసాల కాలంలోకి తీసుకువెళ్ళారు. భగ్న ప్రేమికుని చేతిలోనే అతని ప్రియురాలు కన్నుమూయడం 'ఇతివృత్తం'.

రావినూతల సువర్ణాకన్నన్ రచించిన "ఇలా ఎందరు" చాలా మంచి కథల్లో ఒకటి పుకార్లు సృష్టించి కలతలు రేపి ఆనందించే యువదంపతులు భంగపడడం ఇతివృత్తం.

ఆర్.ఎస్.ఎ. వరప్రసాద్ "మెజారిటీ" భారతంలోని శ్రీకృష్ణుని కపటనిద్ర ఉపాఖ్యానానికి ఆధునిక పారడీ.

వాడ్రేవు రమాదేవి "విమలచారుజలప్లుతాం" పారిశ్రామికీకరణ మూలంగా గోదావరి జలాలు ఎంతగా కాలుష్యం అయినదీ తెలుపుతుంది. రాయలసీమనుంచి వచ్చిన చెంగల్రాయుడి మురికిగోదావరిలో స్నానం బదులు ఆకాశగంగ వంటి వర్షంలో స్నానంచేసి పరవశిస్తాడు.

శ్రీచంద్ర "నిర్ణయం" చదువుతున్నవాడికి బ్రతుకుతెరువు కేవలం గవర్నమెంట్ ఉద్యోగమేకాదు అని చూపుతోంది. రాజమోహన్ "తిక్కశంకరయ్య". పెళ్ళి వద్దనుకున్న

శంకరయ్య బ్రహ్మచారులను సంఘంలో వున్న చిన్న చూపుని చూసి పెళ్ళాడడం ఇతి వృత్త రచయిత హాస్యంకోసం ప్రయాస పడినా, హాస్యంలోకాని, కథనంలోకాని క్రొత్తదనం లేదు.

యస్.ఆర్. వల్లూరి రచించిన "రాజకీయకొంగజపం"ని కథఅనలేము. నేటి రాజకీయాలమీద మామూలు సెటైర్అనవచ్చు.

విజయగంటిరచించిన "అందరివాడనునేనే" శ్రీకృష్ణుడు వివిధ వ్యక్తులతో వివిధ పాత్రలను ఎలా నిర్వహించిందీ హృద్యంగా చెప్పినకథ. కన్న చేసే కొంటె అల్లరితో విసిగిపోయిన పరంధామయ్యగారు ఆ కన్నే తన భార్యను రక్షించడంతో, ఆబాలుని పట్ల అభిమానం పెంచుకుంటారు.

"అడిగేవారుంటే" లో తమసాటి ఉద్యోగులకి ఒక రూలు బయటి వారకి మరో రూలు చెప్పే గవర్నమెంటు ఉద్యోగికి కీలెరిగి వాత పెట్టిన వైనం - రచయిత కోనేటివివేకానంద.

"కొత్త రచయిత ఆత్మకథ" ؛ మాడభూషి రామగోపాల్ ఆధునిక తెలుగు సాహిత్యంలో బ్రాకెట్ వేసిన ఇద్దరు నం.1 రచయితలపై చేసిన వ్యంగ్యరచన. అయితే ఇందులోని రాములమ్మ ఉపాఖ్యానం, ఒక నం.1 రచయిత తమ రచనలపై ఇతరులు చేసే విమర్శలపై సంధించిన సవాల్ పై ఆలోచనలు రేకెత్తిస్తుంది. అతి జాగ్రత్తపడ్తూ ప్రవర్తించేవారు అనవసరంగా చిక్కుల్లో ఎలా పడ్తారో చెప్పే మంచి కథ.

డి.ఆర్. ఇంద్ర "జగములేలేపరమాత్మ" ఇప్పటికీ నిజాయితీ వదులుకోలేని మధ్యతరగతి ఉద్యోగి, అతిగా విసిగిస్తే ఎలా ఎదురుతిరుగుతాడో చెప్పే మంచికథ.

సీనియర్రైటర్ ముద్దంశెట్టి హనుమంతరావు "తెలవారింది" అపస్వరాలు సహించలేని ఒక సంగీత ప్రియుని అంతరంగాన్ని, ఒక సామాన్య నాదస్వరగాయకుని సహృదయతను చక్కగా చూపిన మంచికథ.

ఇలపావులూరి మురళీమోహన్రావు "నిన్నునిన్నుగా ప్రేమించుటకు" సవతితమ్ములు, చెల్లెళ్ళకోసం సర్వ త్యాగం చేసిన ఒక అన్న కథ. అందరూ మంచి వారే అయినా అందరిలో ఏదో అసంతృప్తి. ఎవరినీ తప్పుపట్టలేం. కానీ ఏదో వెలితి. మంచికథే.

యం.బి.యస్. ప్రసాద్ ప్రతినెలా రాసే 'అచలపతి కథలలో' ఈ నెల కథ' అచలపతీ - క్రి"కేటూ". ముడుపులు మింగి ఆటను భ్రష్టుపట్టించే క్రికెట్ ఆటగాళ్ళపై మంచి సెటైరు.

ముసునూరు రఘువర్మ "ఆర్తి" భార్యను పోగొట్టుకున్న ఓ అభాగ్యుని ఆవేదన. ఇతివృత్తంపాతది. కథనం , భాష కృతకంగా ఉంది.

ప్రఫుల్ల చంద్ర "జనవరిఫస్టు" - సంస్కృతభూయిష్టమైన తెలుగును మాట్లాడాలనుకొనేవారి పై వ్యంగ్యరచన కొత్తదనం లేదు. "కొడగు" అనే పదాన్ని ఇంగ్లీషువారు "కూర్గ" చేశారు. ఈ విషయం రచయితకి తెలిసినట్లులేదు. 'కూర్గ' అనేవాడరు. "గురిఎరుగని బాణం" - ఆటోబయోగ్రఫీగాసాగి, అనూహ్యమైన ముగింపును చూపిన మంచి కథ - రచన - దాసరి అమరేంద్ర.

మాధవరపు కృష్ణ రచన "పెద్దపులి పేరంటం". ఊరి పెద్దలు ఆడే జూదంలో పావులు ఏకమై తిరగబడితే ! పెద్దలు ఊరుకుంటారా? వైరం మరిచికలిసిపోరూ. కొత్తదనం చూపిన కథ. 'బాధేసౌఖ్యమని" - ఆదూరి వెంకట సీతారామ మూర్తి రచన. సంసారంలో ఎన్నిగిల్లి కజ్జాలు వచ్చినా సంస్కారం చూపే దంపతుల కథ సహజసన్నివేశాలు కూడిన మంచికథ.

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి "పట్టుచీర". మాటలతో నమ్మించి, మరొకరితో కలిసి నాటకం ఆడారు - చవుకబారు పట్టుచీరను, అధికధరకు అంటగట్టాలనే మోసగాళ్ల కథ. అమాయకులకు - ముఖ్యంగా స్త్రీలకు బహుపరాక్.

దైవబలం - ఆత్మవిశ్వాసం - ఈ కోణాలనుంచి సమస్యల పరిష్కారాన్ని ఆలోచించే వివిధ వ్యక్తులమనస్తత్వాల కథ పిజియన్. బాల రచించిన "ప్రశ్న" కథ.

"సమిధలు" - సి.హెచ్. వెంకటేశ్వర రావు రచించిన కథ. ప్రజాదరణలేని ఉద్యమం విజయవంతమౌతుందా ? నక్సలైట్ ఇంట్లో జొరబడ్డ నేరానికి. అతన్ని దాచావంటూ నక్సలైట్‌ల ఘాతుకానికి బలైపోయిన వ్యక్తి భార్యనే పోలీసులు పట్టుకుపోయిన వైనం - కొన్ని తెలంగాణా జిల్లాలలో నెలకొనివున్న నేటి పరిస్థితి. అయితే కథ కొంత కృత్యకంగా ఉంది. స్వాతి రచన "ఆఖరి అంబాలు" - ఒక పిచ్చిది ఇళ్ళముందూ తిష్టవేస్తే కలిగే సమస్యల్ని కొత్తగా ఆలోచిచేట్లు చేసే కథ. "ఆశకొండి" - దాదా హయత్ రచన. చిలిపితనం హద్దుల్లోవుంటేనే బాగుంటుంది. అతికి పోతే ఒక్కసారి మనసుని కలిచివేసే పరిణామాలకు దారి తీస్తుందని చూసే కథ.

ధకనరైమారుతా (తారుమారైన) - కాలేజిలవ్ నేపధ్యంగాగల ఇతివృత్తంతో హాస్యం చిందించాలనే ప్రయత్నం. రచన 'పాలాక్షుడు'. నాదెళ్ల అనూరాధ రచన "అవ్యక్తం" - పంతానికి పోయి కొడుకును దూరం చేసుకున్నా కొడుకు పై ప్రేమపోతుందా? సెంటిమెంట్ కథ. "ఆవుపేడ" - ఎ. రామారావు రచన. ఆవుపేడ వంటిదికూడా

మతకలహాలకు దారి తీయగలదా ? నిప్పురవ్వ ఏ రూపంలోనైనా రావచ్చు దావాగ్నిని సృష్టించడానికి. కాని చివరి వాక్యంలో ఒక వర్గం పై పేరుపెట్టి సానుభూతి చూపడం, అపోహలకు ఆవేదనలకు దారితీసే ప్రమాదం ఉంది.

"అగాధం" - పూడిపెద్ది శేషుశర్మ కథ తలిదండ్రుల పట్ల అభిమానాన్నీ, బాధ్యతనీ వదులుకోలేక, ఆవృద్ధులు ఇమడలేక, భార్య భర్తల మధ్య సృష్టించే అగాధాన్ని చక్కగా చూపిన మంచికథ. నిజానికి ఇందులో భార్యని కాని ఎవరినీ తప్పుపట్టలేం. దుర్గారావు రచించిన "కొత్తపాట" చాలామంచి కథల్లో ఒకటి పొట్టకూటికి వీధిలో ఆడేనర్తకి అంటే అందరికీ అలుసే. పోకిరీకి బుద్ధిచెప్పినందుకు మెచ్చుకున్న ప్రేక్షకులే మర్నాడు కనుమరుగవుతారు తమలో ఎందరికి చెంపదెబ్బలు పడ్తాయోననే భయం కనుక, ప్రసాద్ "ఉయ్యాలలూగవయ్యా" ఓహెన్రీ రచించిన 'పెండ్యులం' ఆధారంగా రచించినది. మనిషికి వెనుకటి గుణం (బలహీనతలు) అంతత్వరగా పోవనిచెప్పే కథ. మరాఠీలో కుసుమాగ్రజ్ రచించిన కథకు ఎల్.ఆర్.స్వామి చేసిన తెలుగు అనువాదం 'అతిధి' అతిధిగా వచ్చిన వాడు కొడుకుని చంపిన వాడని తెలిసినా క్షమించిన ఉదారుని కథ.

ఫిబ్రవరి సంచికలో తొమ్మిది కథలున్నాయి. వీటిలో "అలైగళ్ జయవుదిల్లై అనే పేరుతోను, నాదెళ్ళ అనూరాధ కథ 'నాన్న పుట్టిన ఊరు' "అవ్యక్తం" అనే పేరు తోనూజనవరి'97 సంచికలో - అంటే ఒక నెలముందు వచ్చాయి. ఇది పొరపాటు, అలవాటు తెలియదా. ఇలా పునర్ముద్రించడానికి సంపాదకుని వివరణకూడా లేదు. ఇంక మిగిలిన వాటిలో సత్యంమందపాటి నెలనెలాపాన్ 'గవర్నమెంటాలిటీ' కథల్లో "ఆయనేవుంటే" ఒక యదార్ధ అనుభవగాధ. నేషనలైజ్డ్ బ్యాంకులు ట్రావెలర్స్ చెక్ మార్చడానికి కూడా ఎలా తిప్పలు పెడ్తామో, ప్రైవేట్ సంస్థలు నిమిషాల మీద ఎలా పనులు పూర్తి చేస్తాయో చెప్పే కథ.

ప్రసాద్ రచించిన 'గురివింద" తను చేయబోయిన తప్పును, తానుచేసిన కోడల్ని అర్థం చేసుకున్న అత్తకథ. కె. రామసీతకలంనుంచి వచ్చిన "ప్రాప్తం" పాతతరం వాళ్ళు శోభనం గదిముచ్చట్లను చూడాలని ఆరాటపడే అంశాన్ని చక్కగా చూపిన శృంగారకథ. కాని ఒక రచయిత్రి అంత "వాస్తవికం" గా రాయడం కొంత అబ్బురపరుస్తుంది.

ఎ. సుబ్బారావు రచించిన "శేషప్రశ్న" తెగిన గాలిపటాల వంటి రెండు జీవితాలు కలిసి హాయిగా వుంటున్న సమయాలు విధి విడదీసిన జాలి గాధ అయితే కధనంలో కొంత గందరగోళం ఉంది.

"దంతకౌముది - దంతకౌముది" వనఫూల్ మూల రచనకు ఆర్.వి.లక్ష్మి దేవి అనువాదం. వేశ్యనిజాయితీని కొత్తకోణం నుంచి చూపిన కథ ఇది.

డాక్టర్.టి.వి. చలం రచన "స్లాటర్ హౌసూ - స్లాటెలాట్మెంటూ" దూరదర్శన్‌లో ఎపిసోడ్స్ సంపాయించడం పై సెటైర్ అయితే అతిశయోక్తి పాలు ఎక్కువగా ఉంది.

కాలువ మల్లయ్య కథ "అన్న" తెలంగాణాలో దోపిడీని, వెట్టిచాకిరిని, రౌడీయిజాన్ని అంతం చేయడానికి కంకణం కట్టుకున్న 'అన్నలు' తీవ్రవాదులా ? అన్న ప్రశ్నను రేపుతుంది. అనేక గ్రామాల్లోని యదార్థ పరిస్థితులకి దర్పణం పట్టేకథ.

మార్చిలో ఎనిమిది కథలు ఉన్నాయి.

మంజరి రచించిన "నిమిత్తమాత్రుడు" ఆలోచన్లురేపే మంచి కథ. కులరహిత సమాజం కావాలని గగ్గోలు పెట్టే ప్రభుత్వం తన అప్లికేషన్ ఫారములలో కుల ప్రస్తావన ఎందుకు పెట్టుంది ? ఎప్పటికి మారుతుందీ వ్యవస్థ ?

యం.బి.యస్. ప్రసాద్ ప్రతినెలా రాసే కథాస్రవంతిలో "అచలపతీ - అయుర్వేదంచాక్లెట్లూ" వ్యాపార సరళులపై వ్యంగ్యాస్త్రం.

పి.యస్. బాల రచించిన "జాగ్రత్తండోయ్ - జాగ్రత్త" పుణ్యస్థలాలలో కూడా అప్రమత్తత అవసరం అని చెప్తుంది.

ఉషశ్రీ "ధర్మసందేహాల ఉషశ్రీ" గానే శ్రోతలకు ఎక్కువపరిచయం. కాని ఆయన కథకుడు కూడా. 1962లో ఆయన రాసిన "జ్వలిత జ్వాల" పునర్ముద్రణ ఆలుమగల మధ్య అగాధాలను చూపుతోంది. అయితే కథనం చాలా గందరగోళంగా ఉండి అనేక సార్లు బుర్రగోక్కోవలసి వస్తుంది.

"ఒరసం" ప్రదుష్ మిశ్రా ఒరియా మూల రచనకు మహీధర్ రామశాస్త్రి చేసిన తెలుగు అనువాదం. ఒరిస్సాలోని పేదల కడగళ్ళను కళ్ళకు కట్టినట్లు రాసిన మంచి కథ. కడుపు ఆకలి కంటే, శీలం గొప్పదా ? విశాఖమాండలికంలో రాసిన కథ ఇది.

మాఢభూషిరామగోపాల్ "ఛలో మై హారీపియా" సంసారంలో సత్యం మంద పాటిరచించే 'గవర్నమెంటాలిటీ' కథ "మంచం చెప్పిన లంచం కథ." రిజిస్ట్రేషన్ ఆఫీసులో జరిగే లంచాల కమామీషును ఎత్తి చూపుతోంది.

పి.వి. ప్రభాకరమూర్తి రచించిన "సీతాకోక చిలుక" వేశ్యగా మారిన పడతిని చేపట్టిన ఒక సంస్కారి కథ. మంచి ముగింపు.

ఆగస్టు సంచికను డి. వెంకట్రామయ్య స్పెషల్‌గా అనుకోవచ్చు. ఆయనకు శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్ వారి బుచ్చి బాబు స్మారక పురస్కారం లభించిన సందర్భంగా కాబోలు ఆయన గతంలో రచించిన మూడు కథలను పునర్ముద్రించారు.

ఇందులో మొత్తం పదకొండు కథలున్నాయి.

మొదటిదైన "ఆవుగాంగ్రించును" 1971 'జ్యోతి' లో డి. వెంకట్రామయ్య రాసిన కథకి పునర్ముద్రితం. బంధించి వేధిస్తే పిల్లైనా ఎదురుతిరుగుతుందనే వాస్తవాన్ని చూపుతుంది.

బి. రంగనాథ్ రచించిన "దైవ సన్నిధి" తనను నమ్మిన భక్తుని తనను నమ్ముతున్నట్లు నటించే భక్తులు ప్రాణం తీసిన కథ.

సత్యం మందపాటి నెలనెలా రచించే కథా పరంపరలో ఈ నెల రచించిన "నాలుగు కోతి" ఓఇన్స్పెక్టర్ కబళించిన లంచం ఆతని పాపనే బలిగొన్న వైనాన్ని చూపుతుంది. ఇది కొందరు లంచగొండులనైనా మార్చగలిగితే సంతోషమే. నివాస్ రచించిన "ఆకలి" ఎంతటిపనైనా చేయిస్తుంది. ఆఖరికి, అమ్ముకోవాలనుకున్న ఉంగరం ఊడిరాకపోతే, వేలుని నరుక్కునేటట్లు చేస్తుందని నిరూపిస్తుంది.

పి. పద్మశ్రీ రచించిన "సుమతి ప్లస్ పాయింట్" పిల్లలు లేక పోవడాన్నికూడా ఒక ప్లస్ పాయింట్‌గా చూడగలిగిన ఒక స్త్రీ మూర్తి కథ.

డి. వెంకట్రామయ్య 24-4-72 ఆంధ్రజ్యోతి లో రచించిన "మీ ఓటు నాకే" కి పునర్ముద్రితం. ఫలితం శూన్యమైన పార్టీ అభ్యర్థుల వాగ్దానాలు ఇతివృత్తంగా గల ఈ కథ ఈ నాటికీ మారని రాజకీయ వ్యవస్థని చూపుతోంది.

మరువాడ రాజేశ్వర రావు రచించిన "గోడ" 1971 లో న్యూవేవ్ వారు ప్రచురించిన కథాసంకలనం నుంచి పునర్ముద్రితం. రాజకీయనాయకులు, వ్యాపార ప్రకటనదార్లు బ్రతుకుతెరువు కోసం పిడకలు కొట్టుకునే గోడను కూడ కాజేసి ఆ వృద్ధురాలి నోటికాడ కూడుని తీసేసిన జాలి గొల్పుకథ.

వి.వి.న. మూర్తి రాసిన పెద్ద కథ "సందర్భం" మానవ హక్కులు - విక్టిమ్స్ గురించి ఆలోచింపజేసే కథ.

మాదవరపు కృష్ణ రచించిన "పాలేళ్ళకో ఇంటర్వ్యూ" కొత్తరకపు వ్యంగ్యాత్మక కథానికి. యల్. కె. జి. పిల్లలకూ వాళ్ళ తల్లిదండ్రులకూ కూడా ఇంటర్వ్యూలు కామన్ అయిన ఈ రోజుల్లో పాలేళ్ళను కూడా ఇంటర్వ్యూ ద్వారా ఎందుకు ఎంపిక చేయకూడదు?

మరువాడ రాజేశ్వరరావుదే మరోకథ "జెండా" పార్టీల జెండాల చాటున జరిగే ఘోరాలకు అద్దం పట్టుంది. ఇది స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక సంచికని కాబోలు 16-6-72 ఆంధ్రజ్యోతి వారపత్రికలోంచి ఎత్తి పునర్ముద్రించారు. అయితే ఒకే సంచికలో, ఆ రచయిత ఎంతటి లబ్ద ప్రతిష్టుడైనా, ఆ కథలు ఎంతగొప్పవైనా, రెండు కథలు

వేయడం ఎంతవరకు సబబు అనేది ఆలోచించవలసిన విషయం. (ఆ సంచిక ఆరచయితకి ప్రత్యేకం అయితే ఆదారివేరు).

డి. వెంకట్రామయ్యదే మూడోకథా "పండగొచ్చింది" 3-11-72 ఆంధ్రజ్యోతి వారపత్రిక నుండి పునర్ముద్రితం. పాతికేళ్ళస్వతంత్ర భారతంలో మారని పేదల బ్రతుకులకి దర్పణం పట్టేకథ ఇది.

సెప్టెంబర్‌లో పన్నెండు కథలున్నాయి.

వసుంధర రచించిన "ఆరోప్రాణం". ముఖంముందు ముచ్చట్లూ, వెనక చప్పట్లూ లక్షణం ప్రతిమనిషిలోనూ అంతో ఇంతో ఉంటుంది. ఈ లక్షణం ముఖ్యంగా పాతతరంవారిలో అందులోనూ ఆ తరానికి చెందిన ఆడవాళ్ళు చాలామందిలో కనిపిస్తుంది. ఈ లక్షణాన్ని పట్టించుకోకుండా అట్టివ్యక్తులను దూరంగా ఉంచడం మంచిదని సూచిస్తుంది ఈ కథ.

శారద రచించిన "అభిమాని విన్నపం" ఇది ఒకసాంప్రదాయక ఇల్లాలు, జుగుప్సాకరమైన నేటి సినిమాలలో అసభ్యంగా అగుపించే నాయికికి ఆవేదనతో రాసిన ఉత్తరం. దీనిని కథగా భావించాలంటే "కథ" అన్న పదానికి నిర్వచనాన్ని మార్చవలసి ఉంటుంది.

బి.వి. రమణారావు చించిన "ఇదీ ఓ కథే" ప్రసిద్ధ రచయితలలో అంతర్గతంగా వుంగే ఇగోని చక్కగా చూపిన మంచి కథ. కొత్తనీరు వచ్చి పాతనీటిని నెట్టివేయడం సహజం.

రమేష్ రాయ్ "మమకారం" బస్ ప్రయాణాన్ని హాస్యవంతంగా వర్ణించి, కలుక్కుమనేట్లుగా ముగింపునిచ్చిన మంచికథ.

ఉపద్రష్టసాయి "చెఱ" మధ్యతరగతి వారు మామూలుగా ఎదుర్కొంటున్న సమస్య. ఇన్‌స్టాల్‌మెంట్‌లు కట్టూ ఇల్లు ఏర్పరచుకునేవారు. ఆ అప్పుతీరేవరకూ ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కోవలసింది. ఆ ఇల్లే ఒక చెరగా మారి జీవితాన్ని ఎలా దుర్భరం చేయగలదో చూపించే మంచికథ.

సత్యం మందపాటి నెలనెలా అందించే 'గవర్నమెంటాలిటీ' కథల్లో ఈ నెలకథ "ముందుచూపు-మూణ్ణాళ్ళముచ్చట." ఇందులో సాంకేతిక విప్లవం దేశాన్ని ఎలా అభివృద్ధి పథంలోకి నెట్టుతోందో చూపించారు రచయిత. ఇది వ్యాసమేకాని కథకాదు. కృష్ణ రచించిన "గుహలు" తెల్లవాళ్లుమనల్ని అసహ్యించుకుంటూ బాధపడ్డం. మనకంటే

నల్లవారిని చూసిమనము అలాగే అసహ్యించుకుంటాం. ఈ అంశాన్ని చక్కగా చూపినకథ.

సమరేశ్‌బసు బెంగాలీలో రచించిన "ఆదాబ్" కు ఘండికోట బ్రహ్మాజీరావు అదేపేరుతో చేసిన తెలుగు అనువాదకథ. మతకల్లోలాలు అమాయక సామాన్యమానవులలో ఏమతానికి చెందిన వారినైనా ఒకే విధంగా బాధిస్తాయనిచూపే మంచికథ.

మొవ్వ బాబు రావు "అమానుష్" మంచి కథ. అధికారంలో వుంటే అందరూ రాజులే. ప్రమోషన్ న్యాయంగా రావలసినా రాకుండా అడ్డుపడ్డ ఆఫీసర్ పెన్షన్ పేపర్స్‌ని నొక్కిపట్టకుండా ఔదార్యం చూపడం ఇతివృత్తం. అయితే కథ ప్రథమ పురుషలో నడవడంతో సహజత్వం దెబ్బతింది. కోలపల్లి ఈశ్వర్ రావు రచించిన "చెవిలోపువ్వు" ఒక ప్రేమాయణపు సరదాకథ.

ఆర్.యస్.కె.మూర్తి రచించిన "తోపుడుబండి" ఒక పెన్షనర్‌కీ, రోడ్ ప్రక్కన తోపుడు బండిపైన తినుబండారాలు అమ్ముకునే కుర్రవాడికీ మధ్యన ఏర్పడిన అనునబంధాన్ని చక్కగా చూపిన మంచికథ.

యం.బి.యస్. ప్రసాద్ నెలనెలా రాసే "అచలపతికథలు" సీరీస్‌లో ఈ నెల కత "అచలపతీ-యయాతి మామయ్య". రక్తమార్పిడి ద్వారా యవ్వనాన్ని పునరుద్ధరిస్తే ఎలావుంటుందీ అన్న విషయంమీద హాస్యరచన.

అబ్బూరి ఛాయాదేవి రచన "మాది-మీది" మన వాళ్ళకి కమ్యూనల్ సెన్స్ బాగానే వున్నా కమ్యూనిటీ సెన్స్ బొత్తిగాలేదు. సివిక్‌సెన్స్ అసలే లేదు. ఫ్లాట్‌లలో వుండే వాళ్ళు సాధారణంగా విద్యావంతులు - ఉద్యోగస్తులు కాని ప్రతిదానికీ మాది మీది అన్న భేదభావం చూపిస్తూ నీచంగా ఎలా ప్రవర్తిస్తారో చూపే మంచికథ.

నవంబర్ సంచికలో 18 కథలున్నాయి.

ఆర్. ఉష రచించిన "గంగార్పణం"కి ఒక ప్రత్యేకత ఉంది. ఇది 'రచన' నిర్వహించే 'కథాపీఠం' శీర్షికలో ఎంపికైన మొదటి కథ. రచయిత్రితొలి కథకూడానట. భారతంలోని పాత్రలపేర్లు, సన్నివేశాలను ఆధునిక కాలానికి అనుగుణంగా మార్చి రాసిన అన్యాపదేశపుకథ. భారతంలో గంగ, పుట్టినపిల్లల్ని వెంటవెంటనే గంగార్పణం చేస్తే ఈ కథలోని జాహ్నవి మొదటి ఐదుగురు పిల్లల్నీ పుట్టిన వెంటనే తండ్రికి కూడా చూపకుండా ఎక్కడకో తీసుకుపోతుంటుంది. ఆమె ఏమి చేసినా మాట్లాడనని మాట ఇచ్చిన శంతను నోరుమూసుకొని ఊరుకుంటాడు. చివరికి ఆరోబిడ్డని కూడా తీసుకుపోతుంటే, తట్టుకోలేక అడ్డుపడతాడు. ఆ ఆరుగురు పిల్లలూ గతజన్మలో ఐ.ఏ.యస్, ఐ.పి.యస్, యం.బి.బి.యస్ వంటి గొప్ప పరీక్షలకుచదివి ఫెయిల్ కావడంతో

ఇతరులు చేసే హేళనను తట్టుకోలేక ఆత్మహత్యచేసుకున్నవారట. వాళ్ళు జాహ్నవి కలలో కనబడి, తాము పుట్టిన వెంటనే రెసిడెన్షియల్ స్కూల్లో జేర్పమని కోరారట. అందునే ఇంతకుముందు ఆ ఐదుగురినీ తీసుకువెళ్లి జేర్పించిందట. ఇప్పుడు శంతను మాటతప్పాడు కనుక "ఈ బిడ్డను నువ్వే పెంచుకో. నేను పోతున్నాను "అంటుంది. "గొప్ప చదువులు చదవని ప్లిలలు నాకువద్దు. ఈ పిల్లలని కూడా అదే రెసిడెన్షియల్ స్కూల్లో జేర్పిద్దాం పద. " అని తానూ వెంట వెళ్తాడు. నేటి విద్యా విధానం మీద క్రొత్తరకం సెటైర్ ఇది.

బి.వి. రమణారావు రచించిన "అపరిష్కృతం" మనసుని కదిలించే మంచికథ. మనిషి బాహ్యరూపం చేసి ఆతని ప్రజ్ఞని తప్పుగా అంచనావేయడం మూలంగా ఒక మంచి కవికి న్యాయంగా రావలసిన సువర్ణ అవకాశం పోవడం, ఆ విషయం తెలిసేసరికి ఆ కవి దయనీయ పరిస్థితులలో మరణించడం ఇతివృత్తం.

ఎ. అన్నపూర్ణ రచించిన 'సెలయేటి అట" కొత్తకోణంలో వచ్చిన మంచి కథ. అసంతృప్తి లేని అనుకూల దాంపత్యం లభించడం అదృష్టమే. అయినప్పటికీ కొన్ని సందర్భాలలో ఇతరులపట్ల సన్నిహితాన్ని కోరుకునే ఆకర్షణ ఏర్పడవచ్చు.

అందులో సెక్స్ ప్రమేయం లేకపోవచ్చు. అయినా అదీ ఒక విధమైన మానసిక వ్యభిచారమేనన్న ఆవేదన పీడిస్తుంది. వయసు మీరిన విమల దంపతులకు మరో వృద్ధజంట అయిన శారదా మోహన్‌లతో పరిచయం ఏర్పడుతుంది. క్రమంగా విమలా మోహన్‌రావులకి పరస్పర ఆకర్షణ ఏర్పడి ఒకరినొకరు విడిచి వుండలేని స్థితికి వెళ్తారు. ఆ విషయం భర్తకి చెప్తే అది సహజమేననీ, తప్పుకాదనీ అంటాడు. శారద తన భర్తని బయట ఎక్కువగా వుండడానికే, అంటే పరోక్షంగా విమలతో ఎక్కువగా గడపడానికే ప్రోత్సహిస్తుంది. ఈ మానసిక సంఘర్షణలకు పరిష్కారం చూపిన చక్కని కథ.

యల్.ఆర్. స్వామి రచించిన "వంతెన" మరో మంచి కథ. సాటి మనిషి ప్రమాదంలో ఇరుక్కుని కొట్టాడుకుంటున్నా పట్టించుకోని ఆధునిక ప్రపంచంఇది. ఒక ప్రముఖ శాస్త్రజ్ఞుడు అది మెడికోలీగల్ కేసుకావచ్చునన్న భయంతోనూ, ఒక స్వామీజీ అతడు "తనవాడు" కానందునా సహాయం చేయగలిగే చేశారు. చివరికి నిరక్షకుక్షులైన కూలీలే స్వచ్ఛందంగా సహాయం చేస్తారు. "ఎవరు నిజమైన సంస్కారవంతులు" అన్న ప్రశ్నను రేకెత్తించే మంచికథ.

ప్రతినెలా సత్యం మందపాటి రాసే 'గవర్నమెంటాలిటీ' కథలలో ఈ నెలకథ "పంచతంత్రం". నేటి రాజకీయాల పై సెటైర్.

పి.యస్.నారాయణ "చీకటి రాల్చిన చుక్క" - ఎవరో తన లారీలో వదిలిన

పసిగుడ్డుని ప్రేమతో స్వీకరించిన ఒక దయార్ద్రహృదయుడైన డ్రైవర్‌కథ.

"మనసానిద్దరోయింది" - అరిపిరాల విశ్వం 22.3.61 ఆంధ్రపత్రిక వీక్లీ నుంచి పునర్ముద్రితం. దేవుడి మాన్యాలను ఊరిపెద్దలు ఎలా స్వాహా చేస్తున్నదీ. ఆ యజ్ఞంలో ఎందరో అమాయకులు సమిధలైనదీ చెప్పే మంచి కథ.

నెలనెలా యం.బి.యస్. ప్రసాద్ రాసే "ఆచలపతికథలు" లో ఈ నెలకథ "అచలపతి-ఆశాపరులూ" ఫైనాన్స్ కంపెనీలు చేసే మోసాల మీద సెటైర్.

వి. రామలక్ష్మి రచించిన "ఆమెకి ఇల్లు లేదంటారే?" కవనశర్మగారి రచనకు రాజాయిండర్.

కె.యమ్. వి.జి. కృష్ణమూర్తి "ఏకాకి" ఎవరో చెప్పిన ఆటోబయగ్రఫీ. ఇందులో కథాలక్షణాలు ఏవీకనిపించవు.

"ముష్టిపిల్ల" ఆలోచింపజేసేమంచి కథ. "ముష్టెత్తుకోడానికి సిగ్గులేదూ! పని చేసుకోకూడదు ?" అనడం తేలికే కాని చేస్తానన్నవారికి పనిచూపడం కష్టం. గతిలేక ముష్టెత్తుకుంటున్నా ఆత్మాభిమానానికి కొరతలేదని నర్మగర్భంగా నిరూపించిన ఓ బాలిక దయనీయగాథ.

డి. రమేష్ "పారితోషికం" చెత్తకథలమీద రాసిన సింగిల్ పేజి సెటైర్‌కథ.

వసుంధర రచించిన "కళాకారుడు' క్యారియర్ కుర్రాడి ద్వారా అమ్మాయిల గుట్లు తెలుసుకోవాలని ఆరాటపడే అబ్బాయిలకథ.

"ఎదురు తిరిగిన ఆయుధాలు" బోయ జంగయ్య కథ. ఒక అగ్రవర్ణం అమ్మాయిని ఒక దళితుడు సినిమాహాలులో అవమానం చేసిన ఫలితంగా పదిమంది దళితులు ఊచకోతకు గురయ్యారు. అసలు వ్యక్తి చచ్చిన వారిలో లేకపోవడంతో, పైగా అతను ఊరిపెద్దలకు కంట్లో రాయిగా ఉండడంతో, పోలీసుకానిస్టేబుల్‌కి లంచం ఇచ్చి కాల్చేయమంటారు పెద్దలు. అతను ఆ హత్య చేయడంతో సస్పెన్షన్‌కు గురిఅవుతాడు. విచారణ కమీషన్ ముందు ఊచకోత గురించి ఎవరూ సాక్ష్యం చెప్పరు. వివరణ సస్పెండ్ అయిన పోలీసువాంఙ్మూలం ఒక గుడ్డి వాని సాక్ష్యంతో అసలు హంతకులెవరో తెలుస్తుంది. "చుండూరు సంఘటన"ను గుర్తు తెస్తుందీ కథ.

కాళీగోపాల్ రచన "ఎక్కడవేసిన..." దేశంలో ప్రభుత్వ కార్యాలయాల పని తీరుమీదా, సంస్కరణలు కాగితాలకే పరిమితమైన వ్యవస్థమీదా ఒక్క పేజీ సెటైర్ కొత్తదనం లేదు.

బి. శ్రీనివాసులు రచించిన "మాకూతెలివితేటలు" ఒక ముప్పావు పేజీ గందరగోళపుకథ.



# వనితాజ్యోతి మాసపత్రిక

వనితాజ్యోతి వారు ముఖ్యంగా చిన్న కథలకి ప్రాధాన్యత నిచ్చారు. ఇవి వస్తు రీత్యా కానీ, శిల్ప రీత్యాకానీ చెప్పుకోదగ్గస్థాయిలో లేనవి చెప్పవచ్చు. కొన్ని కథలు మరీ చిన్నపిల్లలు రాసినట్లున్నాయి. అయితే మెచ్చుకోవలసిన విషయం ఏమిటంటే కొత్త వారిని బాగా ప్రోత్సహించడం.

ప్రతినెలా మూడునుంచి ఆరు కథల వరకూ వేశారు. కొన్ని క్లూ కథలు వేసి పజిల్ పెట్టారు. పెద్ద కథలు (రెండు వారాలు) రెండువేశారు. ఆర్. వి. లక్ష్మి గారు అనువాదం చేసిన రవీంద్రనాథ్ టాగోర్ పెద్ద కథ ఒకటి ప్రచురించారు. మరో పెద్ద కథ ఎ.వి.రమామణి గారి "అంతరంగతరంగాలు".

"దీర్ఘసుమంగళీభవ" డా॥ ఎన్. పార్వతీదేవి గారు రాసిన కథ. భర్త వంశంలో అంతాఅల్పాయుష్కులని కొడుక్కి పాతికేళ్ళుదాటే వరకూ ఆగి, అప్పుడు పెళ్ళి తలపెడుతుంది. కాబోయే కోడలిచేత దీర్ఘసుమంగళి కావాలని మెట్ల పూజ చేయిస్తుంది. ఆ పెళ్లి కాకముందే కొడుకు మరణిస్తాడు. ఆ అమ్మాయికి మరో అబ్బాయితో పెళ్ళి అవుతుంది. మనిషి ఊహలకందని విధివిచిత్రమైన తీరు మనల్ని చకితుల్ని చేస్తుంది. కథ చెప్పటం బావుంది.

"ఆడతనం" కథలో మగవాళ్ళకు తీసిపోనివిధంగా ఆడవాళ్ళుకూడా మోసాలు చేస్తున్నారు. ఇదంతా ఆడతనమేనా అని ప్రశ్నిస్తారు రచయిత్రి ఎం. జయశ్రీ. వ్యాసంలాసాగిన కథ.

"ఆకళ్ళేవర్షిస్తే", సత్యవాడసోదరీమణులకథ. బిడ్డలిద్దర్నీ తల్లి నర్స్ ఉద్యోగం చేస్తూసాకుతూ ఉంటుంది. ఇరుగుపొరుగుల మాటలు విని తల్లి తమతండ్రి గురించి బెంగపడడం లేదని కొడుకులు నిలదీస్తారు. తర్వాత పశ్చాత్తాప పడి పెద్దయ్యాక ఒక నర్సింగ్ హోమ్‌స్థాపిస్తారు. కథచెప్పడంలో స్పష్టత, అవగాహన లేదు.

డాక్టర్ షహానాజ్ బతుల్ గారి "జ్ఞానోదయం" కథలో అత్తగారిని సరిగా చూడని స్నేహితురాలిని ఉత్తరం ద్వారా మారుస్తుందామె ఫ్రెండు. మనుషులు ఇతరులు వివరించిచెబితే వింటారన్న ఆశావాదం ఉన్న కథ.

"తిరస్కృతి" కథలో వరవిక్రయ పోటీలో అమ్మాయిల తల్లిదండ్రులు అతడిని వేలం పాటలోలా మేమంటేమేమని కొనాలని చూస్తుంటారు. పెళ్ళికుమారుడు నిమిత్తమాత్రంగా ఉండి చూస్తుంటాడు. వేలంపాటలోనెగ్గిన తలిదండ్రుల కూతురు మాత్రం ఇతనినైజాన్ని గమనించి తిరస్కరిస్తుంది. స్త్రీ తరపునుంచి ఆలోచిస్తూ వ్యక్తిత్వవికాసానికి దోహదపడే కథ. రాసిన వారు గౌతమి.

"మగజన్మ" కథ మగదూడ ఆత్మకథ. ఇంటి యజమాని తన చేత పొలం పనులు చేయించుకోవడానికి పెట్టిన బాధల్లో మగతనం పోగొట్టడం ఒకటి ఇంతకాలం ప్రేమగా చూసినదిందుకా? అని దుఃఖిస్తుంది. యజమాని తన భార్య ఆడపిల్లని కనబోతోందని స్కానింగ్ వల్ల తెలుసుకుని ఆమెకు అబార్షన్ చేయిస్తానంటాడు. తన తల్లి కూడా ఇలాగే తనని కనకుండా చేసుకుని ఉండవలసిందనీ, ఎద్దు జన్మ మరోసారి వద్దనే అనుకుంటుంది. కథచెప్పిన తీరు బావుంది. ముగింపులో పోలిక బావుంది. (పుట్టాక ఇన్ని కష్టాలుంటాయి కాబట్టి పుట్టకపోతే బావుండన్న భావం ఆడపిల్లకి వర్తిస్తుంది.) ఈ కథారచయిత్రి హోతాపద్మినీదేవి. ఈమె రాసిన మరోకథ "మనింటి పుల్లకూర" పాతచింతకాయ పచ్చడే.

జె. తాయారమ్మగారి కథ "మనుషులు-మమతలు". 15 సంవత్సరాల తర్వాత తల్లిదండ్రులుపోయాక ఊరికి వెళ్ళిందామె. అన్నలూ, వదినలూ ముక్తసరిగా మాట్లాడతారు. చిన్నప్పుడు ఇంట్లో పనిచేసిన ముసలయ్యమాత్రం ఆప్యాయంగా మాట్లాడి, మమతల వెల్లువని గుర్తుచేసి ఒయాసిస్సును తలపిస్తాడు. సహజమైన కథ.

అన్నపూర్ణ గారి "వక్రరేఖలు" ఒక స్కెచ్. తాతయ్య, అమ్మమ్మలు మావయ్యలకు దూరంగా ఉండడానికి కారణం అడుగుతుంది కూతురు తల్లిని. కొడుకులిద్దరూ కులాంతర వివాహాలు చేసుకున్నారన్న కోపంతో వృద్ధ తల్లిదండ్రులు వారికి దూరంగా ఉంటారు.

"అసమర్థుని ఆవేదన" కథలో ఆర్థికంగా ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కొని కష్టపడి చదివిన రాంబాబుకి ఎంతకీ ఉద్యోగం దొరకక పోవడంతో నిరాశపడి ఆత్మహత్య చేసుకుంటాడు. కథ చెప్పిన తీరుచదివించిది. రచయిత్రిపేరు లేదు.

శ్రీమతి న్యాయపతి కమలారాంజీ కథ "పవర్‌కట్". పెళ్ళి చూపులయాక పెళ్ళి నాలుగు రోజులుందనగా పెళ్ళికొడుకు కాలొకటి కృత్రిమమైనదని తెలిసి ఇంటిల్లిపాదీ ఆ సంబంధం వద్దనేస్తారు. కానీ పెళ్ళికొడుకు రాసిన ఉత్తరం చదివిన పెళ్ళికూతురు అతని నిజాయితీకి మెచ్చి అతన్ని పెళ్లి చేసుకుంటుంది. మానవత్వం ఉన్నకథ.

ఎ.వి.రమామణి గారి "అంతరంగతరంగాలు" పెద్ద కథ ఉత్తమపురుషలో సాగుతుంది. ఇష్టం లేని భర్త దగ్గరికి వెళ్ళనని ఆత్మహత్యాప్రయత్నం చేస్తుంది శారద. భర్తమేనమామే. కొంత కాలంతర్వాత ఆ ఊరికి వెళ్లిన రచయిత్రికి ఇప్పుడు శారద భర్త దగ్గరికి వెళ్లి సంతోషంగా ఉందనీ. తన ఫ్రెండ్ కాలువంకర ఉన్నవ్యక్తిని ఇష్టపడి పెళ్ళిచేసుకుంటూందనీ తెలుస్తుంది. ఇంత కాలం ఉన్న అభిప్రాయాలు తొలగిపోతాయి. తల్లిదండ్రులుకూడా పిల్లల మంచి కోరే పెళ్లి చేస్తారని గ్రహిస్తుంది. తను కూడా తల్లిదండ్రుల ఇష్టప్రకారమే పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకుంటుంది. మామూలుకథ.

లంక సూర్యకాంతం గారి "శిక్ష" కథలో చక్కని ట్విస్ట్ ఉంది. గర్భవతినిచేసి అక్కను పెళ్ళిచేసుకున్నాడని బావమీద కోపం పెట్టుకుంటాడతను. ఆ బావకదిరెండవ పెళ్ళి. మొదటి భార్యచనిపోతే చేసుకుంటాడు. అతని కొకకూతురుంటుంది. బావపై కసితో ఆ పిల్లను లేవతీసుకుపోయి పెళ్లిచేసుకుంటాడు. తర్వాత కొంత కాలానికి అతను అక్కను చూడడానికి వచ్చి తను చేసిన పనికి తట్టుకోలేక బావ మరణించినట్లు తెలుసుకుంటాడు. పైగా ఎవరివల్లో గర్భవతైన అక్కను పెళ్ళాడిన ఉత్తముడు బావని తెలిసి పశ్చాత్తాపపడతాడు.

"జాన్ పదహారవతేదీ" కథరాసిన వారు గాదె. ఇటీవల బాధ్యతారహితంగా రాస్తున్న శృంగార కథల పరంపరలో వచ్చిన కథ ఇది. అయితే దీనిని స్త్రీల మాస పత్రికలో ప్రచురించడం విచిత్రం. భర్తసరసుడుకాడు. పిల్లలు లేనందుకు పరీక్షచేయించుకోవడానికి డాక్టరు దగ్గరికి రానంటాడు. ఊరికివెళతాడు. ఆ రోజు ఆమెకు అండం విడుదలయ్యే రోజు. భర్త స్నేహితుడు వస్తాడు. రాత్రి అతనితో తాను గొడ్రాలిగా ఉన్న విషయం చెప్పి దుఃఖించి. ఓదార్పు పొంది, ఆమె అతనితో సంగమిస్తుంది. ఇలాంటి కథల వల్ల రచయితలు ఏం చెప్పదల్చుకున్నారనేది భగవంతుడికి తెలియాలి.

"మార్పు" కథ బి.వి. శేషమాంబగారు రాశారు. తన చిన్నప్పటిలా కూతురు

అట్లతద్ది ఆటలాడాలని తల్లికోరిక. "పాతరోజుల్లో సరదాలు ఇప్పుడు తీరవు. కాలం మారుతూంది కాబట్టి అభిరుచులూ, ఆచారాలూ మారుతాయి. ఆనాటి సరదాలు ఇప్పుడు కావాలంటున్నావ్ అయితే ఆధునిక సదుపాయాలు లేని వెనకటి జీవనం జీవిస్తావా ?" అని భర్త అంటాడు. పేలవమైన కథ.

"రాఖీ ఒక రాచబాటా?" ఒక్క స్కెచ్. రాఖీని కొందరు అపవిత్రం చేస్తున్నారనీ. అలాచెయ్యడం వల్ల రాఖీకి మచ్చ వస్తుందనీ. అన్నా చెల్లెళ్ళ అనురాగానికి ప్రతీకగా దాన్ని గౌరవించాలనీ రచయిత్రి యలమర్తి అనూరాధ చెబుతారు చివర్న.

"మార్పు" కథలో భర్తతో సహా అత్తింటి వారి ఉన్నతాదర్శాలు కోడలికి నచ్చవు. వాళ్ళు కట్నం వద్దన్నా తను తెచ్చుకుని తనపేర దాచుకుంటుంది. అత్తగారి మంచితనం, భూతదయ ఆమెకి నచ్చవు. అత్తమామలు విడిగా వెళ్ళి వుంటారు. పెద్దవాళ్ళు పెద్దమనసుతో చేస్తే చిన్నవాళ్ళు మెల్లగా తెలుసుకుంటారనీ, అంతవరకూ ఎదురుచూస్తామనీ వాళ్ళంటారు. కథ సాఫీగా సాగకపోయినా మార్పు నాశించే కథ. రాసిన వారు తనికెళ్ళ కళ్యాణి.

మొత్తం కథలన్నింటిలోనూ ఆణిముత్యం అనదగిన కథ "మనిషిలో మనసు". అక్క డబ్బవసరంలో ఉందని తెలిసి ఆమె అడగక ముందే తమకి మూడువేల డబ్బవసరం ఉందని చెబుతుంది చెల్లి. అది విని అక్కయ్య తన పుస్తెల గొలుసు అమ్మిన డబ్బుతో తమ అవసరం తీరగా ఇంకా మిగిలిందనీ అది తెచ్చిస్తాననీ ఇంటికి పరిగెత్తుతుంది అక్క. ప్రేమాభిమానాలు వ్యర్థమై కేవలం వాణిజ్యపరంగా ఆలోచించే మనుషులకి చెంపపెట్టు పెట్టినట్టుగా ఈ అద్భుతమైన కథ వ్రాసిన వారు వనపర్తి కృష్ణకుమారి.

శైలజా ప్రసాద్ గారి "ఇది పెళ్ళంటారా" స్కెచ్ అయితే శ్రీమతి గిరిరాజు గారి "కొవ్వొత్తి" అర్థం పర్థం లేని కథ. మరొక అయోమయ కథ "పెళ్ళయిపోయింది" రాసిన వారు డేగాచంద్ర శిల్ప. వి.యమ్.ఎస్. స్వాతి గారి "అమలినస్నేహం" అపరిపక్వ కథ.

"మానవత్వం" కథలో వర్షంలో తడిసి వచ్చిన మనిషికి అర్ధరాత్రి అన్నం పెడితే తిని ఆ స్త్రీ చేతినే పట్టుకుంటాడతను. అంతలో అతని భార్యను రక్షించి తీసుకొస్తాడు ఆ స్త్రీ భర్త. అప్పుడతను సాటి మనిషిలోని గొప్పతనాన్ని తెల్సుకుని సిగ్గుపడతాడు. స్త్రీ ఔన్నత్యాన్ని గుర్తిస్తాడు. మానవత్వపు విలువని తెలిపే కథ. రచయిత్రి అల్లూరి సుజాతాదేవి.

కె. వీణారెడ్డి రాసిన కథ "కళ్యాణతిలకం" పెళ్ళిచూపులకు అమ్మాయి హుషారుగా లేకుండా స్తబ్దుగా ఉందనీ, ఆమె నచ్చలేదనీ రాస్తాడు కట్నం లేకుండా చేసుకుంటానని ముందుకొచ్చినతను. ఆమె చెల్లెలు అతని కుత్తరం రాస్తుంది. "అక్క అలా నిరాసక్తంగా మారిపోవడానికి కారణం చాలాసార్లు జరిగి ఫెయిలయిన పెళ్ళిచూపులే తప్ప అది సహజ

ధోరణి కాదని అక్క చాలా హుషారయినదేనని" అప్పుడతను ఆనందంగా పెళ్ళాడతాడు. వాస్తవంతో కూడిన వెరైటీ కథ. బావుంది.

"నమ్మకం" కథలో భర్తను అకారణంగా లేనిపోని అపోహలతో అనుమానిస్తూ రెండు సార్లు ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుందావిడ. చివరికి భర్త ఆవిడ అనుమానాన్ని నిజం చేసి సుఖపడాలనుకుంటున్నానని రాసి ఇంట్లోంచి వెళ్ళిపోతాడు. ఎం. రాజ్యలక్ష్మి గారు కొసమెరుపు బాగా చూపించారు.

"అనురాగం" అద్దేపల్లి సుచిత్రాదేవి గారి కథలో అత్తయ్య, మావయ్య ఎప్పుడూ ఒకరిపై ఒకరు చిరాకుపడుతూ పోట్లాడుకుంటూ ఉంటారు. వాళ్ళ కూతుర్ని పెళ్ళి చేసుకుంటే ఆమె కూడా తల్లిలాగే ప్రవర్తిస్తుందని భయపడి ఆ సంబంధం చేసుకోనని చెబుదామని వాళ్లింటికి వెడతాడు. నిత్యం గొడవపడే అత్తయ్య, మావయ్యల మధ్య గల అనురాగాన్ని దగ్గరగా చూసి చకితుడవుతాడు. ఆనందంగా పెళ్లాడతాడు.

ఎస్. లలిత గారి కథలో పెళ్ళయిన తర్వాత చెల్లెలు డబ్బు గర్వంతో ఇంటికి వచ్చిన అన్నతో ఆప్యాయంగా మాట్లాడదు. తల్లి గురించి పూర్తిగా ఆరా కూడా తీయదు. స్కెచ్‌లో ఉన్న కథైనా చక్కటి సత్యాన్ని చెప్పింది. కథ పేరు "మార్పు".

ఎ.వి. రమామణి గారి "ఆసరా" కథలో ఇల్లాలు పనిపిల్లకు చదువు చెప్పి ఉద్యోగస్తురాలిని చేస్తుంది. ఆదర్శవంతమైన కథ.

"మీరేమంటారు" వ్యాస కథలో కూతురి పెళ్ళికి ఆరు లక్షల కట్నమిచ్చినా అత్తమావల దాహం తీరలేదు. కూతురు ఆత్మహత్య చేసుకుంది. అల్లుణ్ణి కోర్టు కీడుస్తానని బెదిరించి మావగారు పన్నెండు లక్షలు వసూలు చేస్తాడు. ఆనంద పడతాడు. "ఇటువంటి వాళ్ళుంటారా? మీరేమంటారు?" అనడుగుతారు రచయిత్రి కందుకూరి వెంకట మహాలక్ష్మి.

దురాశ పరాకాష్టనందుకోవడం "కట్నం కోసం" కథలో కనబడుతుంది. కొడుక్కి పెళ్ళి చేసి మరీ కట్నం సంపాదించడం కోసం కోడలికి నిద్రమాత్రలిచ్చి హత్య చేసిన అత్తగారి కథ విషయం తెలిసి కొడుకు కూడా ఆత్మహత్య చేసుకోగా, భర్త విడిచి వెళ్ళిపోతాడు. రచయిత్రి దేవి లక్ష్మీరాజేశ్వరి.

జి. రామలక్ష్మి గారు రాసిన "మంచు" కథలో ఏమీ లేదనిపిస్తే, డి.ఎం.ఎస్. స్వాతి గారి "బంధం" కథ అసహజంగా తోస్తుంది.

"సంస్కారం" కథారచయిత్రి రావూరి రమాదేవి. హాస్పటల్‌లో ఉన్న బంధువుల్ని చూడడానికి వెళ్తే ఖర్చు తగులుతుందని చూడడానికి కూడా పోదామె. అయితే వాళ్ళు

పోతూ పోతూ తమ ఊరిలో పండినవన్నీ తెచ్చిస్తారు. ఆమె చేసిన తప్పు ముల్లులా గుచ్చుకుంటుంది.

ఇందిర .జి గారి "కామాక్షమ్మ ఏం చెయ్యాలి?" లో పనిమనిషి కోసం అత్తగార్ని ఇంట్లోంచి బైటికి పంపుతుంది కోడలు. ఒక రిపోర్ట్‌లా ఉన్న కథ.

ఇకపోతే క్లూ కథలు సింపుల్‌గా ఉండి, పజిల్స్ మెదడుకు మేతగా ఉపయోగ పడ్డాయి.

మొత్తానికి కథలు కథనం రీత్యా, కథా వస్తువుల రీత్యా మరింత పటిష్టతను పెంపొందించుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని నిస్సందేహంగా చెప్పుకోవచ్చును



# విపుల మాసపత్రిక

తెలుగులో 'విశ్వకథావిపంచి'గా 20 ఏళ్ళనుండి వెలువడుతున్న మాసపత్రిక విపుల. వివిధ భారతీయ, విదేశీ భాషల నుండి అనువదించిన కథలతో పాటు ప్రతి సంచికలోనూ సాధారణంగా మూడు తెలుగు కథలు కూడా ప్రచురిస్తుంటారు. కథలే కాకుండా ప్రతి సంచికలోనూ కథా సాహిత్యం గురించో, ఒక ప్రసిద్ధ రచయిత గురించో ఒక వ్యాసం గాని, రచయితతో పరిచయం గాని ప్రచురిస్తున్నారు. క్రితం సంచికల్లో వచ్చిన కథల గురించి మంచి విశ్లేషణలు, విమర్శలు రాయమని బహుమతులిచ్చి పాఠకులను ప్రోత్సహిస్తున్నారు. ఈ రకంగా మంచి కథా సాహిత్యాన్ని 'సులభగ్రాహ్యం' గా తెలుగు పాఠకులకు అందించడంలో 'విపుల' 20 ఏళ్ళుగా గణనీయమైన కృషి చేస్తోంది.

ఈ వ్యాసం 'విపుల'లో వచ్చిన మౌలిక తెలుగు కథల గురించి మాత్రమే. కాబట్టి అనువాద కథల విషయంలో లాగ మూలంతో పోల్చి అనువాదకుడు రచయిత అభిప్రాయాన్ని ఎంత సమర్థంగా అందించగలిగాడు, అనువాద ప్రమాణాల విషయంలో సంపాదకుల విధానం వంటి అంశాలను పరిశీలన చేయాల్సిన అవసరం లేదు.

1997లో 'విపుల'లో వచ్చిన 36 తెలుగు కథల ఇతివృత్తం. సామాజిక నేపథ్యం పరిశీలిస్తే ఎక్కువ భాగం పట్టణాలు, నగరాల్లో జీవించే దిగువ మధ్య తరగతి, మధ్య మధ్య తరగతి ఉద్యోగస్తులు వారి కుటుంబ జీవనాల గురించే. రచయితలు, రచయిత్రులు ఈ వర్గాలవారే కావటం, పాఠకులు కూడా ఎక్కువగా ఈ వర్గాల వారే అని ప్రచురణ

కర్తలు భావించటం - రెండూ దీనికి కారణం కావచ్చు. వీటి ఔచిత్యం ఎలా ఉన్నా, రచయితలు తమకు తెలిసిన మధ్య తరగతి విలువలు ఆర్థిక సమస్యలు, సంస్కారాలు, భేషజాల గురించి రాస్తున్నప్పుడు ఆ మూల్యాల నుండి తమను తాము విడదీసుకొని ఇతివృత్తాన్ని నిశిత పరిశీలనకు, విమర్శకు గురిచేయగలుగుతున్నారని ప్రశ్నించాల్సిన అవసరం ఉంది. దురదృష్టవశాత్తు ఎన్నో కథల్లో తాము విమర్శిస్తున్న సెంటిమెంట్లు , బలహీనతల పట్ల రచయితల్లో మమకారం, ఆత్మగ్లాని (సెల్ఫ్‌పిటీ) ఉండటం దర్శనమిస్తుంది.

మాంట్‌క్రిస్టో కథ 'ప్రాయశ్చిత్తం' (ఫిబ్రవరి సంచిక) దీనికి చక్కటి ఉదాహరణ. కథలోని కథకుడు పేరుతెలియని ఆఫీసులో క్యాషియర్. జీతాలు చెల్లించే రోజున చివర లెక్కలు చూసుకొన్నప్పుడు అయిదు వందల రూపాయలు తక్కువ తేలుతాయి. ఈ అకారణ నష్టానికి తనను తాను, విధిని, తిరిగిఇవ్వని వారిని నిందించుకుంటూ లోలోపలే ఆగ్రహంతో, అక్కసుతో ఉడికిపోతాడు. అటువంటి స్థితిలో కూరగాయల మార్కెట్లో కూరలమ్మి యాభై రూపాయలు ఎక్కువ తిరిగి ఇచ్చినప్పుడు అతని ప్రాణం లేచి వస్తుంది. తను పొందిన అకారణ నష్టానికి ఇది ఎంతో కొంత పరిహారమని సమర్థించుకొని జేబులో వేసుకుంటాడు. కాని తర్వాతి రోజు అయిదు వందలు ఎక్కువగా పొందిన అటెండర్ దాసు డబ్బు తిరిగి ఇచ్చేసరికి ఇతనిలో హీన, నేరభావన తీవ్రస్థాయికి చేరుకుంటాడు. తనను తాను సంతృప్తి పరుచుకోవాలంటే కూరలమ్మికి 50 రూపాయలు తిరిగి ఇచ్చేయాలి. కాని మార్కెట్లో ఆమె కనిపించదు. లారీ ప్రమాదంలో ఆమె చనిపోయిందని తెలుస్తుంది. నాలుగవ తరగతి ఉద్యోగస్తులు, కూరగాయలమ్ముకొనే దిగువ వర్గం వారితో నైతికంగా తులతూగలేకపోయానన్న అవమానం అతన్ని నీరు కార్చేస్తుంది. క్రింది తరగతి వారిలో నిజాయితీ ఎక్కువ అన్నది ఒక సాధారణీకరణమైతే, వారి నిజాయితీ కథకునిలోని మానవీయ బలహీనతలను ఎత్తి చూపించి హేయస్థితిని కల్పించడం మరీ బాధాకరమని, ఆ భావనను జయించే అవకాశం లేకపోవడం మరింత దుర్భరమని భావన కల్పిస్తాడు రచయిత. కథకుని ఆత్మనింద, రచయిత ఆత్మగ్లాని ఈ రెంటిమధ్య ఊగిసలాడుతూ ముగుస్తుంది కథ.

జంధ్యం వెంకటేశ్‌బాబు కథ 'ప్రయాణం' (జూన్ సంచిక) మరోరకం కుహనా ద్వైదీభావం, ఉదారభావనకు దృష్టాంతంగా నిలుస్తుంది. మెడిసిన్ చదువుతున్న యువతి శ్వేత రాత్రి బస్సులో కర్నూల్ వెళ్తూ ఉంటుంది. మధ్యలో దుండగులు ప్రవేశించి బలవంతంగా బస్సులోంచి లాక్కెళ్లిపోవాలని ప్రయత్నిస్తారు. ప్రక్కసీట్లో ఉన్న సరళ అనే మరో యువతి వాళ్ళను ఎదుర్కొంటుంది. దుండగులు ఈ అమ్మాయే బావుందని

ఆమెను లాక్కెళ్లిపోతారు. పూర్వకథ ఏమిటంటే సరళ కర్నూల్‌లోనే వేశ్యల కంపెనీలో పనిచేస్తున్నానని శ్వేతకు చెప్తుంది. అటువంటి అమ్మాయి ఎంత ఆపేక్షగా మాట్లాడుతున్నా తన పక్కనే కూర్చోవడం శ్వేతకు ఇబ్బందిగా ఉంటుంది. శ్వేతను రక్షించడానికి తాను ఎలాగూ చెడిపోయినదాన్నే కదా అని సరళ తనను దుండగులకు సమర్పించుకుంది అన్నది కీలకమైన అంశం. ఈ విచిత్రమైన త్యాగం, శ్వేత ఏ మాత్రం ధైర్యంగా ప్రవర్తించకపోవడం అన్న ధోరణిలో కథను వదిలెయ్యకపోగా రచయిత వ్యాఖ్యానానికి పూనుకుంటాడు.

"మగాడి ఆవేశాన్ని చల్లార్చే 'బలిజీవులు' కొన్ని ఈ ప్రపంచంలో లేకపోతే, ఆడవారి మీద జరిగే అత్యాచారాలు మరీ ఎక్కువయి ఉండేవేమో! శ్వేతకు ఇప్పుడు వేశ్యల మీద కోపం లేదు. జాలి మాత్రమే మిగిలింది. జీవితమనే ప్రయాణంలో అనుభవమనే మలుపు మన అభిప్రాయాన్ని మారేలా చేస్తుంది"

సౌకర్యంగా, అనుకూలంగా ఉండే ఉదారభావాలు, సామాజిక విశ్లేషణలకు ఇంతకన్న సుందరమైన ఉదాహరణ, రుజువు ఇంకేం కావాలి?

ఈ విధంగా చూసుకుంటే మల్లాది వెంకటకృష్ణమూర్తి చిన్న కథ 'మనసుగది' (ఆగస్ట్ సంచిక) లో విమర్శ సూటిగా, తీక్షణంగా ఉంది. నిక్షేపరావు భార్య జ్యోతి తన ఆఫీసులో రాజ్‌మోహన్‌తో చనువుగా ఉంటుంది. తర్వాత అది ఎఫైర్‌గా పరిణమిస్తుంది. జ్యోతి సహోద్యోగులెవరో నిక్షేపరావుకు ఆ విషయం తెలియజేస్తూ ఆకాశరామన్న ఉత్తరాలు రాస్తారు. కాని తాను వాటిని నమ్మటం లేదు అని అందర్నీ నమ్మించడానికి నిక్షేపరావు జ్యోతి ఆఫీసుకు వచ్చి తనకు ఆమె మీద అనుమానమేదీ లేదని గట్టిగా ప్రకటిస్తాడు. ఆ రకంగా తన గురించి ఇతరులు ఎగతాళిగా ఆలోచించకుండా సానుభూతి సంపాదించాలని అతని ఉద్దేశ్యం. ఇందులో కొంత సఫలమవుతాడు కూడా. అయితే జ్యోతి, రాజ్‌మోహన్ కలిసి ఉండగా రహస్యంగా తీసిన పోలరాయిడ్ ఫోటోలను నిక్షేపరావుకి పంపిస్తాడు ఆఫీసు సూపరింటెండెంట్. నిజం అంత స్పష్టంగా ఎదురయ్యేసరికి భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు నిక్షేపరావు. తన భ్రమలో (తనకు తెలిసినదే అయినా) బ్రతకనివ్వకుండా ఇలా హింసించడం, ఎగతాళి చేయడం దారుణమని వివరిస్తూ ఉత్తరం మాత్రం రాసి పంపిస్తాడు కథకుడికి. నిక్షేపరావు మూర్ఖత్వం కథకుడికి ఒక షాక్ అయితే, ఏ మాత్రం పశ్చాత్తాపం కలగని సూపరింటెండెంట్ ధోరణి రెండవ షాక్. నిక్షేపరావు జ్యోతి మీదో, ఆమె ప్రేమికుడి మీదో కసి తీర్చుకోలేని మూర్ఖుడు అన్నది సూపరింటెండెంట్ భావన. భార్య విధేయంగా ఉండకపోతే అది భర్త చేతకానితనమన్న విచిత్ర భావజాలం సమాజంలో రెండు స్థాయిల్లో ఎలా పనిచేస్తుందో సునాయాసంగా పోషించగలిగారు మల్లాది.

ప్రగతివాద భావాల వంటివి ఉన్నా, లేకపోయినా కూతుళ్ళ వివాహం విషయంలో, వాళ్ల అభిప్రాయాలు, ఇష్టాలకు స్థానం లేకుండా ఆర్థికంగా మంచిస్థితిలో ఉన్న వరుడు దొరికితే చాలు అని ఆదుర్దాగా వెతికి పెళ్ళిళ్లు చేసేసి తృప్తిగా ఫీలయ్యే తల్లిదండ్రుల గురించి నాలుగయిదు కథలు కనిపిస్తాయి. అమ్మాయిలకు పెంపకం ద్వారా, చదువు ద్వారా తాము కల్పించిన సంస్కారానికి, చైతన్యానికి, పెళ్లి విషయంలో కేవలం ఆర్థిక స్తోమతను పరిగణనలోకి తీసుకొని చేసిన నిర్ణయాలు, అమ్మాయిలకు తమకూ బాధాకరంగా పరిణమించడం వీటిలో ముఖ్య ఇతివృత్తం. ఆ కథలు - 'ఏది గెలుపు' (తిరుమలశ్రీ - ఫిబ్రవరి సంచిక), 'ఒక దృశ్యం కోసం' (సదానంద్ శారద - మే సంచిక), 'రెండు వారాల శెలవు' (ఆరి సీతారామయ్య - జులై సంచిక), 'ఆ ఉత్తరం' (ఎస్. శ్రీదేవి - సెప్టెంబర్ సంచిక). ఇలాంటి కథల్లో ఎక్కువసార్లు మార్గాంతరం లేనప్పుడు భర్త నుండి విడిపోవాలని ధైర్యంగా అమ్మాయిలు నిర్ణయించుకోవడం ఒక సామాన్యవిశేషం.

భర్త నచ్చకపోవడానికి ముక్కు, మొహం నచ్చకపోవడం, ఆశించినంత పెద్ద ఉద్యోగం లేకపోవడం వంటివి కారణాలైనప్పుడు నాటకీయ సన్నివేశాలు కల్పించి, జ్ఞానోదయమయ్యేలా చేయడం అన్న తెలిసిన సెంటిమెంటల్ పద్ధతి 'నీవు నా మనిషివి' (ఎన్. శివ నాగేశ్వరరావు - డిసెంబరు సంచిక)లో చూస్తాం.

పాఠకులకు నచ్చేవి, రచయితలు రాయడానికి సులభమైనవి సూటిగా పరిష్కారం చూపించేవీ, గుణపాఠాలు నేర్పి, నీతిబోధలు చేసే కథలున్నా. శిల్పసంబంధమైన చాతుర్యం, పరిపక్వత లేకపోయినా, సామాజిక, మానసిక ఆయామాల లోతైన పరిశీలన లేకపోయినా, చెప్పుకోదగిన తాత్త్విక దృక్పథం లోపించినా నీతికథలు, పిట్ట కథలు కలిగించే ప్రయోజనం వంటిది వీటివల్లా చేకూరుతుంది. కనీసం మొదట్లో చెప్పుకున్న కథల అయోమయ ప్రభావం ఉండదు. కొంత విమర్శ, కొంతసద్బుద్ధిని గురించి బోధ వివిధ రూపాల్లో దర్శనమిస్తాయి. - 'రోకో' (ఎమ్.వి.ఎస్.ఎస్. ప్రసాద్ - జూన్ సంచిక), 'సెలవల్లో ఒక రోజు' (వి. నాగరత్న - ఆగస్ట్ సంచిక) వంటి కథల్లో.

ఉద్యోగాలు చేసే స్త్రీలు ఇల్లు, ఆఫీసు ఈ రెండు బాధ్యతలు పోషించలేక, భర్తల సహకారం లేక పడే ఇబ్బందులు వివరించే రెండు మంచి కథలు - 'మార్పు' (యార్లగడ్డ నిర్మల - జనవరి సంచిక), 'కండిషన్డ్ ప్లాంట్' (పి. సుజాత - జులై సంచిక), చదువు, సంపాదన, తెలివి తేటలు భర్తతో సమానత్వాన్ని ఇవ్వకపోగా ఆర్థిక దోపిడీకి, మనస్పర్థలకు, అసూయకు దారి తీయడం ఈ రెండు కథల సామాన్య ఇతివృత్తం. "ఆడది తన జీవితంలో తెచ్చుకొనే ప్రతి అభివృద్ధికరమైన మార్పు మళ్ళీ మగవాడి సుఖానికే ఉపయోగ

పడుతున్నాయి. ఆమె చదువుకొని ఉద్యోగం చేసి సంపాదిస్తుంటే మగవాడికి ఆర్థిక సమస్యల నుండి బోల్డంత విముక్తి లభిస్తుంది'' వంటి వ్యాఖ్యానాలతో చిన్న చిన్న విషయాల నుండీ భర్తల ఆ సహకారం ఎలా మొదలవుతుందో వివరిస్తూ సాగుతుంది 'మార్పు' కథ. ఇంత వరకూ సాగింది చాలు, ఇక భర్త కూడా అన్ని విషయాల్లో సహకరించాల్సిందే అని నాయిక సుజాత నిర్ణయించుకోవడం ఈ కథలోని మార్పు.

తన వృత్తిలో భర్త ఆశించే పరిమితుల్లో, తెలివితేటలను, సామర్థ్యాన్ని నియంత్రించుకొని, ఇంట్లో అతనికి తన బౌద్ధిక వికాసాన్ని కనిపించకుండానూ, కత్తిరింపులకు గురయ్యే 'కండిషన్డ్' మనీప్లాంట్‌లా లొంగి ఉండడం ఎంత మానసిక యాతనో, అసాధ్యమో నాయిక వసంత మానసికస్థితిని నిశిత అంతర్దృష్టితో ఆవిష్కరించారు పి. సుజాత. కంప్యూటర్ ఆనిమేటర్ వసంత బిజీ వృత్తి జీవితాన్ని, కదలికలను, రాకపోకలను వంద కండిషన్లు పెట్టి నియంత్రించాలని ప్రయత్నిస్తాడు మూర్తి. డబ్బు, సౌకర్యాలూ కావాలి, పాత పద్ధతిలో 'అలరించి సుఖపెట్టే' భార్యా కావాలి అతనికి. తన నియంత్రణలు చెల్లనందున చివరికి ఆమెమీద వ్యభిచారం కేసు వేసి అరెస్టు చేయిస్తాడు. పాపను అధీనంలో ఉండకుండా చూస్తాడు. పోలీస్‌స్టేషన్ చుట్టూ నేరస్తురాలిలా తిరిగే స్థితికి దిగజారుస్తాడు. అంత విషమస్థితిలోనూ కంప్యూటర్ తెర మీద గాలికి ఊగుతూ, క్రమంగా నిటారుగా నిలబడే గడ్డిపూవుని చిత్రించి, క్రింద తన పేరును రాసుకొని "తనకు ఆలంబన తన శక్తే" అని తానే తనకు ధైర్యం. తనే విశ్వాసం. తనే నిత్యవసంతం. తన కోసం తనే వీచే వెర్రిపూల గాలి'' అని తన స్వయంప్రతిపత్తిని మనసరా నిర్ధారించుకుంటుంది వసంత, కథ ముగింపులో

స్త్రీల సమస్యలను, స్త్రీ పక్షపాత దృష్టితో పరిశీలించే మరికొన్ని కథలు 'అమ్మకాకి' (ఎన్. శివనాగేశ్వరరావు - మార్చి సంచిక), 'చదువు' (ఆర్. రామకృష్ణ - సెప్టెంబరు సంచిక).

పాత్రల మనోభావాలను చైతన్యస్రవంతి లాంట శైలిలో పోషించే చిరుయత్నం చేశారు - 'రేగడి విత్తులు' నవలా రచయిత్రి చంద్రలత 'బుజ్జిగాడి బొమ్మ' కథలో (జనవరి సంచిక) జన్మించిన తొలి ఘడియల నుండీ శిశువు ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ చెప్పే స్వగతం, దానికి సమాంతరంగా తల్లి మనోగతం. గర్భం ధరించడం, ప్రసవం, నవజాత శిశువును అర్థం చేసుకోవడం - ఈ విషయాలన్నింటిలో డాక్టర్‌గా తార్కికంగా, శాస్త్రీయంగా ఆలోచించే భర్త దృక్పథానికి ఉద్వేగంతో, మమకారంతో ఆలోచించే తన ఆవేశపద్ధతికి మధ్య సమన్వయం కోసం తల్లి వెతుక్కునే ప్రయత్నాన్ని సున్నిత హాస్యధోరణిలో వర్ణిస్తారు. ఇలా మనోవిశ్లేషణాత్మకంగా పోతున్న కథల్లో పిల్లలకు

ఎటువంటి బొమ్మలు ఇవ్వాలి అన్న ఫక్తు ప్రాక్టికల్ సలహా చెప్పడం కోసం ఒక సెంటిమెంటల్ ప్రక్కదారిలోకి వెళ్ళిపోతుంది. చలాకీగా ఉండే అభివ్యక్తి ఈ కథ ప్రత్యేకత.

చిన్న కుటుంబాల్లో వృద్ధులు ఎదుర్కొనే ఒంటరితనం, తరచుగా అనుభవించాల్సి వచ్చే అనాదరం ఈ సమస్యలను మరీ సెంటిమెంటల్‌గా, కన్నీరుబికేలా చిత్రించిన కథలు - 'బుడిగి' (కొండముది శ్రీరామచంద్రమూర్తి - మార్చి సంచిక), 'స్నేహం' బద్దిగం పాండురంగారెడ్డి - ఏప్రిల్ సంచిక), అతిథిలా కాకుండా, ఇంటిపనుల్లో పాలు పంచుకొనిస్తే ముసలివాళ్ళు కుటుంబంతో కలిసిపోతారని సలహా ఇస్తుంది ఎమ్. హేమలత రచన 'ఇచటే ఉండిపోనా'.

హాస్య వ్యంగ్య కథలను 'విపుల' వారు ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నా వాటి లోపం స్పష్టంగా తెలుస్తోంది. 1997లో మూడే హాస్య వ్యంగ్య కథలు ప్రచురించారు - 'సెక్యులర్ వంతెన' (ఎమ్బీయస్. ప్రసాద్ - ఆగస్టు సంచిక), 'యావ' (జీడిగుంట రామచంద్రమూర్తి - సెప్టెంబరు సంచిక), 'కామేశ్వరి మొహమాటం' (రాగతి రమ - డిసెంబర్ సంచిక).

1997లో 'విపుల' ప్రచురించిన కథల్లో ఉత్తమమైనవిగా, నాకు తోచినవి (ఇంతకు ముందే వివరించిన 'కండిషన్డ్ ప్లాంట్' కాకుండా)

కాలువ మల్లయ్య - 'యుద్ధభూమి' (ఏప్రిల్)

దాసరి అమరేంద్ర - 'ముత్యాహారం' (మే)

బి.ఎస్. రాములు - 'సదువు' (మే)

బి.ఎస్. రాములు - 'దక్షయజ్ఞం' (మే)

మహాభారతంలో దుర్యోధనుడి భార్య భానుమతి, కర్ణుడి పాచికలాట ఉదంతాన్ని ఆధునిక నేపథ్యానికి మార్చి చక్కటి తాత్విక అంశాన్ని ప్రవేశపెట్టారు 'ముత్యాలహారం' కథలో అమరేంద్ర. వింత తాదాత్మ్యంతో, ఊపుతో సాగే ప్రతీకాత్మక కథ ఇది. తక్కువ జాతిలో పుట్టి, అందరి చిన్నచూపుకు గురయ్యే కథకుణ్ణి జీవితంలో ఒక వ్యక్తిత్వం ఏర్పరచుకొని, సామాజిక స్థానాన్ని పొందటానికి సహకరిస్తాడు అతని మిత్రుడు. మిత్రుడిభార్యతో ఒకరోజు సగంలో ఆగిపోయిన చదరంగం ఆటను కొనసాగిస్తాడు. కథకుడు. రసపట్టులోకి వస్తుంది ఆట :

"ఒకరి మనస్సులోకి మరొకరం వెళ్ళి ఎత్తులనూ పై ఎత్తులనూ గమనించసాగాం. అసలు నా ఆలోచనలు నావేనా, ఆవిడవి కూడానా? హద్దు చెరిగి ఇద్దరం ఇద్దరి ఆట గురించీ ఆలోచించడం లేదూ? అసలిదేనేమో ఈ ఆటలోని గొప్పదనం?"

మిత్రుడి రాకతో, అతని భార్య ఒక్కసారిగా ఆందోళన పడిపోతుంది. అకారణ సందేహభావనతో. ఆటను అలా మధ్యలో ఆపడం అనవసరం అని నితాంతమైన ప్రేమతో, పరిపక్వానుభూతితో భార్యకు వివరిస్తాడు అతను. క్రీడ గా జీవితాన్ని జీవించటం, గెలుపు ఓటములకు ప్రాధాన్యం లేకుండా కార్యంలో లీనమవగలగటం, పరిపక్వతకు సూచిక అన్న తాత్త్వికాంశాన్ని పరిమళ సదృశంగా కథనంలో గర్భితం చేయగలిగారు రచయిత. అయితే కథకుణ్ణి తక్కువ కులం వాడిగా చేయటం వల్ల ఇతిహాసంతో సమాంతరంగా పాత్రను ఉంచడం తప్ప మరో ప్రయోజనమేదీ కలిగినట్టు తోచదు.

హింసాత్మక ఉత్తర తెలంగాణ సామాజిక నేపథ్యంతో, పల్లె నుండి వలస వచ్చి మధ్య తరగతి బూర్జువా జీవనశైలిలో చిక్కుకుపోయి నేలతో ఉన్న బంధాన్ని కొనసాగించలేక, త్రెంచుకోలేక ఎంతోమంది గురవుతున్న మానసిక సంక్షోభాన్ని జాగ్రత్తగా విశ్లేషించారు 'యుద్ధభూమి'లో కాలువ మల్లయ్య. నాయకుడు మనోహర్‌కు మార్క్సిస్టు విప్లవాదం పట్ల గొప్ప నమ్మకం ఉండటం, ఉత్తర తెలంగాణ ప్రాచీన చరిత్ర, ఆధునిక సామాజిక విప్లవ పోరాట చరిత్ర గురించి చక్కటి అవగాహన ఉండటం, అయినా విప్లవకారుల్లో చేరి త్యాగం చేసే ధైర్యం లేకపోవటం, సమస్యను మరింత సంక్లిష్టం, బాధాకరం చేస్తాయి. అయితే రచయిత నిర్దేశించుకున్న నేపథ్యం, సైద్ధాంతిక అంశాలు, పోషించదల్చిన వ్యక్తిగత, సామాజిక, చారిత్రక వాస్తవం, ఎంచుకున్న కథనశైలి, కథాసూత్రం - ఇవన్నీ గొప్ప కళాత్మక రూపాన్ని, సామంజస్యాన్ని పొందగలిగాయని చెప్పడం కష్టంగాని, నిజాయితీగా రచనాధర్మాన్ని నిర్వర్తించే ప్రయత్నం మల్లయ్య చేశారని మాత్రం చెప్పవచ్చు. నాయకుడి వ్యక్తిగతమైన జీవన సమస్యలకు, విస్తృతమైన చారిత్రక, సామాజిక అంశాలకు కథా సంవిధానంలో సమన్వయం కుదర్చాలని ప్రయత్నించడం ముఖ్యంగా చారిత్రక, సామాజిక చరిత్రను ఐతిహాసిక కావ్య ప్రమాణాల్లో ఉంచడం సాహసకార్యం. జరిగిందేమిటంటే రచయిత ఎంచుకున్న సంవిధానంలో (వ్యాఖ్యాతగా వ్యవహరించే తిర్మల్ అనే మిత్రుణ్ణి నాయకుడి వెంట త్రిప్పుతూ) అనుపాతాలు కుదరలేదు. వాస్తవిక శైలి, ఇతిహాస శైలి, రెండు విభిన్న సాహిత్య ప్రక్రియలను కలగలుపు చేసినప్పుడు ఒక వినూత్న శైలిని సాధించి ప్రారంభించాలేమో! ఆ లోపం తెలుస్తోంది. కథాంశంలో కూడా మనోహర్ తాను భూమిని అమ్ముకు రావడాన్ని సామాజిక మార్పు, పోరాటాల ఫలితమని సరిగ్గా విశ్లేషించినా - దానిని 'యుద్ధభూమి'లో జరుగుతున్న త్యాగాలతో పాటు వర్ణించి సంతృప్తి చెందడం, మధ్య తరగతి కుహనా చైతన్యం పడే తపనలా అంగీకరించవచ్చు కాని వాస్తవదృష్టితో గాని, కళాదృష్టితో గాని ఆమోదించడం కష్టమే.

బి.ఎస్. రాములు 'సదువు' కొద్దిగా పెద్ద కథ. 'యుద్ధభూమి' కన్నా కూడా భారంగా సాగుతుంది. దళిత నేపథ్యం నుండి నిజమైన విద్య, జీవితంలో సాధించదగిన ఎఱుక గురించి దీర్ఘమైన చర్చలను సమన్వయించుకుంటూ నడుస్తుందీకథ. పల్లెల్లోని పిల్లల నేపథ్యానికి స్కూల్ చదువులకు, పాఠ్యాంశాలకు సంబంధం లేకపోవడం వల్ల, అయినా చదవాల్సిందే అని తల్లిదండ్రులు నిర్బంధం చేయడం వల్ల అంతర్నిహితమైన సామర్థ్యం ఎంతో వ్యర్థమౌతున్నదని రచయిత చేసిన విశ్లేషణ సత్యం. గంగాధరి అనే దళిత బాలుణ్ణి అలాంటి వ్యథ నుండి తప్పించి తన సహజధర్మం ప్రకారం ఎదిగే అవకాశం కల్పిస్తాడు లచ్చయ్య అనే మేష్టారు. గంగధరి జీవితం ఎన్నో మలుపులు తిరుగుతుంది. రకరకాల పనులు, వృత్తులు చేపడతాడు. సాధువుల గుంపులో చేరి రకరకాల దేశసంచారానుబవం పొందుతాడు. గురువుగారికి అప్పుడై పలుభాషలు, భక్తి సాహిత్య పరిజ్ఞానమూ సాధిస్తాడు. పోలీసులు, నక్సలైట్లు ఇద్దరి చేతా దెబ్బలు తింటాడు. విప్లవకారులతో దీర్ఘసంవాదం చేసి, ప్రజల మీద తమ విప్లవవాంఛను రుద్దటం కన్నా, తమను తాము ముందు జయించాలని ప్రతిపాదిస్తాడు. మళ్ళీ గురువుగారి దగ్గరికి వచ్చి ఆయనకు సన్నిహితుడవుతాడు. వివాహం చేసుకొని ఆశ్రమాన్ని నడిపిస్తాడు. ఆశ్రమ సిద్ధాంతాలను బుద్ధుని తత్త్వం, కబీరు రవిదాసు బోధనల మిశ్రమం అని చెప్పవచ్చు. స్వార్థం తప్ప జీవితంలో మాయ ఏదీ లేదు. పనిలోనే బ్రహ్మానందాన్ని చూస్తారు కాబట్టి శూద్రులే నిజమైన బ్రహ్మజ్ఞానులు. ఎందుకంటే అందులో ప్రకృతిలో లీనమయ్యే ధర్మం ఉంది. మార్క్సిస్టు సిద్ధాంతాలకు దీటుగా వ్యక్తి ఆత్మవికాసాన్ని కూడా సమన్వితం చేసుకున్న దేశీయ సోషలిస్టు సిద్ధాంత ప్రతిపాదన చేయడం రాములు గారి ఉద్దేశ్యం. ఆదర్శ విద్యను బోధించే 'విద్యా పరిశోధన కేంద్రం' స్థాపిస్తాడు గంగాధరి. కార్యనిమగ్న జీవితం గడుపుతూ ఒకరోజు తనువు చాలిస్తాడు. అసంతృప్తితో కూడిన అన్వేషణ అతని జీవిత పరమార్థం, ఆనందం కూడా... ఆశ్రమం, విద్యాలయం కూడా మిగలవు. కాలగతిలో పాడైపోతాయి.

'దక్షయజ్ఞం' కథానిక - గొప్ప నిరాశతో, కసితో, ఓడిపోయానన్న బాధతో, విప్లవోద్యమంలో ప్రవేశించి అన్ని రకాలుగా వంచింపబడిన ఒక దళితుడు కోర్టులో న్యాయమూర్తుల ఎదురుగా తీవ్రస్థాయిలో ధ్వజమెత్తుతూ వాదన, అది ఒక వాఙ్మూలం, ప్రకటన అని అనటం కన్నా ఉత్తర తెలంగాణ ప్రాంతపు దళిత వర్గపు ఆక్రందనం అనవచ్చు. అగ్రవర్ణాలు ఆధిపత్యం సాధించిన తీరు తెలంగాణకు జరిగినఅన్యాయం విప్లవోద్యమం చివరికి అగ్రవర్ణాల బాగుకే ఉపయోగపడిన తీరు, పాలక వ్యవస్థకు హింసా వాతావరణం కొనసాగటంలో ఉన్న లాభం, నిజమైన విప్లవకారులకు, వారి కుటుంబాలకు

సామాజిక సంస్కరణల లాభం లభించకపోవటం, వాళ్ళు నిత్య దమనానికి గురి కావడం తప్పు తప్పించుకునే మార్గం లేకపోవడం - ఇలా ఎన్నో అంశాలను స్మృతికి తెచ్చుకుంటూ, విశ్లేషించి, వాఖ్యానిస్తూ తెలియకుండా జరిగిపోతున్న మోసాన్ని, బహిర్గతం చేస్తూ చలామణీలో ఉన్న పలు అభిప్రాయాలకు వ్యతిరేకమైన సాక్ష్యాలు తీసుకువస్తాడు. కాళీపట్నం రామారావు 'యజ్ఞం' ను స్మృతికి తెస్తుందీ ప్రసంగమంతా త్యాగధనుడి ఓటమిలోని దీనత్వాన్ని మనసు కలియబరిచేలా ఆవిష్కరించారు రచయిత. మానవత్వం, స్వేచ్ఛ, సమానత్వం - అన్నింటికన్నా న్యాయం కోసం చేసిన ఆక్రందనమిది.

ఇతివృత్తం యొక్క బాహుళ్యం గురించి ఇలా వివరించినా రాములు గారి రచనా ధోరణితో చాలా సమస్యలున్నాయి. అన్ని విషయాలూ ఒక్క కథలోనే చెప్పేయాలా? ఇతివృత్త వైవిధ్యం, కాలపరిమాణం - ఎలా చూసుకున్నా నవలా రూపంలో రచిస్తే ఉండే సౌలభ్యం 10, 15 పేజీల కథలో లేదు. ప్రతిపాదించిన పలుఅంశాలు కథనమనే అస్థి పంజరంలోకి గాని, కళాత్మక శిల్పరూపంలోకి గానీ పరివర్తితమే కాలేదు. తాత్విక, సైద్ధాంతిక ప్రస్తావనల్లా ఉన్నాయి. అంతే, ఈ ప్రస్తావనల బలాన్ని, వాటిని బాహాటంగా వాదించాల్సిన అవసరాన్ని కాదనే వీలే లేదు. ఆ రకంగా రాములుగారు సాధించిన పరిణతి విలువైనది. కాని పాత్రల వ్యక్తిత్వ శిల్పంలో కథాసంవిధానంలో, శాశ్వతంగా నిలిచిపోయేలా వాటిని గర్భితం చేసే రచయిత కోసం కదా తెలుగుదేశం ఎదురుచూపు? రాములు వంటి రచయితలు ఇంక ఆలస్యం కాకుండా ఆ కృషిని చేపట్టాలి. సాహిత్యం యొక్క సాంస్కృతిక ప్రయోజనం అంతవరకు సిద్ధించదు.

'విపుల'లో టైప్ కంపోజింగ్ గురించి ఒక అభ్యంతరం వ్యక్తం చేయాల్సిన అవసరం ఉందనుకుంటాను. ముఖ్యమైన లైన్లు ఇవి. పాయింట్ ఇది అని ఎత్తి చూపడానికి కొన్ని వాక్యాలు లావు అక్షరాలతో లేక రంగు అక్షరాలతో ముద్రిస్తున్నారు. ఈ పద్ధతి ఒకే రీతిగా, ఒకే రకమైన విజ్ఞతతో సాగటం లేదు. కథలో ముఖ్యాంశం ఏమిటో చూసుకోవాల్సిన బాధ్యత పాఠకులకు వదిలివేయవచ్చు. అది వాళ్ళ హక్కు కూడా!



# స్వాతి మాసపత్రిక కథలు

సాహితీ విలువలున్న కథలు, సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిబింబించే వ్యాసాలు, లోకజ్ఞానం, పురాణ విజ్ఞానం, కొసమెరుపుగా అనుబంధ నవలతో వెలువడే స్వాతి మాసపత్రిక చిన్న కథలకిస్తున్న ప్రోత్సాహం గణనీయమైంది. 1997లో స్వాతి మాసపత్రికలో ప్రచురించబడిన కథలు సుమారుగా 75. ఈ కథలలోని ఇతివృత్తాలు - బాయ్ మీట్స్ ది గర్ల్ తరహా నుండి, అమలిన శృంగారం, దొంగసారా వ్యాపారం, అడవిలో ఏనుగులవేట, రైతుల కడగండ్ల దాకా, అప్పుడే పుట్టిన శిశువు మనోభావాల విశ్లేషణ మొదలుకొని ఆఖరి క్షణాల్లో ఉన్న జీవి మనోవేదన వరకూ వివిధ రంగాలకు విస్తరించి ఉన్నాయి. చెయ్యి తిరిగిన రచయితలు పి.యస్. నారాయణ, వసుంధర, కాలువ మల్లయ్య వంటి కథకుల నుండి కొత్త రచయితల వరకు పత్రికలలో దర్శనమిస్తున్నారు. కథాకథనం, సంభాషణా చాతుర్యం మొదలైనవి ఒక దానితో ఒకటి పోటీ పడుతున్నట్లుగా సాగాయి.

ఎక్కువ కథల ఇతివృత్తం వృద్ధాప్య సమస్యలు, స్త్రీల సమస్యలు, భిన్నస్థాయుల్లోని తారతమ్యాలు, లుప్తమవుతున్న మానవతా విలువలు.

చిన్నతనం నుండి ఎంతో ఆప్యాయంగా పెంచిన తల్లిని భార్య సలహాతో వృద్ధాశ్రమానికి పంపితే, కొడుకు తిరిగి తీసుకెడతాడని వెర్రి నమ్మకంతో ఎదురుచూడటం, నిజం తెలుసుకున్న తర్వాత ఆమె నిర్ణయం కథకే కాదు, మనకి నిత్యం ఎదరయ్యే ఇటువంటి సమస్యలకి కూడా కొత్త మలుపే. ఇది గుడిపాటి కనకదుర్గ గారి కథ 'రాతి

హృదయం'. ఇదే ఇతివృత్తంతో వచ్చిన కథ పెనుమాక నాగేశ్వరరావు గారి 'అమరసుఖం' వృద్ధాప్యంలో పిల్లల నిరాదరణకు గురి అయిన దంపతుల దీనగాథ. వారికి 'అమరసుఖం' మరణంలోనే అన్న నిష్ఠుర నిజం కథలో వ్యక్తమౌతుంది. పట్టణాలలోని వాతావరణ కాలుష్యం మనసుల దాకా వ్యాపించినట్లుగా సింబాలిక్‌గా చెప్పిన కథ కాలువ మల్లయ్య గారి 'కాలుష్యం' పర్యావరణ స్పృహతోబాటు రిటైరయిన తల్లిదండ్రుల బాధలు, పి.ఎఫ్ మనీ కోసం చూపే కపట ప్రేమలు చక్కగా చిత్రీకరించారు.

నటులు రంగస్థలం మీద మాత్రమే నటిస్తారు. కాని రిటైర్ అయిన తల్లితండ్రులపై కొడుకులు చూపే ప్రేమ అనుక్షణం నటనే అన్న సూత్రం మీద అల్లిన శ్రీ చరణ్‌మిత్ర గారి పాత్రధారులు కథలో నటుల జీవితాలు, అభిమానాలు చక్కగా పొందుపరచబడ్డాయి.

వంటి మీద నగే పిల్లలు గౌరవించటానికి కారణం అని చెప్పిన భర్త మాట నీలయమ్మ జీవితంలో నిజమే అవుతుంది. ఇంతవరకు కథ మామూలుగానే అనిపించగా, ఆమె చనిపోయాక నగ గిల్టుది అన్న నిజం పిల్లలని నిశ్చేష్టులని చేస్తే మనసు చివుక్కుమన్న పాఠకులకి గిల్టుతనం నగది కాదు. నగ కోసం తల్లిని బాధించిన పిల్లలది అనిపించక తప్పదు. కె. తాయారమ్మ గారి 'గోవర్ధన గొలుసు' కథలో జంధ్యాల వెంకటేష్ బాబు 'ఓ అమ్మ కథ' లో కొడుకుని పెంచటానికి కష్టాలు పడ్డ తల్లి కథ విషాదాంతం కావటం యాదృచ్ఛికం.

పి.యస్. రావ్ కథ "జీవనరాగం" సంతతి లేని దంపతుల ఆదర్శజీవితం. భర్త చనిపోతే నిరాశా నిస్పృహలకి లోను కాకుండా కర్మయోగిగా స్త్రీ జనోద్ధరణకు నడుం కట్టిన స్త్రీ ఉదంతం. ఇతివృత్తం, ముగింపు, మెసేజ్ బాగానే ఉన్నాయి. కాని, 'లారీడీకొని' అని ముందు రాసి తర్వాత "భర్త కారు ప్రమాదంలో మరణించాక అని రాశారు. ఇలాంటి చిన్న పొరపాట్లు రాకుండా జాగ్రత్త తీసుకుంటే మంచిది. పెనుమాక నాగేశ్వరరావు 'దువ్వెన నవ్వింది' లో బొద్దింకలు, దోమలు చంపే మందుకొన్న వ్యక్తి కొన్నాళ్ళ తర్వాత తమ పిల్లలు తమని చంపటానికి అటువంటి సాధనాలు కొంటారని ఊహిస్తాడు. ఇందులో జంతువులని సునాయాసంగా చంపే సాధనాల గురించి వెక్కిరింతే కాదు, భవిష్యత్తులో వృద్ధులైన తల్లితండ్రులని పిల్లలు చూడరనే అభద్రతాభావం ద్యోతకమవుతుంది. విజయార్కె కథ 'ఆఖరి జ్ఞాపకం' చివరి క్షణాల్లో ఉన్న ఆ వృద్ధురాలి ఆత్మశోధన మరణదశలో ఉన్న వ్యక్తి మనోగతం వ్యక్తంచేసే ప్రయత్నంలో ఒక కొత్తదనం. ఇది సమస్యగా మారిన వృద్ధుల కథ.

వృద్ధాప్యం సమస్య కాదు, ఒక రకంగా పరిష్కారం అని చెప్పవచ్చు. టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి కథ "కిరీటం ఉన్న ఇల్లు" తండ్రి తీర్చలేని తాత కోరిక విదేశాల్లో పుట్టి పెరిగిన

మనుమడు తీర్చిన వైనం. ఇందులో ముఖ్యమైన విషయాలు దేశం వదిలివెళ్ళిన వాళ్ళ దృష్టి భారతదేశం వైపు, పల్లెల వైపు మళ్ళించటం, అపురూపమైన ఇటువంటి పరిష్కారాలు కనపడకపోయినా, సమస్యలు మాత్రం అనునిత్యం దర్శనమిస్తూనే ఉన్నాయి. ఇటువంటి ఇతివృత్తం మరో దృక్కోణంలో వచ్చిన చక్కని కథ అనామకుడి 'శ్రీకారం'. ఇందులో తన వివాహ విషయంలో తాతా అమ్మమ్మల సలహా అడగటానికి వచ్చిన శారదకి వారికి జరిగిన సంభాషణలో దొర్లిన విషయాలు, స్వాతంత్రోద్యమం, యాభై ఏళ్ళ స్వాతంత్ర్యం, భారత ఆర్థిక విధానం, విదేశీ, విద్యాధికులకు విదేశాలపై మోజు, వారి చదువుకి పెట్టుబడి పెట్టి నష్టపోయే సామాన్యుడు. దారితప్పి ఆ మోజులో కొట్టుకొని పోతున్న వారిని వదిలి వెయ్యటం కాదు పరిష్కారం దారికి తెచ్చుకోటమే అంటూ దానికి శ్రీకారం చుట్టిన కథ. ఈ రెండు కథలూ వ్యక్తులను గురించి కాక దేశాన్ని గురించి ఆలోచింపజేస్తాయి. ప్రస్తుతం అవసరం అదే కదా!

స్త్రీ వాద మనవచ్చో, లేక స్త్రీల సమస్యలు చర్చించేవి అనాలో కాని, ఆ ఇతివృత్తం కల కథలు సుమారు పది దాకా ఉన్నాయి. వృద్ధాప్యం కేంద్రమైన కథలు ఓ అమ్మకథ, గోవర్ధన గొలుసు, జీవనగమనం కథలలో స్త్రీలే హీరోలు. జీవనగమనంలో స్త్రీ జనాభ్యుదయానికి పాటు పడతానని ఆంధ్ర మహిళాసభని పేర్కొనటం కూడా జరిగింది. 'అత్తగారి పెత్తనం' (రచన : కోలపల్లి ఈశ్వర్) లో కష్టాలలో నలిగిపోయిన ఓ స్త్రీమూర్తి మానసిక స్థితి, తోటి స్త్రీలలోని సామాజిక స్పృహ, వారి స్పందన మనసుకి హత్తుకునేట్టు ఆలోచింపచేసేట్టు సాగిన రచన. కప్పగంతుల మల్లికార్జునరావు కథ "నేను ద్రౌపదిని కాను" ధైర్యంతో భర్త పేకాట దుర్గుణాన్ని పోగొట్టే ప్రయత్నం చేసిన భార్య కథ. దీని అందం అంతా చివరిమాట. 'ఆమె గర్వంగా అతని మీసాలు పట్టుకుని మెలి తిప్పింది' అనటంలో ఉంది. 'మేఘమా కరగకు' (రచన : పుష్యమి) భర్త బ్రతకడని నిర్ధారణ అయినాక, పిల్లలని పెంచి పెద్ద చెయ్యటానికి స్త్రీ ఎంతటి ధీరురాలౌతుందో, ఎంతగా ఎదుగుతుందో, సెంటిమెంట్‌ని ఎలా అధిగమిస్తుందో "ప్రాక్టికాలిటీ అంటే జీవితాన్ని మరింతగా ప్రేమించటం" అని చెప్పించి, నిరూపించిన మంచి కథ.

మామగారి డబ్బాశకు భర్త నుండి దూరమై, కండక్టరుగా స్వతంత్రంగా జీవిస్తున్న సుజాత, (కండక్టరు అనటం సమకాలిక విషయ పరిజ్ఞానానికి నిదర్శనం) తన విధినిర్వహణతో మెప్పించి తిరిగి ఇంటికి చేరుతుంది. ఎన్. శివనాగేశ్వరరావు గారి కథ 'గుడికి చేరిన దేవత'లో. స్త్రీ సమర్థవంతమైన ఆఫీసరుగా క్రమశిక్షణను అమలుపరిచనూ గలదు, భర్త కోపతాపాల ఒడుదుడుకులకి తట్టుకోనూ గలదు, కాని మౌలికంగా తల్లితనం ఉండటంతో ఉన్నదానిని ఎలా సర్ది చెపుతుందో 'క్షమయా ధరిత్రి'లో చక్కగా

వర్ణించారు శ్రీ చరణ్‌మిత్ర, కాంగ్రేగుల శ్రీనివాసరావ్ అందమైన ఆడపిల్లల పట్ల చుట్టుపక్కల మగవారి ఆకలిచూపులపై 'యుద్ధం' బలభద్రపాత్రుని రమణిది. సామవేదుల గీతారాణి 'కస్తూరి' మామూలు కథే అయినా తనకి కలిగిన కష్టం మరొకరికి కలగకూడదనే ఔదార్యం గల పాత్రగా స్త్రీ పాత్ర చిత్రీకరణ దీని ప్రత్యేకత. కేయస్వీ కథ 'మనరాత్రి' స్త్రీకి, పురుషుడికి వేరొక ధర్మం ఉండకూడదని చెప్పిన తీరు ఆకర్షణీయంగా ఉంది. డా॥ జి. రవికృష్ణ కథ 'శిక్ష' విధవరాలైన స్త్రీ ముఖం అశుభం, చూడరాదన్న మూఢవిశ్వాసం పై దెబ్బ. భర్తకి బుద్ధి చెప్పటానికి తానే విధవరాలి వేషం ధరించటంలో శిక్ష ఎవరికి? భర్త, మాంగల్యం, తన జీవితం - వీటికన్నా, మూఢనమ్మకాల కారణంగా సాటి స్త్రీ చులకనగా చూడబడకుండా ఉండాలన్న కోరిక యొక్క తీవ్రత ఇందులో వ్యక్తమౌతోంది.

'నాలో నేను' లో ఈనాటి స్త్రీ రోజుల పిల్లగా ఉన్నప్పటి నుండి ఎదుర్కొనే మానసిక వత్తిడి, సంక్షోభం, అశాంతి వర్ణించబడ్డాయి. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం యొక్క అవసరం, దాని వల్ల కోల్పోయే అనుభూతులూ, ఆనందాలూ, అయినా వద్దనుకుంటూ స్త్రీలు అదేబాటలో నడుస్తున్న కారణాలూ, చాలా హేతుబద్ధంగా వర్ణించబడ్డాయి. చెయ్యి తిరిగిన కథకుడు పి.ఎస్. నారాయణ కథ 'మంచిమనిషి' తాను మంచివాడినని చెప్పుకుంటూ, అక్రమ సంబంధం కలిగి ఉండటం, దానికి ముసుగువేసే ప్రయత్నంలో శాడిజం వీటిని చాలాకాలం భరించిన ఇల్లాలు చివరికి తీసుకున్న నిర్ణయం, కథలో ఇతివృత్తం. నిర్ణయం వల్లనే కథకి గౌరవం పెరిగింది.

అక్రమసంబంధాలు లైంగికస్వేచ్ఛ ఇతివృత్తంగాకల కథలు కూడా ఈ పత్రికలో చోటు చేసుకోవటం కొంత విస్మయాన్నే కలిగిస్తుంది. సమాజంలో అటువంటి సంఘటనలు వ్యక్తులు లేరని చెప్పలేము. కాని, సమాజం పట్ల నైతిక బాధ్యత గల రచయిత, అటువంటి వాటిని ప్రోత్సహిస్తున్నట్టుగా రచన చేయటం మాత్రం ముదావహం కాదు. 'మనరాత్రి' ఉత్కంఠతో సాగే రచన. స్త్రీ పురుషులకి సమానమైన లైంగికస్వేచ్ఛ ఉండాలనటం సబబే, సిద్ధాంతరీత్యా. కాని, ఒక పెళ్ళికాని ఆడపిల్ల కావాలని హద్దుమీరి, అది తన హక్కుగా డిక్లేర్ చేయటమే కొంచెం ఆలోచించాల్సిన విషయం. 'మంచిమనిషి'లో అక్రమ సంబంధాన్ని దాచే ప్రయత్నంలో శాడిస్ట్ కావటం, తప్పని తెలుసుకోవటం వల్లనే, ఎస్.ఎమ్.ధూళిపాళ "గుడ్‌బై ఫర్ ఎవర్" చక్కని శిల్పంతో, మనోభావ చిత్రణతో సాగిన కథ. కథ అంతా ఇద్దరి మనసుల కథనంగా నడుస్తుంది. 'ఇన్‌ఫాట్యుఏషన్'కి వయసు కారణం కాదని, పరిస్థితులు, సంభాషణలు మొదలైనవన్నీ దోహదం చేస్తాయని, దానికి ఎలాటివారూ అతీతులు కారని కాదనటం 'అందమైన ఆత్మవంచన' అనీ చక్కగా సమర్థించారు రచయిత. తన బాస్

భార్య పట్ల ఆకర్షితుడై, ఆమెని ఆకర్షించిన ప్రణీత్‌ని చంపటం, కథ ఎలా ముగించాలో తెలియక చేసినట్లనిపిస్తుంది.

అతి సామాన్యమైన ప్రేమకథ అవస్థతో పాటు ముక్కోణపు ప్రేమ కథలు కూడా ఉన్నాయి. కాని ప్రతి దానికీ ఒక మలుపో, మెరుపో ప్రత్యేకత నిచ్చింది. 'ఒంటరి బాటసారి' (అప్పల్రాజు రచన) లో కిరణ్‌పాత్రలోని తాత్త్వికత. 'కస్తూరి' పాత్రల ఔన్నత్యం కథకి మెరుగుపెట్టాయి. ప్రతాప రవిశంకర్ 'ఆచూకీ' కథాగమనం, కథని చదివిస్తే, ప్రేమికుల ఆలోచనాసరళి, ఎన్నేళ్ళైనా ఒకే రకంగా ఉంటుందన్న సత్యం ముచ్చట కలిగిస్తుంది. అమలిన శృంగారం సీదాసాదాగా సాగిన కథ.

పల్లె, నగర సంస్కృతుల తారతమ్యాలు చూపి, వెంకట రామయ్య పాత్ర ద్వారా స్వచ్ఛమైన గ్రామీణ మనస్తత్వాన్ని కళ్ళకు కట్టేట్లు చేసి, నగరవాసుల కృత్రిమత్వాన్ని వెక్కిరించే కథ సి.హెచ్. వి.యస్. బ్రహ్మానందరావు కథ 'రాతిమనుషులు' కథాగతి ఉత్కంఠ కలిగిస్తుంది. అధికారం, స్నేహాల మధ్య తారతమ్యాన్ని ఎత్తి చూపే కథ 'తగిన సంబంధం' గుమ్మానిత్య కల్యాణమ్మ. అహంకారాన్ని మానవత్వాన్ని పోల్చి చెప్పిన గౌతమ్‌కథ 'సంస్కారం'.

బాబి రచన ఇంటర్వ్యూ, తారకరామారావు కథ 'ట్రైమెంత?' ఆఫీసర్ల, ప్రభుత్వోద్యోగుల మనస్తత్వానికి అద్దం పట్టటంతో పాటు భాష అవసరం, ప్రాంతీయ బాష, ప్రభుత్వ వ్యవహార భాషలు తెలుసుకోవలసిన అగత్యం బోధపడతాయి. రెండింటి కథనశైలి బాగుంది.

సింహప్రసాద్ కథ 'అప్పగింతలు' స్వయంగా కట్టుకున్న ఇంటిపై మమకారానికి అద్దం పడుతుంది. నగ్నసత్యాన్ని ఎదుర్కొనవలసిన అవసరాన్ని ఎత్తిచూపిన కథ 'దిగంబరం' కథ మామూలుదే కాని, దాన్ని నడిపిన తీరు బాగుంది. విజయకిశోర్ తిరునగరి రచన 'మనస్సాక్షి' (కర్రి శివాజీ రచన) మానవతని నిలబెట్టటం కోసం చేసిన ప్రయత్నాలుగ చక్కని శిల్పంతో తీర్చిదిద్ద బడ్డాయి. సోమంచి రామం కథ 'మా వూరెడదాం' ఈనాటి మారుమూల పల్లెల వర్ణన. విషయం పాతదైనా, కథనంలో కొత్తదనం ఉంది. ఒక వ్యాసాన్ని కథలో ఇమిడించి, పాఠకుల చేత కథగా చదివించటం ఇందులోని ప్రత్యేకత. జయాప్రసాద్ 'వానకోసం' రాయలసీమ రైతుల దుస్థితి, వానలు లేకపోవటం చక్కగా వర్ణిస్తూ రాజకీయాలతో పోల్చటం ఉంది.

కె.కె. మీనన్ 'అవతలిగట్టు' చక్కని శైలి హృద్యమైన వర్ణనలు, విషయం సామాన్యమైనదే అయినా నిర్వహణ రమ్యంగా ఉంది. కథా ప్రారంభంలోని రైలు ప్రయాణ వర్ణన లేకపోయినా కథకే మాత్రం లోటుండదు.

వసుంధర కథలు లెక్కల మాస్టారు, దూరం, రాధామాధవమ్ మూడు భిన్న ఇతివృత్తాలున్న కథలు. ప్రతి దానికీ లెక్కలు కట్టే మనిషి, చావు పరామర్శకి కూడ ఎలక్కా కడతాడనటం దీనిలోకి పరాకాష్ట మనుషుల మధ్య పెరుగుతున్న దూరం, ఎంతటిదంటే పక్కింటి మనిషి ఉన్నాడో, లేడో తెలుసుకోవటానికి, ఇంటర్నేషనల్ కాల్స్ చెయ్యాల్సి రావటం - చివరికి కొడుకుని పిలిచి, పక్కవారింటికి తాళం ఉందేమో చూసి రమ్మనగానే పాఠకులకి అరె! అనిపించక తప్పదు.

పుష్యమి కథ 'ఏనాగులవేటు'లో అడవి వర్ణన, వేటాడే పద్ధతులు మొదలైనవి అర్ధవంతంగా వర్ణించబడ్డాయి. కాని చెప్పదలచిన అంశం మాత్రం "వలపు, వ్యామోహం ముందు ధీరత్వంలేదు, వీరత్వం లేదు. ఆడ ఏనుగు పిలువగానే మగ ఏనుగు వచ్చి గోతిలో పడింది. అదీ ఆడతనం ప్రత్యేకత అని.

రావి శాస్త్రిగారి కుమారుడు రాచకొండ ఉమాకుమారశాస్త్రి కథ 'అర్హత-అనర్హత' - రావిశాస్త్రి గారి శైలి, భాష, విషయం ఇందులోనూ కనపడతాయి.

వంశీకథ 'బాబి' లో కథ మామూలుదే అయినా మానవత్వం పట్ల మొగ్గుచూపటం కథని నడిపిస్తాయి.

పోలాప్రగడ సత్యనారాయణ "కథ సీతారామాభ్యాన్నమః మంచి శిల్పం గల కథ ఒక భ్రష్టుడి కథ - కారణం రిజర్వేషనుకావచ్చును, ముగింపు మాత్రం పేలవంగా ఉంది. "ది జర్నీ" రైలు ప్రయాణంలో పడే కష్టాలను కళ్ళకుకట్టినట్లు వర్ణించినది.

బొడ్డేడ బలరామస్వామి కథ "పొట్టి సైకిల్" పిల్లల పట్టుదలకి తార్కాణం. అతివి ఆశ ఊరేగింపువల్ల బద్దలు కావటం పాఠకుడికి అయ్యో అనిపిస్తుంది.

గోపాలుని జయరామచంద్ర "చెదరిన కన్ను" - "వందే శంభుముమాపతిం అంటూ" ప్రారంభమై, "ఏక బిల్వం శివార్పణం" తో పూర్తవుతుంది. మానవనైజం ఎక్కడైనా ఎలా మారకుండా ఉంటుందో - దైవదర్శనానికి వచ్చికూడ దామోదరం చేసిన అనవసరమైన నిరూపిస్తుంది.

ఎంతో వైవిధ్యం కల ఇతివృత్తాలు, శైలులూ, ఉన్న కథలు ఉత్తమ కథకుల కలం నుండి జాలువారిన ఆణిముత్యాలు.



# విశ్వరచన పక్షపత్రిక

ఇటీవల కాలంలో తెలుగులో పత్రికలు తామర తంపరగా పుట్టుకొస్తున్నాయి. వాటిలో కొన్ని సంవత్సరము తిరక్కమునుపే ఆగిపోతున్నాయి. మరికొన్నిమూడు, నాలుగు సంచికలతో కాలదోషం పడుతున్నాయి. సాహిత్యరంగంలో వ్యాపార ధోరణిబాగా ప్రబలిపోయిందనడానికి నిదర్శనాలివి.

ఇటువంటి పరిస్థితుల్లో వ్యాపారాత్మ ధోరణికి దూరంగా, అశ్లీలసాహిత్యానికి తావులేకుండ,నూత్నరచయితల్ని ప్రోత్సహిస్తూ మూడున్నర దశాబ్దాలుగా హైదరాబాదు నుండి వెలువడుతున్న చిన్న పత్రిక 'విశ్వరచన పక్షపత్రిక' ఇది రచయితల సహకార పత్రిక. విశ్వసాహితి సంస్థ సభ్యుల చందాలతో నిరాఘాటంగా నడిపిస్తున్నారు. సంపాదకులు డా॥ పోతుకూచి సాంబశివరావు గారు.

కొత్త రచయితలకథలు, కవితలు, వ్యాసాలు ఎక్కువగా ప్రచురించారు.

ఇందులో ప్రచురించిన కథలవిసయాని కొద్దాం. ఫిబ్రవరి సంచికలో శ్రీమతి మోదుకూరు లలితా ప్రసాద్‌గారి "దేవుడున్నాడు" కథలో సుజాత బస్టాపులో ముష్టిఎత్తుకునే పిల్లవాణ్ణి చూసి జాలిపడుతుంది. తనతో రమ్మని చెప్పి ఇంటికి తీసుకువస్తుంది. ఆ పిల్లాడి వివరాలు భర్తకు చెప్పిపెంచుకుందామంటుంది. పిల్లల్లేనందున భర్త అంగీకరిస్తాడు. పిల్లల్లేని ప్రతిఒక్కరూ. అనాధ పిల్లల్ని పెంచుకొంటే కనీసం ఒక వ్యక్తి కైనా భవిష్యత్తు ఇవ్వచ్చనే మంచి ఇతివృత్తంతో వ్రాయబడినదీకథ.

ఏప్రిల్‌సంచికలోని మల్లాది పద్మావతి గారి "మునగపంట" కథలో కథానాయకుడు తండ్రి ఎన్నోవిధాలుగా ఉద్యోగప్రయత్నంచేస్తాడు కాని రాదు. స్వతంత్ర సమరయోధుల కుటుంబంలో పుట్టినా ప్రభుత్వాదరణలేక పోవడంతోనిరాశ పడకుండా పెరటిలోని మునగ చెట్టు కాయలమ్మి బ్రతుక తెరువు చూసుకుంటాడు. థీమ్ బాగున్నా శైలి గజిబిజిగా వుంది. ఓ పట్టాన అర్థంకాదు.

మే సంచికలో సోమంచి ఉషారాణి గారి మినీ కథ "మందభాగ్యులు"లో స్కూల్లోపిల్లాడు సిగరెట్లుతాగుతున్నాడనే విషయం తెలుస్తుంది. అవి మామూలుసిగరెట్లు కావు. మత్తు పదార్థంతో కూడినవి. డబ్బున్న కుర్రాడు నవీన్ వలన అలవాటైందని తెలిసి కంగారు పడుతుంది. ఈ విషయం భర్తకు తెలిసి ఆవేశంతో కొట్టబోతాడు. కొట్టడం తిట్టడం వలన సమస్య పరిష్కారం కాదని స్కూలు మానిపించి వేరే స్కూల్లో జాయిన్ చేస్తారు. ఆ మాత్రం స్తోమతలేని వాళ్ళ సంగతేమిటి ? అని ప్రశ్నించిన రచయిత్రికి జవాబు లేదనే చెప్పాలి.

ఇదే సంచికలో ప్రచురించబడిన టి.టి.ఎస్.ఎన్. చక్రవర్తి గారి 'ఆశ' కథలో. ట్రేడ్‌యూనియన్ లీడరు గర్భవతి అయిన భార్యతో డా॥ విఠల్ దగ్గరికి వస్తారు. స్కానింగ్‌లో ఆడపిల్ల అని తెలియటంతో అబార్షన్ చేయమంటాడు. అలా చేస్తే పత్రికల్లో ఈ విషయం ప్రకటించి పరువుతీస్తానని బెదిరించడంతో మానుకుంటాడు.

ఆడపిల్లపుడుతుంది. ఆపిల్లకి పదహారేళ్లకే పెళ్ళి చేస్తారు. పెళ్ళి అయిన మరునాడే అతను మరణిస్తాడు. అమ్మాయి కాలేజీలో జాయిన్ అవుతుంది. అలా మొదలైన కథ సినిమాటిక్‌గా మలుపుతిరిగి సందులుగొందులు తిరిగి ఎక్కడో ముగుస్తుంది. దేన్నుద్దేశించి కథ్రవాశారో ఆ రచయితకే తెలియాలి.

మే నెల్లో ప్రచురించిన మరో కథ "చావు". ఎట్టి పరిస్థితుల్లో లీవ్ ఇవ్వని మేనేజరు కామేశ్వర్రావ్ దగ్గర ఎలాగైనాలీవ్ తీసుకోవాలని ప్రయత్నిస్తాడు రమేష్. తాతయ్య చనిపోయాడని ముందుగానే తెలుసుకున్న రమేష్‌తాతయ్య నేరుగా ఆఫీసుకు వచ్చిమేనేజరు రమేష్‌ని ఆటపట్టిస్తాడు. కామెడి ఇతివృత్తమై మామూలుగా నడిచింది.

జూన్ సంచికలో ధరణి కోటసంపత్‌కుమార్ గారి "తప్పు చేయనికళ్ళు" కథలో జడ్జిశ్రీనివాసాచార్యకి యాక్సిడెంట్‌లో రెండు కళ్ళూపోతాయి. ఐబ్యాంకునుండి రెండుకళ్ళుతెచ్చి అమరుస్తారు. ఆ కళ్ళదాత మూర్తి ఇచ్చిన ఉత్తరం జడ్జి శ్రీనివాసార్యకు ఐబ్యాంకు డాక్టరు అందజేస్తాడు. ఆ ఉత్తరంలో కళ్ళ దాతమూర్తి ఒక కాంట్రాక్టరు హత్యలో అన్యాయంగా నేరం మోపబడి ఉరితీయబడ్డానని, తనకళ్లు తీసుకున్న వ్యక్తి అయినా తను నిర్దోషినని నమ్మితేచాలని ఉంటుంది. ఆ ఉరిశిక్ష వేసింది తనేనని తెలిసి జడ్జి శ్రీనివాసాచార్య బాధపడతాడు. మంచి పాయింటుతో మెలోడ్రామా బాగా పండింది.

జూలై సంచికలో కె.ఎల్. శైలజ గారి "బాల్యం కారాదు శాపం" కథలో సరోజకు తమ పిల్లాడ్ని రెసిడెన్షియల్ స్కూల్‌లో వేయడం ఇష్టం లేకపోయినా భర్తమాట కాదనలేక పోతుంది. స్కూల్ ప్రిన్సిపాల్ నుండి ఫోను వస్తుంది. తమ పిల్లాడు స్కూల్ నుండి పారిపోవడానికి ప్రయత్నించాడని. సరోజ బుజ్జగించి విషయం అడిగితే మిమ్మల్ని వదిలి ఉండలేనని బావురు మంటాడు. క్రమశిక్షణ, భవిష్యత్తు పేరుతో బాల్యం కొల్లగొట్టద్దనే పాయింట్ బాగుంది.

ఆగస్టు సంచిక నుంచి రెండు సీరియల్స్ ప్రారంభం కావడంతో కథలకి స్థానం తగ్గిపోయింది.

అక్టోబరు సంచికలో ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మిగారి "గేమ్" కథలో రామనాధం మొదటి ఇద్దరు భార్యలపిల్లల పెళ్లి చేసి డబ్బు దాచి పెడతాడు. తనకేదయినా అయితే

పిల్లలు లేని తన మూడవ భార్య అనాథ అయిపోతుందనే భయంతో డబ్బుపోగు చేస్తాడు. ఆమెకు ఇస్తే దర్జాగా బ్రతికేయగలదని ఆశిస్తాడు. హార్ట్‌ఎటాక్ వలన మూడవ భార్యరాణి హఠాత్తుగా మరణిస్తుంది. దేవుడి గేమ్ ముందు తన గేమ్ ఓడిపోయిందని వైరాగ్యంతో కూడబెట్టిన డబ్బుమొత్తం పిల్లలకిచేస్తాడు. రచయిత్రి ఏం చెప్పదలుచుకున్నారో అర్థం కాలేదు !

నవంబరు సంచికలో వేమువందనం గారి "ఓ సీతమ్మ చావు" లో వీరభద్రరావు కొడుకు సోమశేఖర్ ఎమ్.ఎ.చదువు కొనేటపుడు తన క్లాసుమేట్ సీతను ప్రేమించి కట్నం లేకుండా పెళ్ళి చేసుకొంటాడు. ఆ తర్వాత కొద్ది రోజులనుండి కట్నం కోసం హింసించడంతో ఆత్మ హత్య చేసుకొంటుంది. రొటీన్ కథ.

కథనం సరిగ్గా లేదు. గంభీరమైన ఉపన్యాసాలతో పాటు కథానికకుండాల్సిన లక్షణాలు లేవు. వ్యాసకథలావుంది. ముగింపు సరిగా లేదు. ఏదో ఇకటి రాయకుండా, ముందే చర్చించుకొని, తను రాయాల్సిందేవిటో నిర్ణయించుకుంటే ఈ బాధ తప్పేది.

డిసెంబరు సంచికలో కార్డు కథ "గొలుసు లాగితే" లో ఒక వ్యక్తి నిద్రపోతూంటే తను దిగాల్సిన స్టేషన్ దాటిపోతుంది. గొలుసు లాగితే ఆగిపోతుందని ఎదురుగా ఉన్న అమ్మాయి మెడలో గొలుసు లాగుతాడు (అది ఏం పైత్యమోమరి) ఆమె పోలీసులకు చెబుతుంది. గొలుసులాగితే బండి ఆగుతుందని అలా లాగాను అంటాడు. అది ఎంత వరకు సాధ్యమో రచయితకే తెలియాలి. జోకులా ఉంది తప్ప కథలా లేదు.

స్థూలంగా పరిశీలిస్తే చెప్పుకోదగిన కదట్రాలేదు. ఆదునిక జీవన స్థితి గతుల్ని ప్రతిబింబించే కథలుగాని, ఆర్థిక రాజకీయ సామాజిక జీవితాలకు దర్పణం పట్టే కథల్లేవు. అశ్లీలతకు తావులేనందుకు, యువకులకు, కొత్తరచయితలను ప్రోత్సహిస్తున్నందుకు సంపాదకులు అభినందనీయులు. కానీ సీనియర్ రచయిత పోతుకూచి సాంబశివరావు గారు మంచి కథలు రావడానికి మంచి ప్రయత్నం చెయ్యాలని కోరిక.



# నేత్రం త్రైమాస పత్రిక

"చిన్న కథ అంటే సామాన్యంకాదు చిన్న కథ రాయడం అంటే పైపైని లేదు. స్థూలదృష్టికి అది చాలా సులభంగా కనబడుతుంది. కాని మిక్కిలి కష్టం" అని నాలుగు దశాబ్దాల క్రితం గొప్ప భావుకుడు, చిన్న కథల చక్రవర్తి శ్రీపాదసుబ్రహ్మణశాస్త్రి "తెలంగాణా రచయిత సంఘం" ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన 'కథక సమావేశం' లో పేర్కొన్నాడు.

నిజానికి కథక సమావేశాలు, కథకి సమ్మేళనాలు, కథక సభలు, కథక సదస్సులు ఇప్పుడు జరగడం కాదు, చాలా రోజుల నుంచే జరుగుతున్నాయి. అందుకు ఉదాహరణ 'తెలంగాణ రచయితల సంఘం' నాలుగు దశాబ్దాల క్రితమే ఏర్పాటు చేసిన కథక సమావేశమే.

ఏ సాహిత్యపు వేర్లయినా ఆసంస్కృతి, సంప్రదాయం, జాతీయతలో ఉంటాయి. జాతీయతలో భిన్నత్వం ఉంటుంది, ఉంది. ఆ భిన్నత్వం సాహిత్యంలో ప్రతిబింబించాలని చిరకాలంగా సాహితీ మూర్తులు చెబుతున్నారు. జాతీయత కొంత శిథిలమైనప్పుడు, కొంత విస్మృతం అయినప్పుడు, మరుగున పడినప్పుడు, వక్రమార్గం పట్టినపుడు దాన్ని సరిచేసుకోవడానికి, భద్రపరచుకోవడానికి ప్రయత్నాలు జరుగుతూ వుంటాయి. ఇది ఒకరు చెప్పక ముందే బాధ్యతగల రచయితలు, వ్యక్తులు, సాహితీ 'గంధం' గల వారు పూనుకుని కార్యక్రమాలు చేపడతారు. ఆయా కాలమాన పరిస్థితుల కనుగుణంగా ఆయా రీతుల్లో ఈ పునరుజ్జీవన, పునర్నిర్మాణ కార్యక్రమాలుంటాయి.

విస్మృతం అవుతున్న తెలుగు కథ పునరుజ్జీవన కార్యక్రమం తాజాగా ఎనిమిది సంవత్సరాల క్రితం పునః ప్రారంభమై దిన దిన ప్రవర్ధమానమై పెరుగుతోంది. 20వ శతాబ్దపు తొలిపాదంలో ఆవిర్భవించిన తెలుగు కథ శతాబ్దపు చివరిపాదంలో నూతనోత్తేజంతో, కొత్త రక్తంతో కొత్త దారులు తొక్కుతోంది. కొత్త మలుపులు తిరుగుతూ చిక్కనవుతోంది.

సమకాలీన పరిస్థితులను తేటతెల్లంచేయడమేగాక పథ నిర్దేశనాన్ని సైతం సూచిస్తున్న తెలుగు కథ ఇప్పుడు వివిధ భాషల్లోకి వెళుతోంది. ఇక్కడి వైవిధ్యాన్ని ప్రపంచానికి తెలియజేస్తోంది. ఉద్యమస్ఫూర్తితో అల్లుకుపోతోంది. చాలామందిని ఆశ్చర్యచకితుల్ని చేస్తోంది.

ఈ పాజిటివ్ పరిణామంకోసం సంఘాలు, సదస్సులు, సభలు దోహదం చేశాయి. వీటితోపాటు కొన్ని పత్రికల పాత్ర కూడా బలంగా ఉంది. ఉత్తమ కథా సాహిత్యాన్ని ప్రోత్సహించే పత్రికలు లేకపోతే ఉద్యమ విస్తరణ అంత వేగవంతంకాదు.

'కథావేదిక' సాహితీ సంస్థ చతుర్థవార్షికోత్సవం 1994లో బెంగుళూరులో జరిగినప్పుడు సాహితీ మిత్రుడు' శశిశ్రీ "సాహితీ నేత్రం" పత్రిక ప్రతిపాదన చేశారు. ఉత్తమ కథా సాహిత్యానిక వేదికగా పత్రికను ప్రచురించాలన్న ఉద్దేశ్యాన్ని అందరూ శ్లాఘించారు. ఆ తరువాత ఆ పత్రిక కడపనుండి వెలువడసాగింది.

1997లో వెలువడిన "సాహితీనేత్రం" త్రైమాసిక ఉగాది విశేష సంచికను శ్రీపాద వారికి అంకితమివ్వడం సముచితంగా వుంది.

ఈ సంచికలోని పెద్ద కథ రాచమల్లు రామచంద్రారెడ్డి (రా.రా) గారి అముద్రిత కథ "కావ్యచిత్ర" రా.రా. గారికి విమర్శకుడిగా ఎంత పేరుందో, కథకుడిగా అంత పేరు (రా)లేదు. కావ్యచిత్ర చదివాక ఆయన మంచి కథకుడు అన్న భావన కలుగుతుంది. ఈ కథ అముద్రితంగా ఉండడం వల్ల ఆయన సృజనాత్మక ప్రతిభను కొంత విస్మరించినట్టయిందేమో!

ఇందులోని పాత్రలు, - భర్త శ్రీపతి, భార్య చిత్ర, వాళ్లపాప రేఖ ప్రధానమైనవి. శ్రీపతి మిత్రుడు సూరి, చిత్ర తమ్ముడు భాస్కర్ పాత్రలతో పాటు రెండు మూడు చిల్లర మల్లర పాత్రలు కనిపిస్తాయి.

గురజాడ అప్పారావు తన డైరీలో "Liquor makes a man friendly and generous" అని రాసుకున్నారు. ఆ వాక్యానికి స్పందించి, ఆ కావ్యాన్ని మోహించి రా.రా. ఈ కథ రాశారు. అందుకే ఈ కథను గురజాడకు అంకితమిచ్చారు.

కథాంశం గొప్ప ఉదాత్తమైనది గాకపోయినా పాత్రలు ఎంతో ఉదాత్తంగా ప్రవర్తించడంవల్ల, కథన రీతి ఎంతో సాహసంగా ఉండటం వల్ల, కథలో రీడబిలిటీ ఎక్కువగా ఉండటం వల్ల కథకు వన్నె వచ్చింది. సంసారంలో భార్యాభర్తల మధ్య జరిగే కీచులాటలు, వాళ్లు ఎదుర్కొనే సమస్యలు ఎన్నో కథల్లో చదివినప్పటికీ శ్రీపతి, చిత్ర ఉదాత్త ప్రవర్తన వల్ల సంసారం 'కావ్య' స్థాయికి ఎలా చేరిందో ఈ కథ వివరిస్తుంది. అంతేగాక అనేక సమకాలీన అంశాలు, సాహితీ విషయాల చర్చ పాలలో నీళ్ళలా కథలో కలిసిపోయింది. కథ చదివాక మనల్ని మనం ఉన్నతీకరించుకున్న భావన కలుగుతుంది. ఇది ఉత్తమ సాహిత్య లక్షణం.

ఈ కథలోని గొప్ప గుణం ఏమిటంటే అతి సామాన్యంగా ప్రారంభమవుతుంది. కాఫీ బాగులేక పోవడంతో భార్యపై భర్త అరుపులు, విసుక్కోవడంతో ప్రారంభమైన కథ ప్రపంచాన్ని చుట్టి వస్తుంది. అది ఆషామాషీగా చుట్టి రావడం కాదు ఎంతో చమత్కారం, లోతైన విశ్లేషణ, అనుభూతిని మిగిలించే భావ వ్యక్తీకరణ కనిపిస్తుంది.

శ్రీపతి తెలివి పరుడయినా, ఉదాత్త భావాలుగల వాడైనా సంసార చట్రంలో చిక్కుకుపోయిన వ్యక్తి. సూరి అనే చిన్న నాటి న్యాయవాది మిత్రుడు పనిమీద హైదరాబాద్ వచ్చినపుడు ఇద్దరు కలిసి ఒక బార్‌లో తాగినపుడు వాళ్ళిద్దరి మధ్యన జరిగిన సంభాషణ ఎంతో లోతైనది. ఎలాంటి దాపరికాలు లేకుండా మాట్లాడుకోవడం మద్యం

సేవించిన తరువాతనే సాధ్యం అన్న అంశాన్ని రచయిత ఎంతో నిజాయితీగా నిరూపించారు. మద్యం సేవించక ముందు ఉండే శషబిషలు ఆ తరువాత తొలగిపోతాయి. సో కాల్డ్ (కుహనా) మర్యాదలు ఇగిరిపోతాయి. ఈ అంశాన్ని ప్రతిపాదించి రుజువు చేయడమే ఈ కథ ప్రధాన ఉద్దేశం. అందులో రచయిత నూటికి నూరుపాళ్ళు కృతకృత్యులయ్యారు.

వేదకాలంలో ఆర్యులు బాగా తాగేవారని, ఆ తరువాత మద్యంపై చిన్న చూపు ఏర్పడిందని, అది చివరకు రాజకీయ పార్టీల ప్రణాళికల్లో చేరిందని రచయిత ఎంతో చక్కగా తెలిపారు.

శ్రీపతి తాగివస్తే భార్య చిత్ర విసుక్కోదు. చీదరించుకోదు. యథాప్రకారమే మసలుకుంటుంది. దుష్ప్రవర్తనకు దారి తీయనంత వరకు తాగితే తప్పులేదని చెబుతుంది. శ్రీపతిలో దోషభాషణ (గిల్టీ ఫీలింగ్) ఆమె ముందు వ్యక్తం చేసినప్పుడు " యేది తప్పో, యేది ఒప్పో ఓ మహాత్మా, మహర్షీ... " అంటూ కవితా వాక్యాలతో గంభీరమైన వాతావరణాన్ని తేలిక పరుస్తుంది.

చివరన ఇప్పుడొక రేఖ (కూతురు పేరు) ఉంది. ఇంకో రేఖను ప్రసాదించవూ అని భార్యను ప్రాధేయపడతాడు. ఎందుకు? అని ఆమె ప్రశ్నిస్తే "ఆడజన్మకదా కావ్యం! కనుక నీవు కావ్యాలే సృష్టించాలి" అని శ్రీపతి ఆమె ఒడిలో ఒదిగిపోతాడు.

ఈ సంచికలోని మరో మంచి (అసంపూర్ణ)కథ 'మాదిగపల్లె' - ఈ కథా రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి.

తెలంగాణా ప్రాంతంలో 1972 అనంతరం చాలామంది రచయితలు, కవులు మాదిగ పల్లెల్ని సందర్శించి వారి జీవితాలను చక్కదిద్ది, వారిని చైతన్య వంతుల్ని చేసి, ప్రధాన స్రవంతిలోకి తీసుకరావడానికి ప్రయత్నం చేశారు. ఇదంతా వ్యక్తిగతంగా గాకపోయినా ఏదో రాజకీయ పార్టీ తరపునో, సంస్థ తరపునో జరిగినప్పటికీ ఈ ప్రయత్నం ఎంతో చెప్పుకోదగ్గది. కొంత మంది వ్యక్తిగత హోదాలో కూడా ఈ ప్రయత్నాలు చేశారు.

మాదిగ పల్లెల్లో రాత్రి పాఠశాలలు పెట్టడం, వ్యవసాయ కూలీల రేట్లు పెరుగుదలకు పాటుపడటం, పరిశుభ్రతను బోధించడం, మానసిక ఎదుగుదలకు గీతాలు ఆరోపించడం ఇట్లా అనేక కార్యక్రమాలు జరిగాయి.

విచిత్రమేమిటంటే స్వాతంత్ర్యం రాక పూర్వమే ఇలాంటి కార్యక్రమాన్ని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి నిర్వహించారని 'మాదిగపల్లె' చదివితే అర్థమవుతుంది. ఈ కథ స్వానుభవంతో రాశారనడానికి ఆధారాలు ఎక్కువగా కనిపిస్తాయి. స్వాతంత్ర్యం రాకముందు హరిజనోద్యమం ప్రారంభమైనా, అనంతరం ఎందరో సంస్కర్తలు కృషి చేసినా, శ్రీపాద లాంటి రచయితలు మాదిగల అభివృద్ధికి నైతిక మద్దతు ఇచ్చినా, విప్లవ శక్తులు వారి ఆలోచనా ధోరణిని మార్చడానికి ప్రయత్నించినా, ఇటీవల 'దండోరా' ఉద్యమం ఉప్పెనవలె లేచినా ఇప్పటికీ అనేక గ్రామాల్లో మాదిగల పరిస్థితి ఆశించినంత మెరుగుపడలేదు.

మాదిగలకు దూరంగా వుండి వారి ఉపరితల అంశాలను మెరుగుపరచడం గాక వారిలో ఒకరిగా బతుకుతూ వారిలో మానసిక చైతన్యం, మార్పు తీసుకురావడానికి పూనుకోవడం ఎంతో ఉదాత్తమైన అంశం - ఇది నిజమైన అభివృద్ధికి దోహదపడుతుంది. అందులో బ్రాహ్మణుడు (శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రి) మాదిగల పల్లెలోకి వెళ్లి, వాళ్ల అరుగుపై కూర్చొని వాళ్లతో ముచ్చటించడం ఆ కాలానికి ఎంతో విప్లవాత్మక చర్య.

"మీలో ఆవేదనను కలిగిస్తాను. మీకులాన్ని మీ చేతలతోనే ఉద్ధరింప జేస్తాను. మీ రెక్కల కష్టంతోటే మిమ్మల్ని బాగుచేస్తాను" అని ఓ ప్రవక్తలా చెబుతాడు. ఈ కథలోని అంత స్సూత్రమే ఇది.

ఈ ప్రవక్త వచనాలు ఈనాటికీ ఆచరణీయం. రచయిత ఆదర్శాలను వల్లించడమే కాదు. ఆ చరణలో పెట్టాలన్న వాదనను శ్రీపాద ఏనాడో రుజువు చేశారు. ఇది అసంపూర్ణ కథ అయినప్పటికీ, సీదా, సాదా శిల్ప నైపుణ్యంతో సంస్కరణ వాదాన్ని బలపరుస్తూ ఎంతో హృద్యంగా సాగింది.

మరో కథ మధురాంతకం రాజారాం రాసిన అనాది బాధ. ఇది ఈనాటి పెళ్లిళ్ళ పేరయ్య(ల) కథ. క్షుద్బాధకు సంబంధించిన కథ. పేరయ్యల పేరాశలు, బలహీనతలు, ప్రతికూల పరిస్థితుల్లో పడే ఆవేదన, ఆక్రోశం - ప్రతికూల పరిస్థితులు మారి అనుకూలిస్తే అతనే ఆవేదన, ఆక్రోశమే దీవనెలుగా ఎలా వల్లిస్తాడో ఈ 'అనాదిబాధ' కథ కళ్ళకు కడుతుంది. సగటు మనిషి మనస్తత్వం ఎంత బలహీనమైందో గాలి ఎలా వీస్తే అలా కొట్టుకు పోయేతత్వం ఎలా ఉంటుందో ఈ కథ చెబుతుంది.

కథనం జలపాతాన్ని తలపింపజేస్తుంది. అందుకు పాత్ర మనస్తత్వం ఎంతో ఉపకరిస్తుంది. ఇది వైయక్తిక కథలా తోచినా కథ నిండా సమాజం కనిపిస్తుంది. 160కిలోమీటర్లు ప్రయాణం చేసిన పేరయ్య ఊహల పల్లకి, ఆశల పందిరి, కొత్త ఊళ్ళో 'బంద్' కుప్పకూల్చుతుంది. దాంతో ప్రాథమికావసరాలైన తిండి, గుడ్డ (కప్పుకోడానికి), నీడ కరువై ఎంతో ఆవేదనకు గురువుతాడు.

కూపీలాగగా బంద్‌కు కారణం హత్య - దానికి కారణం ఈర్ష్య, పగలు, గందరగోళం ఇట్లా అనేక మౌలిక అంశాలు ముందు కొస్తాయి.

ఈ ప్రాథమికావసరాల కోసం, మౌలికాంశాల కోసం మనిషి పడే బాధే ఈ 'అనాది బాధ' -

మరుసటి రోజు 'బంద్' లేదు - క్షుద్బాధ తీరింది. హోటల్ రూం దొరికింది. కంటి నిండా నిద్రపట్టింది. అంతకు ముందు రోజు శ్మశానంలా కనిపించిన పట్టణం, పచ్చ పచ్చగా నందన వనంగా అగుపించ సాగింది. ఇదే మనిషి లోని 'కాంట్రాస్ట్'

రాయలసీమ ప్రాంత ప్రముఖ రచయిత సింగమనేని నారాయణ రాసిన కథ వాసంత తుషారం. ఇది గమ్మత్తైన చిన్న కథ. మగవాళ్లు చేసే పనిని ఆడపిల్లలు చేస్తే ఎలా వుంటుందనే ఊహ అప్పుడప్పుడు మనకు కలుగుతూ వుంటుంది. ఆ ఊహకు సింగమనేని కథా రూపమిచ్చారు. అనంతపురం నుంచి వసంత, తుషార చదువుకున్న ఆడపిల్లలు. ఒక పల్లెటూరు లోని రామక్రిష్టప్ప ఇంటికి వస్తారు. తన కుమారుడు వెంకటపతిని చూడ్డానికి వాళ్లు వచ్చినట్లు తెలియగానే రామక్రిష్టప్ప కొంత ఇబ్బందిగా మెసలుకున్నా ఆయన భార్య వెంకటలక్ష్మమ్మ మాత్రం ఏం తడబడకుండా వారికి చేయవలసిన మర్యాదలన్నీ చేసింది. ఒక తల్లి కూతుళ్ళను చేసినట్టు తలలు దువ్వి, పూలు పెట్టి పొలానికెళ్ళిన కొడుకును పిలిపించి వారికి పరిచయం చేసింది. "ఎప్పుడూ మగపిల్లలేనా ఆడపిల్లల్ని పెళ్ళి చూపులు చూసేది - ఏం? ఆడపిల్ల వెళ్ళి ఎందుకు చూడకూడదు? "అని చిన్నప్పటి నుంచి తన మనసులో ఉన్న మాట ఈ రకంగా తీరినందుకు సంతోషంగా ఉందని వెంకట లక్ష్మమ్మ అనగానే పెళ్ళికూతురు వసంత, ఆమె స్నేహితురాలు తుషార విస్తుపోయారు.

ఎమ్మెస్సీ, బి.ఇడి., చదివిన వెంకటపతి ఆ అమ్మాయిల ప్రశ్నలనన్నిటికీ ప్రసన్న వదనంతో హుషారుగా సమాధానాలిచ్చాడు. మేమిలా వచ్చి పెళ్ళి చూపుల వ్యవహారం నడపటం గురించి మీరేమనుకుంటున్నారు? అని ప్రశ్నించగా "కొత్త అయినప్పటికీ

అసహజమైందేమీ కాదు. అసాధారణంగా ఏమీ అనిపించలేదు'' అనడంతో వాళ్ళిద్దరూ మరింత విస్తుపోయారు. నగరాల్లో, పట్టణాల్లో నివసిస్తున్న వారి మానసిక ఔన్నత్యానికి ఏ మాత్రం తీసిపోని రీతిలో పల్లెటూర్లో నివసించే వారూ ఉంటారన్న మాటను చెప్పకనే చెప్పే ఈ కథ వసంతకాలంలో తుషారం లాంటిదే.

భిన్న కథాంశం గల కథ 'దొరగారి భార్య' - రచయిత కాలువ మల్లయ్య. కథాంశంపై గల మక్కువ కథనంపై రచయితకు కనిపించదు. దాంతో కొన్ని సందర్భాలలో కొన్ని వాక్యాలు, పదాలు పంటి కింది రాయి తోస్తాయి. పెద్ద కాన్వాసును చిన్న కథలో ఇముడ్చడానికి ప్రయత్నించినప్పుడు మరింత జాగ్రత్త వహించాల్సి ఉంటుందని రచయితనే మరోసారి తన కథను చదివితే తెలుస్తుంది. కథా ప్రారంభంలో దొరసాని లక్ష్మీదేవిన ఇతన మేనల్లుడు శంకర్రావుతో అన్న మాటలు. ఆలోచింపజేసాయని రచయిత చెబుతాడు. ఒక మేనల్లుడు మేనత్త నుద్దేశించి అనే మాటలు అలా ఉంటాయా? అన్న అనుమానం పాఠకులకు కలుగుతుంది.

"అత్తయ్యా! మామ నిన్ను నీ అందం చూసి పెళ్లి చేసుకున్నాడంటారు. మరా అందానికైనా విలువిచ్చాడా? నువ్వతనికి శారీరక సుఖాలనిచ్చే భోగవస్తువువి మాత్రమే. కేవలం భోగ వస్తువువే.. . కోరి పెండ్లి చేసుకున్న నువ్వు ఇంట్లోనే ఉన్నా ఎంతో మందితో అక్రమ సంబంధం పెట్టుకున్నాడు. నిన్ను మామయ్య తనుంచుకున్న గంగమ్మ కంటెక్కువేం చూళ్లేదు. ఆమె లాగే నువ్వు కూడా ఆయన శారీరకావసరాలు తీర్చేదానికి మాత్రమే. కాదంటావా? అత్తయ్యా...!''

ఈ రకమైన మాటలు మేనల్లుడు అనడం సాధ్యమా? సాధ్యమే అనుకున్నా ఆ మాటలను దొరసాని మరీ మరీ జ్ఞాపకం చేసుకోగలదా? అన్న అనుమానం కథారంభంలోనే కలుగుతుంది. ఇది ఇట్లా ఉండగా కరీంనగర్ జిల్లాలోని వెలమ దొరల ఇళ్ళలోని స్త్రీలు ముఖ్యంగా మనసున్న స్త్రీ ఎంత దయనీయంగా కాలం వెళ్లబుచ్చుతుందో కాలువ మల్లయ్య ఈ కథలో వివరిస్తాడు. కొన్ని వాస్తవాల్ని పాఠకుల ముందు ఉంచుతాడు ఆలోచించమంటాడు.

ఈ విశేష సంచికలో చిలుకూరి దేవ పుత్ర రాసిన 'ప్లాటు' కథ నేటి ఇళ్ళ స్థలాలకై నగరాల్లోనే కాదు పట్టణ ప్రాంతాల్లో ఎన్ని అవస్థలు పడాల్సి వస్తుందో, కొందరు ప్రభుత్వ భూములను ఎలా కాజేస్తున్నారో, ప్రభుత్వ యంత్రాంగం ఎంత గుడ్డిగా వ్యవహరిస్తుందో వివరించే కథ - నిజాయితీ నిజంగా కనిపించే కథ 'ప్లాటు'

తుర్లపాటి లక్ష్మి రాసిన 'కుక్క' తెలంగాణా ప్రాంతంలో ముఖ్యంగా పట్టణ ప్రాంతంలో ఇళ్ళల్లో పనిచేసుకునే ఓ స్త్రీ దీన గాథ. స్త్రీ వాద కథ. అలాగని జీవితానికి దూరంగా చిత్రించిన కథ గాదు. ఖజానా అన్న హిందీ కథ, సీతాకోకచిలుకలు, అన్న కన్నడ కథ - అనువాదాలు ఇందులో ఉన్నాయి.

మరోసారి శ్రీపాద మాటల్ని మననం చేసుకుందాం.

"రచయిత అయిన వాడికి రచన ఒక యజ్ఞం. ఇదొక ఆరాధన, ఇదొక తపస్సు, ఇదొక రాజయోగం. దీంతో 'సత్యం' అవగాహన అవుతుంది. 'శివం' సన్నిహితం అవుతుంది. 'సుందరం' సాక్షాత్కరిస్తుంది. ఆత్మపరిశుద్ధం అవుతుంది.''

అనంతరం ఉత్తమ కథాసాహిత్యం వెలువడుతుంది. ఉత్తమ కథా సాహిత్యం ఉత్తమ సమాజాన్ని నిర్మిస్తుంది.





**కీ॥ శే॥ వేదగిరి పూర్ణచంద్రరావు**

స్మారక కథాసమీక్ష

అవార్డు (1997) రూ 1, 116 పొందిన

**డా॥ సి. మృణాళిని వ్యాసం**

# 1997 కథా సమీక్ష

తెలుగు కథకు 1997 శుభసూచకంగా ప్రారంభమైంది. కేంద్ర సాహిత్య అకాడమీ, తెలుగు అకాడమీ సహకారంతో జనవరిలో ఐదు రోజులు కథాసదస్సు జరపడంలో రాష్ట్రంలోని భిన్నప్రాంతాలకు చెందిన కథకులకు ఒకే వేదికపై కలుసుకునే అవకాశం కలిగింది. డెబ్భై యైదేళ్ళ తెలుగు కథను కూలంకషంగా చర్చించడానికీ, మంచి కథలను విశ్లేషించడానికి, ఇక్కడ పునాది ఏర్పడింది, ఈ సంవత్సరం దాదాపు పాతికవరకు కథా సంపుటాలు వెలువడ్డాయి. మరుగున పడిన మంచి రచయిత్రి కళ్యాణ సుందరీ జగన్నాధ్ కథలు కూడా ఎన్నో ఏళ్ళ తర్వాత ప్రచురణకు నోచుకోవడం ఒక చక్కని సన్నివేశం. ఇతర ప్రక్రియలకంటె కథానికకే పాఠకులలో 'చెల్లుబడి' ఎక్కువగా ఉందనే విశ్వాసం మరింత దృఢమయింది.

కథకు లభిస్తున్న ఈ ఆదరణను పత్రికలు కూడా గుర్తించి, వాటికి విశేషస్థానాన్ని అందిస్తున్నాయి. ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, స్వాతి, సుప్రభాతం, ఇండియాటుడే వంటి వారపత్రికలు, అన్ని దిన పత్రికల ఆదివారం అనుబంధాలు, ఆంధ్రభూమి, ఆహ్వానం, ప్రజాసాహితి వంటి మాసపత్రికలూ కథకు పెద్దపీట వేసాయి. నలభయ్యేళ్ళుగా కథలు రాస్తున్న వారి దగ్గర్నుంచీ, ఈ సంవత్సరమే కలం పట్టిన వారి వరకూ అందరి కథలూ అన్ని పత్రికల్లోనూ వచ్చాయి.

ఈ ఏడాది కథలను సూక్ష్మంగా పరిశీలించి చూస్తే, ఒకే ధోరణికి, లేదా వాదానికి

చెందిన కథలు చెప్పుకోదగ్గ సంఖ్యలోగాని, స్థాయిలోగాని రాలేదని స్పష్టమౌతుంది. ప్రాధాన్య వివక్షను బట్టి చూసినా, ఏ ఒక్క ధోరణివైపు కథలు మొగ్గు చూపకపోవడం కనిపిస్తుంది. స్త్రీ వాద, దళిత ఉద్యమాల నేపథ్యం కలిగిన కథలు మందపవనాల్లా ఉన్నాయిగానీ, ప్రభంజనాల్లా రాలేదు. కాకపోతే, ఈ సారి కథల్లో ఒక వింత పోకడ వచ్చింది. స్త్రీ వాద విమర్శ వ్యాసరూపంలో కాక, కథారూపంలో ప్రత్యక్షం కావడం ఒక విలక్షణమైన సన్నివేశం. దీనిగురించి చర్చించేముందు, స్థూలంగానైనా 1997 కథల వస్తువును వింగడించగలమేమో చూడాలి.

కథకు ముడిసరుకు ఎప్పుడూ జీవితమే. కానీ ఆ జీవితాన్ని ఏ కోణంనుంచి చూస్తున్నాం? మనం చూసే దృష్టిలో ఎంత సామంజస్యం ఉంది, ఎంత అవగాహన ఉంది? ఆ అవగాహనను పాఠకుడికి అందించడంలో ఏ విధానాన్ని అవలంబిస్తున్నాం? అందులో ఎంతవరకు కృతకృత్యులమౌతున్నాం ? అనే ప్రశ్నలు కథకుడి ప్రతిభను, నిజాయితీని ప్రక్రియపై అతనికి గల పట్టును నిరూపించడానికి తోడ్పడతాయి.

ప్రపంచ సాహిత్యంలో లక్షలాది కథలు వెలువడిన తర్వాత, ఏ రచయిత "కొత్తకథ"ను చెప్పానని ఢంకా బజాయించి చెప్పలేడు. 'కొత్తగా కథ' ను చెప్పడానికి ప్రయత్నించడమే అతని కర్తవ్యం. జీవితాన్ని చూసే దృష్టిలో, ఆదృష్టిని అభివ్యక్తీకరించే శిల్పంలో ఈ కొత్తదనం ఎంత వరకు కనిపిస్తోందని ప్రశ్నించుకున్నపుడు, ఈ ఏడాది వచ్చిన కథల్లో 70 శాతం అంత విలక్షణంగా లేవని ఒప్పుకోకతప్పదు. ఎన్నో సార్లు ఎందరో రచయితలు స్పృశించిన వస్తువులనే, సృజించిన పాత్రలనే మళ్ళీ మళ్ళీ అక్షరబద్ధం చేయడం ఈ 70 శాతం కథల లక్షణం. తల్లిదండ్రులు, పిల్లల మధ్య గల తరాల అంతరాలు, ఆర్థిక సంబంధాలు, యువతీ యువకుల ప్రేమలో అపార్థాలు, భార్యాభర్తల మధ్య అర్థరహితమైన కయ్యాలు, పేదధనిక వర్గాల వ్యత్యాసాలు, పేదల ఔన్నత్యం, ధనికుల క్రౌర్యం - ఈ వస్తువులతో చాలా కథలు అన్ని పత్రికల్లోనూ వచ్చాయి. అవి పాఠకులకు కొత్తగా చెప్పిన నిజాలుగాని, చూపించిన కోణాలుగానీ లేవు. ఈ కథకుల్లో సుప్రసిద్ధులూ ఉన్నారు., తాజా కలాలవారూ ఉన్నారు.

సమకాలీన సమాజంలోని అలవాట్లపైనా, రాజకీయాలపైనా ఘాటైన విసుర్లతో ఓ కొత్తవస్తువు తెలుగు కథకు దొరికింది. టెలివిజన్ సామాన్య మానవుడి బాహ్యాంతర

జీవితాలను ఎలా కలుషితం చేస్తున్నదో చెప్పే కథలు, కొంత నవ్యతను కథావస్తువుకు అందించాయి. బమ్మిడి జగదీశ్వరరావు మూడో ప్రపంచ యుద్ధం (సుప్రభాతం) కథ, కొంత అతిశయోక్తిగా అనిపించినా ప్రసారోద్యమ ప్రభావంపై హృదయాన్ని కలచివేసే వ్యాఖ్యానాన్నే చేసింది. ఇచ్ఛాపురపు రామచంద్రం 'గిన్నిస్ బుక్' సమకాలీన సమాజంలో నానాటికీ పెరుగుతున్న 'రికార్డుల' పిచ్చిపై సునిశితమైన వ్యంగ్య చిత్రం.(ఈనాడు ఆదివారం అనుబంధం).

రాజకీయాలు, టి.వి.ల పుణ్యమాని ఈ ఏడాది హాస్యకథల సంఖ్య గణనీయంగానే ఉంది. అన్ని కథలూ ఉత్తమ హాస్యాన్ని అందించకపోయినా, తెలుగు సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ క్రమేపీ అంతరించిపోతున్న హాస్యానికి ప్రాణప్రతిష్ట చేయడానికి ప్రయత్నించడమే ఈ కథలలోని గొప్పదనం. ఈనాడు ఆదివారం అనుబంధం హాస్యకథలకు మంచి ప్రోత్సాహాన్నివ్వగా ఎప్పటిలాగే 'ప్రజాసాహితి' మాసపత్రిక వర్గ చైతన్యాన్ని ప్రతిబింబించే కథల్ని అందించింది. వర్గపోరాటాలు, కుహనాఎన్‌కౌంటర్లు, పోలీసుదౌర్జన్యాలు- వీటన్నిటి నేపథ్యంలో స్త్రీల జీవితాలు ఈ ఇతివృత్తంతో వచ్చిన కథల్లో బమ్మిడి జగదీశ్వరరావు రాసిన 'గుండు', కాలువ మల్లయ్య 'పంజరం' అట్లూరి పిచ్చేశ్వరరావు రాసిన 'నెత్తురు' చెప్పుకోదగ్గవి.

ప్రేమ, శృంగారం, కాలక్షేపం కథలతో, కొన్ని పత్రికలు యధాశక్తి తమ పుటల్ని నింపుకోగా, కొంత ప్రయోజనకరమై, సమకాలీన సామాజిక సాహిత్య ఉద్యమాలను ప్రతిబింబించే కథలను మరికొన్ని పత్రికలు ప్రచురించాయి.

స్త్రీవాదానికి సంబంధించి ఈ ఏడాది రెండు పోకడలు ప్రస్ఫుటంగా కనిపించాయి.

1. పురుషులు స్త్రీవాద చైతన్యాన్ని ప్రదర్శించే కథలు రాయడం.

2. స్త్రీలు, పురుషులు కూడా వ్యాసాల్లో కాక, కథల ద్వారా స్త్రీవాదాన్ని ఖండించడం.

ఈ రెండురకాల కథలూ ఈ ఏడాది కొత్తచర్చకు అవకాశాలిస్తున్నాయి.

ఆచార్య కొలుకలూరి ఇనాక్ ('వార్త' ఆదివారం అనుబంధంలో) పితృస్వామ్య వ్యవస్థపై, తమను అణిచివేస్తున్న శక్తులపై తిరుగుబాటు చేసిన స్త్రీని 'విముక్తి', 'డౌరీ డెత్' అనే కథల్లో శక్తివంతంగా ఆవిష్కరించారు. పి.వి.బి. శ్రీరామమూర్తి 'స్ఫూర్తి'

(ఈనాడు), కప్పగంతుల మల్లికార్జున రావు 'ఈల' (ఈనాడు), ప్రతికూల పరిస్థితుల్లో స్త్రీలలో తలెత్తవలసిన పోరాటపటిమను సూచించే కథలు. ఇలా పాతతరం రచయితలు స్త్రీలలో రావలసిన చైతన్యాన్ని ఒక సామాజిక వాస్తవంగా, అభిలషణీయమైన ఆదర్శంగా చిత్రించడం ప్రారంభించేసరికి, కొత్తతరం రచయిత తోలేటి జగన్మోహన రావు స్త్రీలలో చైతన్యం వచ్చేస్తుందేమోనని బెంగపెట్టుకొని 'జీవితబంధం' (ఇండియా టుడే) కథను రాసారు. వెనుకటి తరం పురుషులు స్త్రీలను నాలుగు గోడలమధ్య బంధిస్తే, ఈ నవతరం రచయిత స్త్రీవాదాన్ని ఇనప్పెట్టెలో భద్రపరచి తన 'వ్యక్తిత్వాన్ని' చాటుకున్నారు. స్త్రీ, పురుషుల మధ్య సమానత్వం, సదవగాహన ఉండాలని చెప్పడం మంచిదే. కానీ స్త్రీవాదంపై కక్షతో కలం పట్టేసరికి ఆ అత్యుత్సాహంలో తన కథాప్రయోజనాన్ని, ప్రక్రియా స్వరూపాన్ని తోలేటి పూర్తిగా విస్మరించారు. రచయితకు తన వస్తువుపట్ల లోతైన అవగాహన ఉన్నపుడు హాస్యంగానూ చెప్పగలడు. గంభీరంగానూ చెప్పగలడు. కానీ స్త్రీల సమస్యల ఆచూకీ ఎరుగని ఇలాంటి రచయితల 'హాస్యం' విషయాన్ని వక్రీకరించడానికే తప్ప, నిఖార్సయిన వ్యంగ్యానికి దోహదం చెయ్యదు.

తోలేటి తన అవగాహనాపటిమను 'జీవితబంధం' ద్వారా నిరూపించుకుంటూ వుండగా, ఓల్గా స్త్రీ జీవితానికి మరో మూడు కోణాలను మూడు చక్కని కథల్లో చూపించారు. 'వార్త' ఆదివారం అనుబంధంలో 'పురిటి నొప్పులు', ఆంధ్రప్రభలో 'మొదటి చా వు', సుప్రభాతంలో 'నిశ్శబ్దం' అనే మూడుకథల్లో, మొదటి చావు నిస్సందేహంగా గొప్పకథ.

డి.కామేశ్వరి 'ఈ శిక్ష చాలు', మన్నెం శారద 'కిటికి' కూడా స్త్రీలు తమ సమస్యలను ఎదుర్కోవలసిన విధానాన్ని, వారిలో రావలసిన చైతన్యాన్ని సూచించిన మంచికథలు. స్త్రీవాదంలోని లోపాలను ఎత్తిచూపాలనే ప్రయత్నంలో సుప్రసిద్ధ రచయిత్రి కె.రామలక్ష్మి రాసిన కథ 'నో నో ప్లీజ్' (ఇండియా టుడే). వస్తువులోనూ, కథనంలోనూ బలం లేనందువల్ల రచయిత్రి ఆశించిన ప్రయోజనం కొన్ని మైళ్ళదూరంలో నిలిచిపోయింది. స్త్రీవాదం వివాహ, కుటుంబ వ్యవస్థల విచ్ఛిన్నాన్ని మాత్రమే ప్రచారం చేస్తోందనే దురభిప్రాయంతో ఆ రెండు వ్యవస్థలకు తాము భద్రతాసిబ్బంది అనుకుంటూ కొందరు ఆడ, మగ రచయితలు కథలు రాసారు. ఈ కథల్లో భార్యలు తొందరపాటుతో

వ్యవహరించడం, చివరికి పశ్చాత్తాపపడి, భర్తకు అనుకూలంగా నడచుకోవడం ప్రధాన వస్తువు. ఉదాహరణకు కె. మురళీకృష్ణ 'విలువలు' (ఈనాడు - ఆదివారం అనుబంధం), దీనికి విరుద్ధంగా, స్త్రీ వాద విమర్శకుల పై కోపంతో సి. సుజాత లైంగిక సంబంధాలే ప్రధాన వస్తువుగా నాలుగు కథలు రాసారు.

దళిత స్పృహతో కొన్ని మంచి కథలు కాలువ మల్లయ్య, డా॥ చంద్రశేఖర రావు, బమ్మిడి జగదీశ్వర రావు తదితరులు రాసారు. దళిత స్త్రీ జీవితంలోని ఆవేదనను అగ్రవర్ణ, పురుషాధిక్య సమాజం వారిపై జరిపే అత్యాచారాలను డా॥ వి. చంద్రశేఖర రావు గారి 'నలుపు' (సుప్రభాతం) బమ్మిడి గుండు (ప్రజా సాహితి) ప్రతిభావంతంగా చిత్రించాయి. సాధారణంగా దళితకథల్లో దళిత పాత్రలను పీడితులుగా అణచివేతకు గురౌతున్న వారిగా, అన్యాయాన్ని ప్రతిఘటిస్తున్న వారిగా చిత్రించడం కనిపిస్తుంది. డా॥ వి. చంద్రశేఖర రావు రాసిన 'ఎక్కడుంది వెలుగు సోనియా' (ఆంధ్రజ్యోతి - ఆదివారం అనుబంధం) లో హింసాత్మక రాజకీయాల్లో దళితులు కూడా అగ్రవర్ణాలలో భాగస్వామ్యులనని స్పష్టంగా చెప్పడం విశేషం. కథానాయకుడు మోహన సుందరం 'గూండా'గా మారడానికి అతని జీవితంలో ఎదురైన పరిస్థితులే కారణమైనా, అతనిపై సానుభూతి కలిగేలా రచన సాగలేదు.

దళితులు, స్త్రీల సమస్యలు వారి తిరుగుబాటు చైతన్యం గత కొన్నేళ్ళుగా మంచి ప్రాతినిధ్యాన్నే పొందుతున్నా, తెలుగు కథలో అతి తక్కువ స్థానం పొందుతున్న వర్గం మైనారిటీలదే. అందుకే, ముస్లింల అలవి కాని ఆచారాలను అధిక్షేపించిన ఖదీర్ బాబు 'దావత్' (ఆంధ్ర జ్యోతి - ఆదివారం అనుబంధం) పాఠకులను విశేషంగా ఆకర్షించింది. ఈ తరహా కథలు మరిన్ని రావలసిన అవసరం వుంది.

ఏధోరణికీ, ఏ వర్గానికీ ప్రాతినిధ్యం వహించక, పాతతరం రచనలను మరోసారి మురిపెంగా గుర్తుచేసిన పెద్ద కథ శ్రీరమణ రాసిన 'మిథునం' (ఆంధ్రప్రభ - వారపత్రిక) శ్రీరమణది, మల్లాదిని (రామకృష్ణ శాస్త్రి అని గమనించవలెను) గుర్తు తెచ్చే శైలి, బాపు రమణల మార్కు హాస్యం, చక్కని ముగింపు సజీవమైన పాత్రలతో ఇది ఒక మంచి కథగా రూపొందింది. ఒకటి రెండు సన్నివేశాల్లో చెప్పేయగలిగిన కథకు అనేక సన్నివేశాలు కల్పించడం, కథకు కవితా లక్షణాలను అనుసంధించి నట్లయింది, కొంతవరకూ సినిమా స్క్రీన్‌ప్లే లక్షణాలు కూడా ఈ కథకున్నాయి.

వస్తుపరంగా 1997 కథలు వైవిధ్యాన్ని కొంతవరకు చూపుగలిగాయి. వస్తువుతో సమానమైన శ్రద్ధ రచయితలు శిల్పం పట్ల చూపగలిగారా? అన్న ప్రశ్నకు అంత తృప్తికరమైన సమాధానం లభించదు.

ఎక్కువమంది రచయితలు చేసిన పని 'కథను చెప్పుకొంటూ పోవడం'' చెప్పదలుచుకున్న విషయం అయిపోగానే కథను ఆపేయడం'' కథలు చెప్పడం అలవాటైన రచయిత ఈ చెప్పుకొంటూ పోవడం తోనే చదివించే లక్షణం సాధించగలడు. కానీ కథ ముగిసిన తర్వాత ఒక గాఢమైన స్పందన కలగాలంటే, కథ చాలాసార్లు పాఠకుడికి గుర్తు రావాలంటే, చక్కని శిల్ప అవసరం. జీవితాన్ని కొత్త దృక్పథంతో కొత్త కలం నుంచి చెపుతున్న రచయితలు కూడా కొత్త సంవిధానంతో, కొత్త పద్ధతితో చెప్పడానికి ప్రయత్నించడం లేదు. ఇలాంటి కొత్త పద్ధతిలో నడచిన కథకు ఉదాహరణంగా 'ఆహ్వానం' లో ప్రచురితమైన 'గేటు చప్పుడు' కథను చెప్పుకోవచ్చు. పి. వి.జయలక్ష్మి రాసిన ఈ కథలో ఇంటి యజమానురాలికీ, పనిమనిషికీ గేటు చప్పుడు వేర్వేరు అర్థాలనిస్తుంది. తన భర్త అయి వుంటే బాగుండునని యజమానురాలూ, తన భర్త కాకపోతే బావుండునని పనిమనిషీ అనుకుంటారు. ఇంతలో ఎవరు గేటు తీసిందీ రచయిత్రి చెప్పరు. ఆ చెప్పక పోవడంలోనే శిల్ప సౌందర్యం దాగి వుంది. ఎందుకంటే, ఈ కథలో ప్రతిపాద్య అంశం ఆ ఇద్దరు స్త్రీల మనస్థితే గానీ వారి జీవితాల్లో తర్వాత ఏం జరుగుతుందన్నది కాదు. కథను చలన చిత్రంలా సాక్షాత్కరింపచేసిన మరో మంచి కథ గొరుసు జగదీశ్వర రెడ్డి "జగదాంబ జంక్షన్'' వస్తు, శిల్పాల పట్ల సమానమైన శ్రద్ధ చూపిన, కొందరు రచయితల్లో కొలకలూరి ఇనాక్, డా॥ వి. చంద్రశేఖర రావులను చెప్పుకోవాలి. చంద్రశేఖర రావు 'ఎక్కడుంది వెలుగు సోనియా' లో 200 పేజిల నవలకు సరిపడ కథవుంది. కానీ కథ చదువుతున్నపుడు సాగదీసిన స్ఫురణ మనకు కలగదు. ఒక విధమైన టెన్షన్నూ, ఉత్సుకత రేకెత్తిస్తూ రచయిత కథను నడపగలిగారు. కనుక, ఇవి కథావస్తువు కాదు, నవలా వస్తువు అనే ఆలోచన పాఠకుడికి రాదు. కథానికకు సరిపోయె వస్తువును నాలుగువారాల్లో శ్రీరమణ రాసి చదివించగలగడం, నవలకు సరిపోయే వస్తువును కథానికలో అమర్చి చంద్రశేఖరరావు మెప్పించగలగడం గమనిస్తే ఒక ప్రక్రియగా

కథ విలక్షణమైన రూపురేఖలను అలవరచుకొంటున్నదని స్పష్టమౌతుంది. ఇంకా ఈ సంవత్సరం కవితాత్మకమైన స్వగతాల్లాంటి కథలు (ఆంధ్రభూమి వారపత్రికలో జి.వి. సుబ్రహ్మణ్యంగారి సుశీల కథలు) వచ్చాయి.

1997లో కథలకు సంబంధించి వచ్చిన మరో ప్రత్యేక్షమైన అంశం - రచయితలు తమ కథల నేపథ్యాన్ని వివరించడం ఆంధ్రజ్యోతి - ఆదివారం అనుబంధంలో వారం వారం వస్తున్న ఈ శీర్షిక - కథానిక వెనక వున్న ప్రేరణలు విప్పి చెప్పడంతోపాటు, రచయితలు సంజాయిషీలు ఇచ్చుకోవడానికి కూడా ఉపయోగపడుతుంది.

ఈ సంవత్సరం కథలపై సభలు, ఆవిష్కరణలు, సదస్సులు, చర్చాగోష్ఠులు విరివిగా, ఆసక్తికరంగా సాగాయి. ఇంతకు ముందు చెప్పినట్టు, ఎన్నో తాజా కథా సంపుటాలు కథా సంకలనాలు వెలువడ్డాయి. కొత్త కథకుల సంఖ్య గణనీయంగా పెరిగింది. కథలపై ఘాటైన చర్చలు జరిగాయి. ఇవన్నీ కథ భవిష్యత్తుపై ఆశను కలిగించే పరిణామాలే. అయితే కథల వ్యాప్తికి దీటుగా వాటి నాణ్యత కూడా పెరిగితే, పత్రికలు కథల సంఖ్య పట్ల కంటే, ఎంపిక పట్ల ఎక్కువ శ్రద్ధ వహిస్తే, పోను పోను కథా ప్రమాణాలు పెరుగుతాయి.



## పి.హెచ్.డి. డిగ్రీ పొందిన వారు

* ఎన్. రజని - తొలితరం తెలుగు రచయితలు స్త్రీ సమస్యల చిత్రణ
  గైడ్ : కె. కుసుమాబాయి

## పి.హెచ్. డి. లో చేరినవారు

* జె. నీరజ - కె.ఎన్.వై. పతంజలి రచనలు
  గైడ్ : కె. రుక్నుద్దీన్
* s. బాలకామేశ్వరి - చింతా దీక్షితులు సాహిత్యం పరిశీలన
  గైడ్ : వెలిదండి నిత్యానందరావు
* ఎమ్. డి. సలీం - 1985 - 95 మధ్య తెలుగులో
  స్త్రీ వాదకథలు - భిన్నధోరణులు
  గైడ్ : ఎమ్. చెన్నప్ప
* పి.వి. కృష్ణారెడ్డి - కొడవటి గంటి కుటుంబరావు సృజనాత్మక రచనల్లో
  జీవన సంబంధాలు
  గైడ్ : ఎల్లూరి శివారెడ్డి

## ఎం. ఫిల్ పొందినవారు

* పి. రంగయ్య - సీమకథలు - సామాజికాంశాలు
  గైడ్ : ననుమానస్వామి

## ఎం. ఫిల్. లో చేరిన వారు

* సి.హెచ్. వెంకటరాంరెడ్డి- రుతుపవనాలు కథలు పరిశీలన
  గైడ్ : పి. సుమతీ నరేంద్ర
* బి. లక్ష్మయ్య - ఓల్గా కథలు, వస్తు పరిశీలన
  గైడ్ : ఎన్. గోపాల్
* బి. నరసింగరావు - కొత్తకథా పరిశీలన (సంపుటి)
  గైడ్ : బి. కేశవులు

## ఎం.ఫిల్ పొందినవరు

* పి. శరత్‌బాబు - శీలా వీర్రాజు జీవితము-రచనలు
  గైడ్ : ననుమాన స్వామి
* జె. మురళీకృష్ణ - తెలుగు కథానిక - దళిత పాత్ర చిత్రణ
  గైడ్ : వాసా ప్రభావతి

# 1997 కథాసంపుటాలు - సంకలనాలు

* యోగి ..... వెల. రూ. 100/-
రచన : జనార్దన మూర్తి
ప్రతులకు : శ్రీ కృష్ణప్రసాద్ గ్రాఫిక్స్, 1-1-178/ఎ, చిక్కడపల్లి
* ఆమెలో ఏముంది? ..... వెల. రూ. 25/-
రచన : డా॥ డి.వి.ఎస్.బి. రామ్మూర్తి
ప్రతులకు : డా॥ ఎన్. రమాదేవి, జి1, బాలాజి అపార్ట్‌మెంట్స్,
3వ లైన్, అశోక్‌నగర్, గుంటూరు - 522 002.
* అలరాస పుట్టిళ్ళు ..... వెల. రూ. 60/-
రచన : కళ్యాణ సుందరీ జగన్నాథ్
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* రావికొండలరావు కథలు ..... వెల. రూ. 65/-
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* నవ్వాలను 'కొంటె' కథలు ..... వెల. రూ. 45/-
రచన : పోలాప్రగడ సత్యనారాయణమూర్తి
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* ఇచ్ఛాగ్ని ..... వెల. రూ. 35/-
రచన : కేతు విశ్వనాథరెడ్డి
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* అవసరాల రామకృష్ణారావు కథలు ..... వెల. రూ. 35/-
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* కథావశిష్టులు ..... వెల. రూ. 50/-
రచన : ఏయస్వీ రమణారావు
ప్రతులకు : రచయిత, 22-73-11/5, సీతారామస్వామి కోవెల వీధి,
విశాఖపట్టణం - 530 001.
* కాదేది కథ కనర్హం ..... వెల. రూ. 60/-
రచన : డి. కామేశ్వరి కథలు
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* ఆమె నోరు విప్పింది ..... వెల. రూ. 30/-
రచన : దోనేపూడి ప్రేమ్‌దులారి
ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని శాఖలు
* నాలుగు దృశ్యాలు ..... వెల. రూ. 40/-
రచన : ఆడెపు లక్ష్మీపతి
ప్రతులకు : ఆదిత్య పబ్లికేషన్స్, ఇం.నెం. సి-50, విద్యానగర్,
గోదావరి ఖని - 505 210, కరీంనగర్ జిల్లా.
* మన్నించు ప్రియా ..... వెల. రూ. 32/-
రచన : డా॥ కోగంటి విజయలక్ష్మి
ప్రతులకు : రచయిత్రి, ఈస్ట్ పాయింట్ కాలనీ, 6-17-16/1,
విశాఖపట్టణం - 530 003.
* మయూరాక్షి ..... వెల. రూ. 100/-
రచన : ఘండికోట బ్రహ్మాజీరావు
ప్రతులకు : రచయిత, 46-18-11, మండావారి పేట,
విశాఖపట్టణం - 530 016.
* ముక్త ..... వెల. రూ. 50/-
రచన : కుప్పిలి పద్మ కథలు
ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైద్రాబాద్
* మనోచిత్రం ..... వెల. రూ. 35/-
రచన : అల్లూరి (పెన్మెత్స) గౌరీలక్ష్మి
ప్రతులకు : చంద్రకాంతి పబ్లికేషన్, ప్లాట్ నెం. 31, వినాయక నగర్,
ఆర్‌సీ కాలనీ, హయత్‌నగర్, రంగారెడ్డి - 501 505

